 27 7/81

# కొడిగు నవలలు

A.V.M-సంఘం

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## భేతాళుడి తాళంచెవి
రచన : వసుంధర

## టక్కరి చుక్క
రచన : సికిందర్

## గుండుచేసిన మేలు
రచన : ఇమంది రామారావు

## జేబు దొంగ
రచన : ఎమ్. వి. వి. సత్యనారాయణ

రక్తం త్రాగే పిశాచం - రెండవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—92
ఆగస్టు, 1981
వెల: రు. 5-00
ఏడాది చందా 60 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# భేతాళుడి తాళంచెవి!

## వసుంధర

శాస్త్రి, శర్మ ఒక గదిలో కూర్చుని భవిష్యత్తు గురించి చర్చిస్తున్నారు.

"మనం చాకులాంటి కుర్రాళ్ళం. కానీ డబ్బెందుకు వెనకేయలేకపోతున్నామో తెలియడంలేదు—" అన్నాడు శాస్త్రి.

"ఎంత సంపాదించినా హారతి కర్పూరంలా హరించుకుపోతోంది. ఇలాగైతే మనం జీవితంలో స్థిరపడేది ఎప్పుడో—" అన్నాడు శర్మ.

"స్థిరమంటే గుర్తొచ్చింది. ఈ యింటికి అద్దె ఇవ్వాలి. లేకపోతే రేపే మనమీ యిల్లు ఖాళీ చేయాలి. ఆ దాలోచించావా?" అన్నాడు శాస్త్రి.

"ఆలోచించడానికేముంది? రాఘవరావుగారింటికి వెళ్ళడమే!" అన్నాడు శర్మ.

రాఘవరావు ఆ ఊళ్ళో చిన్నసైజు కంట్రాక్టరు. ఆయన కిద్దరు కూతుళ్ళున్నారు. రమ, ఉమ వాళ్ళ పేర్లు.

ఓ రోజు బీచి దగ్గర ఆ యిద్దరూ శాస్త్రినీ, శర్మనీ చూసి చెరోకళ్ళూ, చెరొకర్నీ ఎన్నుకొని ప్రేమించేశారు. ప్రేమించి ఊరుకోకుండా ఆ విషయం సూటిగా మొహం మీదే చెప్పేశారు.

మిత్రులిద్దరికీ నోట మాటరాలేదు.

చూడ్డానికి పిల్లలిద్దరూ మెరుపు తీగల్లాగే వున్నారు. కంఠాలు తియ్యగా వున్నాయి. ఎటొచ్చీ మరీ అంత సూటిగా అడిగేయడమే మోటుగా వుంది.

"ప్రేమకూ మాకూ ఆమడదూరం—" అన్నాడు శాస్త్రి.

"నేను ప్రేమనుకాదు రమను—" అంది రమ.

"నేను ఉమను—" అంది ఉమ.

"ప్రేమించడానికి మనుషులే దొరకలేదా?" అనడిగాడు శర్మ.

"మనుషులు దొరక్కే శైలామజ్నాను ప్రేమించింది?" అంది రమ.

"సరే—బాగానే వుంది. మనం కాసేపు కూర్చుని మాట్లాడుకుందాం—" అన్నాడు శాస్త్రి.

"అలాగన్నారు బాగుంది—" అంది ఉమ.

సముద్రపుటొడ్డున నలుగురూ వలయాకారంలో కూర్చున్నారు.

శాస్త్రి తమ గురించి చెబుతూ—"మాకు తాడూ బొంగరంలేదు. స్థిరనివాసంలేదు. ఓ సంపాదనంటూలేదు. మమ్మల్ని మీ రెందుకు ప్రేమిస్తున్నారో తెలియడం లేదు—" అన్నాడు.

"తాడూ బొంగరం మేమే కొనిస్తాం. స్థిరనివాసమంటారా — పెళ్ళయితే అదే ఏర్పడుతుంది. ఇంక

సంపాదన సంగతి— పెళ్ళికాకముందు మా నాన్నకు నెలకు రెండువందల రూపాయల జీతం. అందులోనే యాభై రూపాయలు ఖర్చుపెట్టుకొని మిగతాది మిగుల్చుకొనే వాడు. పెళ్ళయ్యాక నెలకు అయిదువందలు ఖర్చయ్యేది. నాన్న వుద్యోగం మారాడు. ఖర్చు వెయ్యిరూపాయలు అయింది. నాన్న కంట్రాక్టులు మొదలుపెట్టాడు. దీని భావమేమిటంటే— ." అంటూ ఆగి ఉమవైపుచూసింది రమ.

"ఖర్చుపెట్టే పెళ్ళాముండాలిగానీ—ఎలాగో అలా సంపాదిస్తాడు మగాడు—" అంది ఉమ.

"ఈ సిద్ధాంతాన్ని నమ్మే ఆడవాళ్ళంటే నాకు భయం—" అన్నాడు శర్మ.

"అవన్నీ తర్వాత—నువ్వు నన్ను ప్రేమిస్తున్నావో లేదో చెప్పు—" అంది ఉమ. రమ కూడా శాస్త్రిని అదే ప్రశ్న వేసింది.

లేదనడానికి మిత్రులిద్దరికీ మనస్కరించలేదు. "ప్రేమిస్తున్నాం కానీ పెళ్ళిచేసుకోలేం—" అనేశా రిద్దరూ ఏకగ్రీవంగా.

"అయితే పెళ్ళి చేసుకొనేదాకా ప్రేమిస్తూ వుండండి"—అన్నారు అతివలిద్దరూ ఏక కంఠంతో.

అప్పట్నించీ వారు ఒకరినొకరు కలుసుకొంటేనే వున్నారు. నెల్లాళ్ళు అలా జరిగింది. ఓ రోజున రమ, ఉమ చెరో తాడూ బొంగరంతో వచ్చారు. అవి తమతమ ప్రేమికులకు అందజేసి — "మీకు తాడూ బొంగరం వచ్చేశాయి. స్థిరనివాసమంటారా— నెల్లాళ్ళనించి ఒకే యింట్లో వుంటున్నారు. అది చాలు మాకు—" అన్నారు.

"మరి సంపాదన?" అన్నాడు శర్మ.

"సంపాదనకేముంది? మాకు మరీ ఎక్కువ ఆశల్లేవు. ఇద్దరూ నెలకో రెండువేలు సంపాదించండి—" అంది ఉమ.

శర్మ, శాస్త్రి నావల్ల కాదంటే నావల్ల కాదన్నారు.

"వారంరోజులు టయిమిస్తున్నాం. ప్రయత్నించండి. చెరో రెండువేలు తీసుకొని మా దగ్గరకు రండి. అది మీ సమర్థతను ఋజువు చేస్తుంది. మీకు చేతకాదూ—మా దగ్గరకొచ్చి అడగండి. ఇద్దరికీ చెరో రెండువేలూ మేము యిస్తాం. అయితే అప్పుడు షరతు మారిపోతుంది. మేము భర్తల్లాగా, మీరు భార్యల్లాగా ప్రవర్తించాలి—" అంది రమ.

"అంటే ఆపరేషన్ చేయించుకొని సెక్స్ మార్చుకోవాలా?" అన్నాడు శాస్త్రి కంగారుగా.

"అదేం కాదు. మేము బైటకువెళ్ళి డబ్బు సంపాదిస్తాం. మీరింట్లో వుండి వంటచేయాలి. బట్టలుతకాలి. ఇంటి పనులన్నీ చేయాలి—" అంది ఉమ.

"చూసేవాళ్ళు నవ్వుతారేమో—" అన్నాడు శర్మ.

"అది మీ యిష్టం. మీరు సంపాదిస్తే కాదనం. మీరైనా సంపాదించాలి, మమ్మల్నయినా సంపాదించనివ్వాలి. లేకపోతే సంసారమెలా గడుస్తుంది?" అంది రమ.

"ఇంతకీ మీరు పెళ్ళి నిశ్చయమైనట్లే మాట్లాడేస్తున్నారే—" అన్నాడు శాస్త్రి.

"అన్నింటికీ వారంరోజులే టయిం. ఈ లోగా మమ్మల్ని మీ పాద దాసీలుగా చేసుకుంటారో, మీరు మాకు పాదదాసులుగా వుంటారో—లేక మనం

ఒకరికొకరం అపరిచితులంగా మిగిలిపోతామో తేల్చుకోండి. వచ్చే శుక్రవారం—సాయంత్రం ఆరుంపావుకు సరిగ్గా ఇక్కడే మనం మళ్ళీ కలుసుకుందాం—" అన్నారు ఉమ, రమ.

## 2

శుక్రవారం వచ్చేసింది. శాస్త్రి, శర్మ జీవితంలో చెప్పుకోదగ్గ మార్పేమీ రాలేదుకానీ డబ్బు అవసరాలు మాత్రం పెరిగిపోయాయి. వాళ్ళ బకాయి ఇంటాయన కొక్కడికే కాదు. వాళ్ళు బాకీ ఉన్న వారందరిలోకీ గడ్డు మనిషి ఆయన. గడ్డు మనుషులకు తప్ప శాస్త్రి, శర్మ ఓ పట్టాన బాకీలు తీర్చరు.

"ఆ మాటకొస్తే ఈ యింటి యజమానికీ డబ్బవసరం లేదు. కానీ ఆయన—అద్దె ఇవ్వకపోతే చెంబు, తప్పేలా బైట పారేసి ఇంటికి తాళంవేసుకుపోతాడు—" అన్నాడు శర్మ.

"అందుకే — రాత్రి ఆయన వచ్చేలోగా మనం రాఘవరావుగారింటికి వెళ్ళాలి అంటావు—" అన్నాడు శాస్త్రి.

"అవును. వాళ్ళు మనకు సంపాదించి పెడతామని కూడా అంటున్నారు. కొన్నాళ్ళు మనిద్దరం రెస్టు తీసుకోవచ్చు—ఎప్పుడో అప్పుడు పెళ్ళిచేసుకోవలసిన వాళ్ళమేగా—ఈ పిల్లలు బాగున్నారు. చేసుకుంటే పోలా?" అన్నాడు శర్మ.

"కానీ వాళ్ళు మన్ని—ఇంటికి రమ్మన్నారా—బీచికి రమ్మన్నారా?" అన్నాడు శాస్త్రి.

"బీచికే రమ్మన్నారు. కానీ మనం ఇంటికి వెడదాం-చూచిరమ్మంటే కాల్చివచ్చినట్లుంటుంది. అట్టోముక్కో

అక్కడే తేలిపోతుంది__" అన్నాడు శర్మ.

మిత్రులిద్దరూ ఇంటికి తాళంవేసి బయల్దేరారు. శాస్త్రి ఆకలిగా వుందని హోటల్‌కు వెడదామన్నాడు. శర్మ వారించి—"కాబోయే అల్లుళ్ళం. మామగారేదో పెట్టక పోడు. తీరి కూర్చుని మన డబ్బులు వృధా చేసుకోవడ మెందుకు? ఎందుకైనా పనికొస్తాయి—" అన్నాడు. శాస్త్రి మిత్రుడి తెలివిని అభినందించాడు.

రాఘవరావు ఇల్లు పెద్దది. దానిచుట్టూ పెద్ద ప్రహారీ గోడ వుంది. మధ్యలో దానికో పెద్దగేటుంది. ఆ గేటు ముందో పెద్ద కాపలావాడు కూర్చుని వున్నాడు. వాడికి పెద్ద పెద్ద కళ్ళతోపాటు పెద్ద మీసాలు కూడా వున్నాయి. వాడు వీళ్ళని ఆపాడు.

"అయ్యా మీసాల్రాజుగారూ—మమ్మల్ని కాస్త లోపలికి పోనిస్తారా?—" అన్నాడు శర్మ.

"నా పేరు మీసాల్రాజు కాదు. మోసాల్రాజు—" అన్నాడు కాపలావాడు.

"అరే—నేను మోసాల్రాజనే అన్నానే—మీకు మీసాల్రాజని ఎలా విన్పించింది చెప్మా? పోనీలెండి మమ్మల్ని లోపలికి పోనిస్తారా?" అన్నాడు శర్మ.

"పోనివ్వను. ఎందుకంటే మీ రెవ్వరో నాకు తెలియదు—" అన్నాడు మోసాల్రాజు.

శాస్త్రి కోపంగా వాడివంక చూసి, "రాఘవరావు నీ స్నేహితుల్నే కానీ—గన స్నేహితుల్ని లోపలకు రానివ్వడా?" అన్నాడు.

శాస్త్రి స్వరం విని తడబడ్డాడు మోసాల్రాజు.

"ఏం—మాట్లాడవేం?"

ఇంతలో మోసాల్రాజు వినయంగా అక్కణ్ణించి

కదిలి — గేటు తెరిచాడు. శాస్త్రి, శర్మ లోపలికి వెళ్ళబోయి ఆగిపోయారు. లోపల్నించి ఓ కారు వచ్చి గేటు దగ్గరే ఆగింది. అందులోంచి రాఘవరావు బైటకు వంగి చూసి—"రాజూ—ఎవరు వీళ్ళు?" అడిగాడు.

"మీ స్నేహితులండి—" అన్నాడు మోసాల్రాజు.

రాఘవరావు వాళ్ళవంక చూసి—"అయితే ఇక్కడ నిలబడ్డారేం? లోపలకు వెళ్ళండి—" అన్నాడు. అన్నదే తడవుగా శాస్త్రి, శర్మ లోపలకు వెళ్ళారు. గేటు తలుపులు మూసుకొన్నాయి.

"స్నేహితులంటే ఆయన ఆశ్చర్యపడలేదేమిటీ?" అన్నాడు శర్మ.

"అసలెవరూ అని అడగలేదేమిటీ?" అన్నాడు శాస్త్రి.

"పైగా లోపలకు పొమ్మన్నాదేమిటీ?" అన్నాడు శర్మ.

"ఇప్పుడు మనమేం చెయ్యాలి?" అన్నాడు శాస్త్రి.

"అన్నట్లు మనమిద్దరం ఒకరినొకరు ప్రశ్నలేసుకుంటున్నాం. జవాబుల గురించి ఆలోచించడంలేదు—" అని ఇద్దరూ ఏక కంఠంతో అని ముందుకు నడిచారు.

అలా కొంతదూరం నడిచేసరికి బంగళా వచ్చింది. బంగళాముందు ఓ రాక్షసరూపుడు కూర్చున్నాడు.

"నమస్కారం—రావణరావుగారూ—" అన్నాడు శాస్త్రి.

"అరే — నా పేరు మీకెలా తెలుసు?" అంటూ ఆశ్చర్యపోయాడు రావణరావు.

ఈసారి ఆశ్చర్యపోవడం శాస్త్రి వంతయింది. శర్మ కలగజేసుకొని—"పేరులో ఏముంది అని చాలామంది

అంటారు. కానీ మిమ్మల్ని చూస్తే చాలా వుందనిపిస్తుంది" అన్నాడు.

"ఆహా— ఈ మాటలు నా భార్య సీత వింటే ఎంత ఆనందిస్తుంది?" అన్నాడు రావణరావు.

మిత్రులిద్దరూ మళ్ళీ ఆశ్చర్యపడి—"అయ్యా! ఇంట్లో రాఘవరావుగారి అమ్మాయిలున్నారా?" అనడిగారు.

"ఎందుకుండరు? ఇది వారి యిల్లే!" అన్నాడు రాఘవరావు.

"ఓసారి వాళ్ళను పిలుస్తారా?"

"పిలిస్తే వాళ్ళు రారు—"

"మరి మేమొచ్చినట్లు వాళ్ళకెలా తెలుస్తుంది?"

"లోపలకు వెళ్ళండి—" అన్నాడు రావణరావు.

ఇద్దరూ వెంటనే లోపలకు వెళ్ళారు. అక్కడో పెద్ద హాలు. చుట్టూ నాలుగు గదులు. మధ్యలో మెట్లు. సినిమా సెట్టింగులా వుంది. మనుషులెవ్వరూ కనపడలేదు. ఇద్దరూ ఆలోచించి — ఒకో గదిలోనే చూద్దామను కున్నారు. ముందు ఓ గదిలోకి వెళ్ళారు.

అందులో నలుగురు వస్తాదులున్నారు. నలుగురూ చిన్న చిన్న చెడ్డీలు మాత్రం వేసుకొని వున్నారు. నలుగురూ ఒక్కసారే శాస్త్రి, శర్మలవంక చూశారు.

శాస్త్రి తడబడుతూ — "ఇక్కడ నలుగురున్నారు. హాల్లో ఒక్కరూ లేరేం?" అన్నాడు.

"మీరు మెట్లెక్కివుంటే మేం నలుగురం వచ్చి ఒక్కసారే పలకరించేవాళ్ళం—" అన్నాడో వస్తాదు.

శర్మ అతడివంక చూసి—"అయ్యా!—భీముడుగారూ, మీరు మాకో చిన్న సహాయం చేయాలి—" అన్నాడు.

"నా పేరు భీముడుకాదు. దుర్యోధనుడు-" అన్నాడు

వస్తాదు.

"సరేలెద్దురూ-ఏదో ఒక పేరు-మీరిక్కడేం చేస్తారో తెలుసుకోవచ్చా?" అన్నాడు శాస్త్రి.

"రాఘవరావుగారి కిద్దరమ్మాయిలున్నారు. వాళ్ళ పేర్లు రమ, ఉమ. వాళ్లు మమ్మల్ని పిలిపించారు—"

"ఎందుకు?" అన్నాడు శర్మ.

"అది మీకెందుకు చెప్పాలి?" అన్నాడు వస్తాదు.

"ఆ అమ్మాయిలే మమ్మల్ని పిలిపించారు—" అన్నాడు శాస్త్రి.

"అలాగా—అయితే మనం మనం స్నేహితులం—చేయి జాపండి—" అన్నాడు దుర్యోధనుడు.

"వస్తాదులతో మేము చేతులు కలపము—" అన్నాడు శాస్త్రి.

"మరి—?" అన్నాడు దుర్యోధనుడు.

"అది మీకెందుకు చెప్పాలి?" అన్నాడు శర్మ.

ఇద్దరూ గదిలోంచి బైటకు వచ్చేశారు. వస్తాదులు మాత్రం బైటకు రాలేదు.

"వ్యవహారమంతా తమాషాగా లేదూ?" అన్నాడు శాస్త్రి.

"వుంది. వాటం చూస్తే మనకు పని తగిలేలా వుంది. ఇంటాయన వచ్చేటైముకి—తాళం పెట్టి వుంటే ఆయన సింహనాదం చేస్తూ అక్కడే ఉండిపోతాడు కూడా—అప్పటికి వెళ్ళగలిగితే బాగుంటుంది—" అన్నాడు శర్మ.

"సరే రెండో గదిలోకి వెడదామా?"

ఇద్దరూ రెండో గదిలో అడుగుపెట్టారు.

అక్కడ నలుగురు ఆడపిల్లలున్నారు. నలుగురూ కూడా ఎంతో అందంగా వున్నారు. వారి లావణ్యంలో

దాపరికంలేదు. అంతా బికినీలలో వున్నారు.

"ఎవరు మీరు?" అన్నాడు శాస్త్రి.

"కనపడ్డంలేదూ—ఆడపిల్లలం" అంటూ గద్దించిందో పిల్ల.

"అమ్మా—మేనకా-మిమ్మల్నో ప్రశ్న అడగొచ్చా?" అన్నాడు శాస్త్రి.

"అరే—నా పేరు నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అన్నదాపిల్ల.

శర్మ శాస్త్రి భుజంతట్టి—"ఈ రోజు నీ పలుకు పలుకుతోంది. మనకు లాటరీలో పదిలక్షలు రావాలను నాయనా!" అన్నాడు.

"అంటే మాత్రం ఎలా వస్తుంది? మనం కొన్న టికెట్ కు ఫస్టు ప్రైజు అయిదు లక్షలే—" అన్నాడు శాస్త్రి.

"ఏదో ప్రశ్న అడుగుతానన్నావ్?" అంది మేనక.

"మీరిక్కడెందుకున్నారు?"

"రాఘవరావుగారి కిద్దరమ్మాయిలున్నారు. వాళ్ళు మమ్మల్ని పిలిపించారు—"

"ఎందుకు?"

"ఈ ప్రశ్న అడగడానికి మీ రెవరు?" అంది మేనక.

"కనపడ్డంలేదూ—మగపిల్లలం—" అన్నాడు శర్మ. తర్వాత యిద్దరూ బయటకు వచ్చేశారు. ఆడపిల్లలు మాత్రం గదిలోపలే ఉండిపోయారు.

"అంతా ఏదో మిస్టరీలా లేదూ?" అన్నాడు శాస్త్రి.

"వుంది. వాటంచూస్తూంటే ఇక్కడ మన గురించి ఏవో ఏర్పాట్లు జరిగినట్లు కనపడుతున్నాయి—"

"అవును. కానీ ఎందుకు?" అన్నాడు శాస్త్రి.

"జవాబు నాకూ తెలియదు. మిగతా రెండు గదు ల్లోనూ దొరుకుతుందేమో వెదుకుదామా?"

"పోనీ మీరొక్కరే చూస్తే?" అన్నాడు శాస్త్రి.

"అందుకు మనకు అనుమతిలేదు. నలుగురు వస్తాదులూ చుట్టుముడతారు—" అన్నాడు శర్మ.

ఇద్దరూ కలిసి మూడో గదిలోకి వెళ్ళారు. ఆ గది ఖాళీగా వుంది. మధ్యలో ఒకే ఒక్క టేబుల్. దాని మీద ఒకే ఒక్క కాగితం. దానిమీద ఓ పేపర్ వెయిట్.

శాస్త్రి పేపర్ వెయిట్ తీసి ఆ కాగితం చూశాడు. దానిమీద అక్షరాలున్నాయి.

"నేరస్తులెలా శిక్షించాలో నాకు బాగా తెలుసు— రాఘవరావు" అనివుంది దానిమీద.

"ఈ కాగితం ఎవరికంటావ్?" అన్నాడు శాస్త్రి.

"వాటం చూస్తే మనకేలాగుంది?" అన్నాడు శర్మ.

"కానీ మనం నేరస్తులం కామే!"అన్నాడు శాస్త్రి.

"అలా ఎలా చెప్పగలవు? అయిన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతం గుర్తుచేసుకో. పోలీసు దృష్టిలో దొంగ నేరస్తుడు. దొంగ దృష్టిలో పోలీసు నేరస్తుడు—" అన్నాడు శర్మ.

"సరే—ఆఖరు గది కూడా చూద్దాం—"

ఆఖరు గది కూడా ఇందాకటిలాగే వుంది. అందు లోనూ ఒక బల్ల, దానిమీద కాగితం—

"సరిగ్గా ఆరుంపావుకు మనం కలుసుకుందాం—" అని ఒకే ఒక్క వాక్యముందా కాగితంపై.

"అంటే ఉమ నాకోసం ఏర్పాటుచేసిందన్నమాట" అన్నాడు శర్మ.

"రమ నాకోసం—" అన్నాడు శాస్త్రి.

"అదే నిజమైతే—ఇక్కడ వస్తాదులెందుకు? ఆడపిల్లలెందుకు? నేరస్థుల్ని శిక్షించడం గురించి చీటీలెందుకు? అంతా అయోమయంగా లేదూ!" అన్నాడు శర్మ.

"జరిగేదానికోసం ఎదురుచూడ్డం మినహా చేయ గలిగిందేమీ లేదు—" అన్నాడు శాస్త్రి.

# 3

సరిగ్గా ఆరుంపావుకు హాల్లో రాఘవరావు అడుగు పెట్టాడు. ఆయన్ను చూస్తూనే శాస్త్రి, శర్మ సోఫా ల్లోంచి లేచినిలబడ్డారు.

"నేను టయింకే వచ్చాను కదూ?" అన్నాడు రాఘవరావు.

"మీ టయిం సంగతి మాకు తెలియదు. మే మెదురు చూస్తున్నది మీ అమ్మాయిల కోసం!" అన్నాడు శర్మ.

రాఘవరావు ముఖం అదోలాగయింది—"గదులన్నీ పరీక్షించారా?" అన్నాడు.

"ఊఁ."

"వస్తాదుల్ని చూశారా?"

"చూశాం—"

"ఆడపిల్లల్ని చూశారా?"

"చూశాం—"

"నా రెండు చీటీలు చూశారా?"

"రెండో చీటీ కూడా మీదేనా? అది మీ అమ్మా యిలదనుకున్నాం—"

"నాన్సెన్స్!" అన్నాడు రాఘవరావు — "నా కూతుళ్ళు మీ కోసం చీటీలెందుకు రాస్తారు? పిచ్చి పిచ్చి కబుర్లు మాని మీరు నా కూతుళ్ళనేంచేశారో చెప్పండి!"

"ప్రేమించాం—" అన్నాడు శర్మ.

రాఘవరావు తెల్లబోయి—"సరే బాగానే వుంది. ఆ తర్వాత?" అన్నాడు.

"ఇంకా ఆలోచించుకోలేదు—"

"ఆలోచించుకునే ముందొక్క మాట! నా గురించి కాస్త తెలుసుకోవడం మంచిది. మిమ్మల్ని నేను ఈ క్షణంగా ఖూనీ చేయించి-మాయం చేసేయగలను—"

"ఎవరి నమ్మకాలు వాళ్ళవి. మమ్మల్నెవ్వరూ ఏ క్షణంలోనూ ఖూనీ చెయ్యలేరని మా నమ్మకం—" అన్నాడు శర్మ.

"మనుషుల నమ్మకాలు కూడా నేను క్షణాల్లో మార్చగలను. చూద్దురుగాని—" అంటూ రాఘవరావు చప్పట్లు కొట్టాడు. ఒక గదిలోంచి వస్తాదులూ—మరో గదిలోంచి ఆడపిల్లలూ వచ్చారు.

"వస్తాదులూ నేను చెప్పిన పని జయప్రదంగా ముగించేక మీ నలుగురికీ ఆ నలుగురు పిల్లలూ బహుమానం. మీరు చెయ్యాల్సింది చాలా సింపుల్. నేను చెప్పగానే మీరు నలుగురూ కలిసి ఆ యిద్దర్నీ పులుసులోకి ఎముక లేకుండా కొట్టాలి. ఎట్టొచ్చీ ఆ యిద్దరూ చావకూడదు—" అన్నాడు రాఘవరావు.

వస్తాదులు తలాడించారు.

"ఇప్పుడు చెప్పండి. మీరు నా కూతుళ్ళనేం చేశారు?" అన్నాడు రాఘవరావు శాస్త్రి, శర్మలవంక తిరిగి.

"ప్రేమించామని ఎన్నిమార్లు చెప్పాలి?"

"ఎందుకు ప్రేమించారు?" రాఘవరావు గద్దించాడు.

"వాళ్ళు బలవంత పెట్టడంవల్ల!"

"మీ ముఖాలు చూస్తే ఆ విషయం ఎవరు నమ్మరు.

మిమ్మల్ని ప్రేమించినవాళ్ళు నా కూతుళ్ళయుండరు-"

"మీ ముఖం చూసేక వాళ్ళు మీ కూతుళ్ళైనా అని మాకూ అనుమానంగా వుంది—" అన్నాడు శాస్త్రి.

"ఏయ్ మిస్టర్! అధికప్రసంగం కట్టిపెట్టి—నా కూతుళ్ళనేం చేశావో చెప్పు!" అన్నాడు రాఘవరావు.

శర్మ విసుగ్గా—"అదే పనిగా ఆ వెధవ ప్రశ్న వేయకపోతే — ఏం చేయాలనుకుంటున్నావో చెప్పి ఏడవరాదూ —" అన్నాడు. అతడలా అనగానే రాఘవరావు కోపం తారస్థాయికి చేరుకొంది.

"వస్తాదులూ—వెళ్ళండి—" అన్నాడు.

వారిలో దుర్యోధనుడు ముందుకు వచ్చి-"వాళ్ళచేత మీ రేదో చెప్పించాలనుకొంటున్నారు. మాట్లాడ్డానికి ఓపికవుండేలా కొట్టమంటారా? లేక చావ చితక బాద మంటారా?" అన్నాడు.

"శ్వాస ప్రాణముంటే చాలు. ఎలాగో నేనే మాట్లాడిస్తాను—" అన్నాడు రాఘవరావు.

వస్తాదులు నలుగురూ వాళ్ళిద్దర్నీ చుట్టుముట్టారు.

శాస్త్రి వాళ్ళవంక చూసి—"తర్వాత మీ రేదో ఆడపిల్లల్ననుభవిద్దామనుకొంటున్నారు. ఆ మాత్రం ఓపిక మీలో ఉంచమంటారా, అవసరంలేదా?" అనడిగాడు.

"అయినా ఆ ఆడపిల్లలు వీరభోజ్యం. ఇక్కడున్న వారిలో మనమే వీరులం—" అన్నాడు శర్మ.

"అట్టే వాక్కండి—" అన్నాడు దుర్యోధనుడు.

"ఒక్క క్షణం—" అన్నాడు శర్మ. "శాస్త్రీ! నువ్వెళ్ళి రాఘవరావుతో విషయమేమిటో మాట్లాడు. నాకు రెండు చేతులూ, రెండు కాళ్ళూ వున్నాయి.

ఇక్కడీ మనుషులూ నలుగురే వున్నారు. వీళ్ళకు నేనొక్కణ్ని చాలు—"

శాస్త్రి శరవేగంతో మాసుకుంటూ రాఘవరావును "మీకు చూడాలనుంటే ఇద్దరం కలిసి యుద్ధం చూద్దాం. లేదా గదిలోకిపోయి వ్యాపారం మాట్లాడుకుందాం—" అన్నాడు.

"ఎంత ధైర్యం మీకు?" అంటూ హుంకరించాడు రాఘవరావు—"వస్తాదులూ — చూస్తారేం — మొదలెట్టండి. పులుసులోకి ఎముక మిగలకూడదు—"

"మీరు పులుసులో ఎముక వేసుకుంటారా? అయితే మీ యింట్లో మేం పులుసు పోసుకోకూడదు-" అన్నాడు శాస్త్రి దిగులుగా.

"నీకు మా యింట్లో భోజనం కూడానా?" అన్నాడు రాఘవరావు.

"అల్లుళ్లకు భోజనం పెట్టే ఆచారం మీకు లేక పోయినా—మామగారింట భోంచేసే ఆచారం మాకుంది. అంచేత మీరు మాకు భోజనం పెట్టక తప్పదు. ఎటొచ్చీ పులుసులో ఎముకలు వేయడానికి వీల్లేదు—" అన్నాడు శాస్త్రి.

"కబుర్లాపి అటు చూడు—" అన్నాడు రాఘవరావు.

"నేను అటే చూస్తున్నాను—" అన్నాడు శాస్త్రి.

నలుగురు వస్తాదులూ నేల కూలడానికి నాలుగు నిముషాలు కూడా పట్టలేదు. మెరుపువేగంలో పని చేశాడు శర్మ. తర్వాత అతను వేగంగా రాఘవరావు దగ్గరకు వచ్చి—"సంగతేమిటో చెప్పండి!" అన్నాడు.

రాఘవరావుకు నోట మాటరాలేదు—"మీరు

మనుషులేనా?" అన్నాడు ఒతికష్టంమీద.

"ఒక్కడిమీదకు నలుగురు వస్తాదుల్ని పంపినవాణ్ని మనిషంటారో అనరో తెలీదుకానీ—నలుగురు వస్తాదుల్ని కొట్టినవాడు మాత్రం మనిషికాకుండాపోడు—ఇప్పుడు చెప్పండి—విషయమేమిటో!" అన్నాడు శర్మ.

"మా అమ్మాయిల్ని మీరెందుకు కిడ్నాప్ చేశారు?" అన్నాడు రాఘవరావు.

"కిడ్నాపింగ్?" ఆశ్చర్యపోయాడు శాస్త్రి.

రాఘవరావు నెమ్మదిగా జరిగింది చెప్పాడు.

ఉదయం ఎనిమిదింటికి రమ, ఉమ యింటిలోంచి బయల్దేరారు. ఉదయం పదింటికి ఓ ఫోన్ వచ్చింది. రమనూ, ఉమనూ ఓ వెధవ కిడ్నాప్ చేశాడు. లక్ష రూపాయిలిస్తే వదిలి పెడతాడట. తన మనుషుల్ని ఈ రోజు ఆరుంపావులోగా ఇంటికిగానీ, బీచికి ఫలానా చోటికిగానీ పంపుతానన్నాట్ట. ఆ మనుషులిద్దరు. వారిని వర్ణించి చెప్పాడు. ఆ వర్ణన శాస్త్రి, శర్మలకు సరిపోయింది. మారు మాట్లాడకుండా వాళ్ళకు డబ్బిచ్చి పంపకపోతే—కూతుళ్ళ ప్రాణాలు దక్కవని హెచ్చరించాడు. రాఘవరావది సవాలుగా స్వీకరించి ఇంటిలో ఏర్పాట్లుచేసి వెళ్ళిపోయాడు.

"ఈ కథ వింటే మీకేమనిపిస్తోంది!" అన్నాడు శర్మ.

"మీరే ఆ కిడ్నాపర్స్ మనుషులు—" అన్నాడు రాఘవరావు.

"అయితే మా కథ వినండి—" అన్నాడు శాస్త్రి.

వినే ఓపికవున్నా లేకపోయినా రాఘవరావుకు ఆ కథ వినక తప్పలేదు.

"మా కథ వింటే మీ కేమనిపిస్తోంది?" అన్నాడు శర్మ.

"నమ్మకూడదనిపిస్తోంది—"

"అయితే మీ బుర్రలో తెలివితేటలు శూన్యం. మీ పిల్లలకు డబ్బు కావాలి. అందుకని తెలివిగా ఈ నాటకమాడారు. అందులో మాకు తెలియకుండానే మేము పాత్రధారులమయ్యాం—" అన్నాడు శాస్త్రి.

"అది సరే—వాళ్ళు డబ్బు సంగతి మనకెందుకు చెప్పలేదు?" అన్నాడు శర్మ.

"అవును — మనకెందుకు చెప్పలేదు?" అన్నాడు శాస్త్రి. ఒక్క క్షణం ఆలోచించి—"బావ్ రే!" అన్నాడు.

"ఏమయింది?" అన్నాడు శర్మ.

"ఆ పిల్ల లెక్కడికో పారిపోతున్నారు. అన్నీ ముందుగానే పథకం వేసుకున్నారు. వాళ్ళకు డబ్బక్కర్లేదు. తండ్రి ఆలోచనలను తప్పుదారికి మళ్ళించడమే వారి ప్రథమోద్దేశ్యం. ఆయన మన్ని నానా హింసలు పెట్టి నిజం కక్కించడానికి ప్రయత్నిస్తూండగా వాళ్ళు గమ్య స్థానం చేరుకుంటారు—"

రాఘవరావు ముఖం పాలిపోయింది.-"మీరు చెప్పింది నిజంలాగే తోస్తోంది. వాళ్ళకి ఆ అణాకానీ వెధవలు—చంద్రం, భద్రంలతో స్నేహం—" అన్నాడాయన.

"వాళ్ళెవరు?"

"వీళ్ళందరికీ నాటకాల పిచ్చి. నాటకాల్లో వాళ్ళు హీరోలు. వీళ్ళు హీరోయిన్‌లు. వీళ్ళంతా కలిసి సినిమా ఛాన్సులు కోసం ప్రయత్నిస్తున్నారు. ఎదిగిన పిల్లల్ని ఎంతకని అదుపులో పెట్టను?" అన్నాడు రాఘవరావు.

శాస్త్రికి జాలేసింది—"మరి కొన్ని వివరాలు చెబితే మేం మీకు సాయపడగలం—" అన్నాడు.

"వీళ్ళంతా మద్రాసు చేరుకుంటారు. అక్కడ బేతాళరావు ఇంటికి వెడతారు —" అన్నాడు రాఘవరావు.

"బేతాళరావా? వాడెవడు?"

"మద్రాసులో వుండే పిశాచాలన్నింటికీ వాడే రాజు. రాత్రి ప్రభు వన్నది వాడికి మారు పేరు. సినిమాల పేర్లు చెప్పి ఆడపిల్లల్నాకర్షించి—వాళ్ళను మరొకందుకుపయోగించుకుంటాడు. వాడు చెయ్యని రాత్రి వ్యాపారంలేదు. ఆడపిల్లల్ని వాడు కేవలం వ్యభిచారానికేకాక-స్మగ్లింగ్ కీ రాజకీయాలకీ కూడా వుపయోగించుకుంటాడు. దురదృష్ట మేమంటే — వాడు పూర్తిగా అబద్ధాలకోరు కాదు. బొంబాయిలోని ఇద్దరు ప్రముఖ తారలూ, మద్రాసులో ఎనమండుగురు ప్రముఖ తారలూ—వాడి మూలంగానే పైకి వచ్చారు. అందువల్ల వాడి మోసం అలా కొనసాగ గల్గుతోంది—" అన్నాడు రాఘవరావు.

"మీ అమ్మాయిలక్కడికే వెడతారని మీకెలా తెలుసు?"

"వాళ్ళకేమన్నా భయమా? నన్నే అడిగారు. నేను కాదన్నాను. బేతాళరావు కథలన్నీ వాళ్ళకి చెప్పాను. వాళ్ళు నా కథలు చెవిని పెట్టకుండా—"నాన్నా— నువ్వు వ్యాపారంలో పైకొచ్చావు. నీ గురించి కూడా ఎన్నో చెడు కథలు ప్రచారంలో వున్నాయి. మనం మంచినే తీసుకోవాలి. చెడును వదిలిపెట్టాలి—" అన్నారు. అప్పట్నించి నేను భయపడుతూనే వున్నాను. కానీ నిజంగా అనుకొన్నంతపని చేస్తారని నేననుకోలేదు"

అన్నాడు రాఘవరావు.

"అయ్యా! రాఘవరావుగారూ-ఇది మీరు చేజేతులా కొని తెచ్చుకున్నారు. మీలో ఆవేశమేగానీ ఆలోచన లేదు. మేము ఇంటికి రాగానే మమ్మల్ని తన్నించాలనే అనుకున్నారు తప్పితే మా కథేమిటో వినడానికి కూడా ప్రయత్నించలేదు. మీ తత్వాన్ని మీ అమ్మాయిలు బాగా వుపయోగించుకున్నారు. జరిగిందేదో జరిగిపోయింది. మీరు కోరితే మేమిద్దరం వెళ్ళి ఆ బేతాళరావు దగ్గర్నుంచి మీ పిల్లల్ని విడిపించుకొనివస్తాం!" అన్నాడు శాస్త్రి.

"అలాగా — అందుకు మీ ఫీజు!" అన్నాడు రాఘవరావు.

"మీ అమ్మాయిల్ని సాధించుకువచ్చాక ఓ లక్ష రూపాయలివ్వండి."

"నా పిల్లలు ప్రాణాలతో బ్రతికి బయటపడితే లక్ష రూపాయలు నాకో లెక్కలోదికాదు—" అన్నాడు రాఘవరావు. ఒక వేడి నిట్టూర్పు ఆయన పెదాలనుంచి బయటపడింది.

# 4

"నా పేరు శర్మ, అతడి పేరు శాస్త్రి—" అన్నాడు శర్మ.

"ఏం చేయగలరు మీరు?" అన్నాడు బేతాళరావు.

"అడిగిన జీతం ఇస్తే—చెప్పిన పని చేయగలం—" అన్నాడు శాస్త్రి.

బేతాళరావు నవ్వి—"అడిగిన జీతమివ్వకుండా చెప్పిన పని చేయించుకోవడం నాకు తెలుసు. ఎప్పుడైనా మీ అవసరమొస్తే కబురుపెడతాను. అడ్రసిచ్చి వెళ్ళండి-" అన్నాడు.

"మాకు అడ్రసులేదు. పని లేక తిరుగుతున్నాం. వుండనిస్తే మీ యింట్లో వుంటాం—"

"మా యింట్లో ఖాళీలేదు. అప్పుడప్పుడు కనబడుతూండండి. పనున్నప్పుడు చెబుతాను—" అన్నాడు బేతాళరావు.

"మీకు మా సామర్థ్యం తెలియదు. ఎంతటి మనిషినైనా క్షణాలమీద పడగొట్టగలం. ఒక్కళ్లం పదిమందికెదురు నిలిచి పోరాడగలం—" అన్నాడు శర్మ.

బేతాళరావు చిరాగ్గా-"అయితే ఓ చిన్న పరీక్ష పెడతాను—" అంటూ పక్కనే వున్న ఫోన్‌లో ఎవరికో ఏదో చెప్పాడు. శాస్త్రి, శర్మలవంక చూసి-"ఒక్క అయిదు నిముషాలాగండి!" అన్నాడు.

"అయిదు నిముషాలాగామంటే చాలు. ఎప్పటికీ ఇక్కడే ఆగిపోతాం-" అన్నాడు శాస్త్రి.

బేతాళరావు చిరునవ్వు నవ్వాడు.

కొద్దిసేపట్లో అక్కడికి ఓ సన్నపాటివ్యక్తి వచ్చాడు. బేతాళరావు అతణ్ని శాస్త్రి, శర్మతో పరిచయంచేసి "ఇతడి పేరు కోనేటిరావు. ఒక్కడూ వందమందికి సమాధానం చెప్పగలడు. మీ సత్తా ఏమిటో ఇతడిముందు ప్రదర్శించండి. ఎందుకైనా మంచిది—ఇద్దరూ కలిసి వెళ్ళండి—" అన్నాడు.

శర్మ నవ్వి—"నేనొకణ్ని చాలు—" అన్నాడు.

కోనేటిరావు చొక్కావిప్పాడు. ఒక్కసారి చేతులు విదిల్చి కండలు పొంగించాడు. ఆ సన్నటి మనిషి అసలు స్వరూపం అప్పుడే కనబడింది.

శర్మ, కోనేటిరావు ఇద్దరూ అరచేతుల్ని బాకుల్లాచేసి ఒకరికొకరు ఎదురుగా నిలబడ్డారు.

"రెడీ—" అన్న బేతాళరావు మాట వినపడడ మేమిటి—కో నేటిరావు మెరుపు వేగంతో కదిలాడు. శర్మ కదిలాడో లేదోకానీ—నేలమీద కదలకుండా పడివున్నాడు.

"మై గాడ్!" అన్నాడు శాస్త్రి.

"మీరన్నది నిజమే! ఇక్కడ అయిదు నిముషాలాగితే ఇంక ఎప్పటికీ ఆగిపోవచ్చు—" అన్నాడు బేతాళరావు.

"నువ్వూ వస్తావా?" అన్నాడు కోనేటిరావు.

"అవసరం లేదు. శర్మ తర్వాతే నేనూ. అతను చేయలేని పని నావల్లకాదు—" అన్నాడు శాస్త్రి. అతను కూడా మిత్రుడి దగ్గరకు వెళ్ళాడు.

"భయపడకు. నీ మిత్రుడు చావలేదు—" అన్నాడు కోనేటిరావు—"నేను మనుషుల్ని చంపను—"

బేతాళరావు నవ్వి—"నా దగ్గర ఇలాంటి కోనేటి రావులు పదిమంది వున్నారు. ఇప్పుడు చెప్పండి. మీరు నాకేవిధంగా సాయపడగలరో—" అన్నాడు.

"శారీరకబలం అలాగుంచండి. బుద్ధిబలంలో మాకు మేమేసాటి!" అన్నాడు శాస్త్రి.

"మీ నమ్మకం మంచిదే—అయితే దానికీ ఓ పరీక్ష పెడతాను—" అన్నాడు బేతాళరావు.

పరీక్ష అనగానే శాస్త్రికి భయంవేసింది. కోనేటి రావును శర్మ అవలీలగా నెగ్గుతాడనుకున్నాడు. కానీ అలా జరగలేదు. బుద్ధిబలం పరీక్ష ఎలా వుంటుందో?—

"పరీక్షల్లో తేరే బుద్ధివల్ల పెద్దగా ప్రయోజనముండదు. అందువల్లే కదా-ఫస్టుమార్కుల్లొచ్చిన వాళ్ళంతా గుమస్తాలుగా మిగిలిపోతున్నారు!" అన్నాడు శాస్త్రి.

"నువ్వన్నది నిజమే—అందుకే మీకు పరీక్ష వేరేగా

వుంటుంది—" అన్నాడు బేతాళరావు.

"చెబితే వింటాను-" అన్నాడు శాస్త్రి.

"ముందు నీ మిత్రుణ్ని లేవనీ—" అన్నాడు బేతాళ రావు.

శర్మకు ఉపచారాలు చేయగా ఓ అయిదు నిముషాల్లో స్పృహ వచ్చింది-"నేనెక్కడున్నాను?" అన్నాడు.

"ఇంకా ఇక్కడే!" అన్నాడు శాస్త్రి.

"నువ్వు కులాసాయేనా?" అనడిగాడు శర్మ.

"నీ దయవల్ల!" అన్నాడు శాస్త్రి. ముందు శర్మ పడిపోకుండా వుంటే—కోనేటిరావు శక్తి శాస్త్రికి తెలిసేదికాదు. అందువల్ల అతడన్న మాటల్లో నిజముంది.

శాస్త్రి శర్మకు పరిస్థితి వివరించి చెప్పాడు. ఇద్దరూ బేతాళరావు దగ్గరకు వెళ్ళారు.

"నా దగ్గరకు కొత్తగా ఇద్దరాడపిల్లలు వచ్చారు. వాళ్ల శరీరంపై గాయం చేయకుండా—మీ బుద్ధిబల ముపయోగించి—వాళ్ళు నా మాట వినేటట్లు చేయాలి!" అన్నాడు బేతాళరావు.

ఇద్దరాడపిల్లలనగానే మిత్రులిద్దరిలో ఆశ చిగురించింది. వచ్చిన పని ఇంత త్వరగా సానుకూలమైతే అది ఆశ్చర్యమే! ఏది ఏమైనా బేతాళరావు అసాధ్యుడిలాగే వున్నాడు. విషయం పూర్తిగా తెలుసుకోవాలి.

"ఆ పిల్లలకు మీరేం చెప్పబోతున్నారు?" అన్నాడు శాస్త్రి.

"అది మీ కనవసరం. ఫలానా బేతాళరావు ఏం చెబితే అది చేయమని వాళ్లకు చెప్పాలి-"

"అది మావల్ల కాదా?"

"ఎందుకు కాదు? పోనీ మీ బుద్ధి బలానికి పరీక్ష

పెట్టినట్లుంటుంది కదా అని ఓ చిన్న అవకాశమిస్తున్నాను" అన్నాడు బేతాళరావు.

"సరే—వాళ్ళెక్కడున్నారో మాకు చూపించండి-" అన్నాడు శర్మ.

"అలాగే—కంగారుపడకండి—" అన్నాడు బేతాళరావు. ఆయన కోనేటిరావుకు కనుసైగ చేశాడు. కోనేటిరావు వాళ్ళిద్దరి కళ్ళకూ గంతలు కట్టాడు.

## 5

కళ్ళు తెరిచేసరికి మిత్రులిద్దరూ ఓ గదిలో వున్నారు. గదిలో మంచంమీద ఇద్దరతివలు నిద్రపోతున్నారు. వాళ్ళు రమ, ఉమలు.

శాస్త్రి, శర్మలకు కలిగిన ఆనందమింతా అంతా కాదు.

వారి వెనుకనే గది తలుపులు మూసుకున్నాయి.

శాస్త్రి చిరాగ్గా వెళ్ళి గదితలుపులు తనే గడియవేసి "లోపల ఆడపిల్లలుండగా తలుపులు వాళ్ళెందుకు వేయాలి? మనమే వేసుకుంటాం-" అన్నాడు.

శర్మ నవ్వి—"ముందు మనం వాళ్ళని లేపాలి!" అన్నాడు.

వాళ్ళిద్దరూ ఆడవాళ్ళను లేపారు. కళ్ళు నులుముకుంటూ లేచిన రమ, ఉమ వీళ్ళిద్దర్నీ చూసి ఆశ్చర్యపడ్డారు- "మీరిక్కడికెలా వచ్చారు?" అని అడిగారు ఏక కంఠంతో.

శాస్త్రి జరిగినదంతా చెప్పాడు.

రమ విచారంగా — "మిమ్మల్ని మోసం చేసినందుకు మేమిప్పుడు విచారిస్తున్నాం. అందుకే మాకు తగిన శాస్తి జరిగింది. బేతాళరావు మమ్మల్ని సినిమాల్లో చేర్పించడట.

కొన్నాళ్ళపాటు మేమిద్దరం కాబరే డ్యాన్సులు చేయాలట-" అంది.

"కాబరే డ్యాన్సులా?" ఆశ్చర్యంగా అన్నాడు శర్మ.

"అవును. అలా డాన్సు చేయడానికొప్పుకుంటే నెలకు రెండువేలు జీతమిస్తారట-" అంది ఉమ.

"అయితే యింకేం - ఒప్పేసుకోండి. మీరెలాగూ మొగుళ్ళకు నెలకు రెండేసివేలు సంపాదించి పెట్టాలని అనుకున్నారుగదా-" అన్నాడు శాస్త్రి.

"వేళాకోళం చేయొద్దు. అది సరదాకన్నమాట. ఇది నిజం. మగాళ్ళముందు మామూలుగా డాన్సుచెయ్యడమే మాకిష్టముండదు. అర్ధనగ్నంగా అసలు నిలబడనేలేము-" అంది రమ.

"అయితే ఏం చేస్తారు?"

"మమ్మల్ని మీరు రక్షించాలి!"

"ఎలా? ఇక్కడ కొనేటిరావులు పదిమంది వున్నారుట-" అన్నాడు శర్మ.

"అయితే మేమేం చేయాలి!"

"బేతాళరావు చెప్పినట్లు చేయండి—" అన్నాడు శాస్త్రి.

"అంతకంటే ప్రాణాలు తీసుకోవడం మంచిది-" అంది ఉమ.

"ఓసారి పోతే వచ్చేవికాదు ప్రాణాలు. అందువల్ల నీ అయిడియా ఏం బాగాలేదు. మేము మీచేత బేతాళరావన్న ప్రతి పనీ చేసేలా ఒప్పించగలిగితే ఆయనకు మామీద నమ్మకం కలుగుతుంది. ఓసారి మాకిక్కడ స్థానం లభిస్తే - దాన్ని పెంచుకోగల

సామర్థ్యం మాకుంది-" అన్నాడు శర్మ.

"అయినా బేతాళరావు మిమ్మల్ని కాబరే డ్యాన్సు చేయమన్నాడు. కాని వ్యభిచారం చేయమనలేదుగదా— అందువల్ల అతడు చెప్పినట్లు చేయండి—" అన్నాడు శాస్త్రి.

"ఒకవేళ వ్యభిచారం చేయమంటే—"

"మీ శరీరానికి బాధ కలగనంతకాలం ఏం చేసినా తప్పులేదు. ఇలాంటి చోటుకు వచ్చేక ఏంచేసినా తప్పు లేదు. మీరు బెంగపెట్టుకోకండి. మీ చరిత్ర బైటపడి మిమ్మల్నెవ్వరూ పెళ్ళిచేసుకోకపోతే— మేము మిమ్మల్ని పెళ్ళిచేసుకుందుక్కూడా సిద్ధంగా వున్నాం. అందువల్ల ఇంకేం భయాలూ పెట్టుకోకండి—" అన్నాడు శర్మ.

ఆడవాళ్ళిద్దరూ ఎట్టకేలకు—శాస్త్రి, శర్మల ప్రతిపాదన అంగీకరించారు....

# 6

తలుపులు తెరుచుకొని కోనేటిరావు వచ్చాడు.

"బేతాళరావు ఎక్కడ?" అన్నాడు శర్మ.

"ఆయన్ను మీరు చూడాలనుకుంటున్నారా?"

"చూడాలనుకోవడమేకాదు. ఆయన కోరింది సాధించామని చెప్పడానికి తహతహలాడుతున్నాం—"

"అలాగా—" అన్నాడు కోనేటిరావు నిర్లిప్తంగా- "అయితే నేనే వెళ్ళి ఆయన్ను పిల్చుకువస్తాను—"

సరిగ్గా పది నిముషాల్లో కోనేటిరావు, బేతాళరావు కలిసి వచ్చారు.

"సాధించారట గా?" అన్నాడు బేతాళరావు.

"అవును—" అన్నాడు శాస్త్రి గర్వంగా,

"పరీక్షించొచ్చా?"

"ఊఁ"

"అయితే మీరంతా బయటకు వెళ్లండి-" అన్నాడు బేతాళరావు.

అందరితోపాటూ ఉమ, రమ బైటకు వెళ్లబోతూంటే—"మీరు ఆగండి—" అని గద్దించాడు బేతాళరావు.

బేతాళరావు, ఉమ, రమ—గదిలో వుండిపోయారు.

గది తలుపులు వేసుకున్నాయి.

సెకండ్లు నిముషాలుగా మారుతున్నాయి. లోపల్నుంచి మాటలేం వినబడలేదు.

"మాటలు వినడంలేదు—ఆయనెలా పరీక్షిస్తున్నాడూ?" అన్నాడు శర్మ.

"అది సౌండ్ ప్రూఫ్ గది!" అన్నాడు కోనేటిరావు.

శాస్త్రికి గుండెలదిరాయి. కొంపదీసి రమ, ఉమ అరిచి గీపెట్టడంలేదుగదా!

సరిగ్గా ముప్ఫై నిముషాలకు గది తలుపులు తెరుచుకున్నాయి.

శాస్త్రి, శర్మ ఆత్రుతగా గదిలో అడుగుపెట్టారు. గదిలో బేతాళరావు, రమ, ఉమలు ఎప్పటిలాగే ఉన్నారు. ఆ ముప్ఫై నిముషాలు అక్కడేం జరిగిందో సూచించే చిహ్నాలేమీ లేవు. ఎటొచ్చీ గదిలో గొడవ జరిగిన సూచనలు లేవు. జరిగిందేదో శాంతియుతంగా జరిగి ఉండాలి.

"వెరీగుడ్! మీ బుద్ధిబలాన్ని అభినందిస్తున్నాను. ఈ పిల్లలు నేను చెప్పినట్లు వింటున్నారు. మొదటి పరీక్షలో ఓడిపోయినా—రెండో పరీక్షలో నెగ్గారు. బైటకు పదండి—మీతో మాట్లాడాలి!" అన్నాడు

బేతాళరావు.

తమ రొట్టె విరిగి నేతిలో పడిందని శాస్త్రి శర్మ సంతోషించారు.

క్లోనేటిరావు మళ్ళీ వాళ్ల కళ్ళకు గంతులు కట్టాడు. గంతులు విప్పేసరికి వాళ్ళు మొట్టమొదట బేతాళరావుని కలుసుకున్న హాల్లో ఉన్నారు.

"ఇంక మీరు పోవచ్చు—" అన్నాడు బేతాళరావు.

"మరి మా ఉద్యోగం?"

"మీవంటి బుద్ధిహీనులకుద్యోగమిచ్చే చవటనుకాను నేను—" అన్నాడు బేతాళరావు.

"మా బుద్ధికి పరీక్ష పెట్టారు. అందులో నెగ్గాం మేము—" అన్నాడు శాస్త్రి.

"అడిగిన జీతమివ్వకుండా—చెప్పిన పని చేయించుకోవడం నా ప్రత్యేకత. అది మీకు ప్రత్యక్షంగా ఋజువుచేద్దామనుకున్నాను. అంతే!" అన్నాడు బేతాళరావు.

"యూ!" అంటూ శర్మ చేతులు బాకుల్లా చేశాడు.

"క్లోనేటిరావ్!" అంటూ అరిచాడు బేతాళరావు.

శర్మ వెంటనే చల్లబడిపోయాడు. శాస్త్రి అతడి భుజం పట్టుకున్నాడు. ఇద్దరూ వెనక్కు తిరిగారు. నీరసంగా గుమ్మంవైపు నడిచారు.

"దట్స్ గుడ్!" అన్నాడు బేతాళరావు.

## 7

"అవమానం!" అన్నాడు శర్మ.

"క్లోనేటిరావు లేకపోతే బేతాళరావుతో ఆట ఆడించేవాళ్ళం—" అన్నాడు.

"క్లోనేటిరావుంటాడు. అయినా సరే బేతాళరావునో

ఆట ఆడించాలి—" అన్నాడు శాస్త్రి.

"ఎలా?"

"అందుకో మార్గముంది—" అన్నాడు శాస్త్రి.

"ప్లీజ్—అదేమిటో చెప్పు—" అన్నాడు శర్మ ఆత్రుతగా.

"మనం నేరాలు చేయగలం. అవునా?" అన్నాడు శాస్త్రి.

"అవును—"

"మనం నేరం చేయాలి. చాలా పెద్ద నేరం చేయాలి" అన్నాడు శాస్త్రి.

"నేరం చేయడంవల్ల బేతాళరావుకేం నష్టం?"

"మనం చేసే నేరం బేతాళరావు పేరుతో చేస్తాం?" అన్నాడు శాస్త్రి.

"వండర్ ఫుల్—ఇంతకీ నేర మేమిటో చెప్పు—"

"ప్రమీల నీకు గుర్తుందా?"

"మన క్లాస్ మేట్ ప్రమీలా—ఎలా మర్చిపోగలను? చెంపకు చేర దేసి కళ్ళు—దొండపండులాంటి పెదవులు—ఆహా....ఇప్పుడా మెను గుర్తుచేసి నా మతి పోగొట్టావు గదా—మన దురదృష్టంకొద్దీ ఆమె ఒక సంవత్సరమే గ్రాడ్యువేషన్ చేసింది. తర్వాత...." అని ఉలిక్కిపడి-
"అన్నట్లు ఆమెకు పెళ్ళయిపోయింది కదూ?" అన్నాడు శర్మ.

"అవును. అందుకే—మనం ఆమె పేరును మాత్రమే గుర్తుంచుకోవాలి. చెంపకు చేర దేసి కళ్ళు వగైరాలు మార్చుకోవాలి. తెలిసిందా?" అన్నాడు శాస్త్రి.

"సరే—మర్చిపోయి ఏం చేయాలి?"

"ఇన్స్పెక్టర్ మనోహర్ ఇంటికి వెళ్ళాలి—"

"ఎవడా మనోహర్?"

"ప్రమీల మొగుడు...."

"బాప్ రే!" అన్నాడు శర్మ — "నీ ప్లాను నా కర్థమయింది—"

"బేతాళరావు ఇంట్లో మనకు సమీపంలో ఉన్నప్పుడు అతడి జేబురుమాలు కొట్టేశాను. అతణ్ని పట్టివ్వడానికి అదే ఉపయోగపడుతుంది—" అన్నాడు శాస్త్రి.

"వండర్ ఫుల్ మిత్రమా? అయితే ఒక్క సందేహం. బేతాళరావు అఖండుడిలాగున్నాడు. ఇంట్లోంచి బైటకు తోలి మన విషయం వెంటనే మర్చిపోతాడంటావా?" అన్నాడు శర్మ.

"మర్చిపోక ఏం చేస్తాడు? మనం తన శక్తికి మించిన వాళ్ళంకాదని గ్రహించేశాడు. బేతాళరావు దగ్గర ఉద్యోగం అడిగాం కాబట్టి మనం మంచివాళ్ళంకాదని కూడా అనుకొనివుంటాడు. అందువల్ల మన గురించి పట్టించుకోడు. కోనేటిరావులాంటి వాళ్ళ రక్షణవున్న బేతాళరావును ఎవరేమిచేయగలరు?" అన్నాడు శాస్త్రి.

శర్మ లేచినిలబడి—"పద, మన అదృష్టం పరీక్షించుకుందాం—" అన్నాడు.

"ప్రమీల మనకు సహకరిస్తుందనే ఆశిద్దాం—" అన్నాడు శాస్త్రి.

# 8

బేతాళరావు ఇంటిచుట్టూ పోలీసులు. ఇంటిలోపల ఇన్స్పెక్టర్ మనోహర్, సబిన్స్పెక్టర్ నాయర్, నలుగురు కానిస్టేబుల్సు.

"వాటీజ్ దిస్—" అన్నాడు బేతాళరావు.

"సస్పెక్టెడ్ కిడ్నాపింగ్—" అన్నాడు మనోహర్.

"ఎవర్ని?"

"నా భార్య ప్రమీలను!"

బేతాళరావు తెల్లబోయి—"ఇన్స్పెక్టర్ గారూ, మీ భార్య నెవరో కిడ్నాప్ చేశారా? ఇదే నిజమైతే—ఇంక ఈ దేశంలో మా బోటివాళ్ళకు రక్షణ ఏముంటుంది?" అన్నాడు.

"నీబోటివాళ్ళకు రక్షణ అవసరంలేదు. ఇతరుల్నే నీబోటివాళ్ళనుంచి రక్షించాలి—"

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా—ఇన్స్పెక్టర్!" అన్నాడు బేతాళరావు కోపంగా.

"నా భార్య మాయమైంది. గదిలో ఈ రుమాలుంది. రుమాలుపై నీ పేరుంది. ఆ పేరుగలవాడితో మాట్లాడుతున్నానని నాకు తెలుసు—" అన్నాడు మనోహర్.

బేతాళరావు నవ్వి — "నీ ఆవిడ ఫోటోవుంటే చూపిస్తావా?"—అన్నాడు.

"ఎందుకు?" అన్నాడు మనోహర్.

"నా దగ్గర గడిపిన ఆడవాళ్ళు చాలామంది నా రుమాళ్లు అడిగి తీసుకువెళ్ళారు. సాధారణంగా ఆడవాళ్ళ పేర్లు నాకు గుర్తుండవు. ఫోటో చూస్తే చెప్పగలను—" అన్నాడు బేతాళరావు.

"యూ...." అంటూ అరిచాడు మనోహర్.

"నీ భార్యనంటే నీ కంత కోపమొచ్చిందే! ఋజువు లేకుండా నామీద నేరం మోపుతూంటే నాకెలాగుంటుందో ఆలోచించావా ఇన్స్పెక్టర్!" అన్నాడు బేతాళరావు.

"ఋజువులూ వస్తాయి—" అంటూ తన సిబ్బందికి ఆజ్ఞలిచ్చాడు మనోహర. ఇంట్లో తామెలా నడిచి

వెళ్ళారో అన్నీ గుర్తులు చెప్పివున్నారు శాస్త్రి, శర్మలూ. అందువల్ల మనోహర్ సులభంగానే ఉమ, రమలు వున్న గదిని కనుక్కోగలిగాడు.

"ఆ గదిలో ఏమీ లేదు—" అంటూ కంగారుపడ్డాడు బేతాళరావు.

"ఆ విషయం తేల్చుకోవలసింది నేను—" అన్నాడు మనోహర్.

తప్పనిసరై గది తలుపులు తీశాడు బేతాళరావు. లోపల రమ, ఉమ ఉన్నారు.

"ఎవరు వీళ్ళు?" అన్నాడు మనోహర్.

బేతాళరావుకు ముచ్చెమటలు పోశాయి-"సినిమాల్లో అవకాశమిప్పించమని అడిగారు. సరే ఉండమని చెప్పాను. రెండు మూడు రోజుల్లో ఏదైనా పిక్చర్లో వీళ్ళకి బుకింగ్ లు దొరకవచ్చు—" అన్నాడు.

"ఆ విషయం వీళ్ళనే అడిగి తెలుసుకుంటాను—" అంటూ మనోహర్—"ఎవరమ్మా మీరు?" అనడిగాడు.

రమ, ఉమ తమ పేర్లు, ఇతర వివరాలు చెప్పారు

"ఇక్కడికెందుకు వచ్చారు?"

"సినిమాల్లో వేషాలిప్పించమని అడిగాం. ఇక్కడుండమన్నారు—"

"మీకేం భయంలేదు. నిజం చెప్పండి. మీకిక్కడేమైనా ఇబ్బందిగా ఉందా? ఈయన మీపట్ల అమర్యాదగా ప్రవర్తించడం జరిగిందా?" లాలనగా అడిగాడు మనోహర్.

"అబ్బే అదేం లేదండి-ఆయన చాలా మర్యాదస్తులు. పెద్దమనిషి. మా అదృష్టంకొద్దీ ఈ యింటవచ్చిపడ్డాం—"

"అయినా చెప్పకుండా ఇంట్లోంచి వచ్చినట్లు కనబడు తోంది మీరు. మీ యింటికి తెలియబర్చి ..."

"మేమిద్దరం పదెనిమిది నిండిన వాళ్ళమే! అంతా మా యిష్టం—" అంది ఉమ.

మనోహర్ నీరసంగా అక్కణ్ణించి బయటకువచ్చాడు. మిగతా కానిస్టేబుల్సుకు ఆ యింట్లో ఇంకే ఆధారాలూ లభించలేదు.

వాళ్ళంతా వెళ్ళిపోయాక బేతాళరావు ఉమకూ రమకూ ధన్యవాదాలు చెప్పుకొని—"మీ మేలుమరవ లేను. నా పరువు కాపాడారు—" అన్నాడు.

"అయ్యో — ఇందులో ఏముందండీ — మీరెలా చెప్పినా వింటామనీ మీ మాటే అంటామనీ మా మిత్రులకు మాటిచ్చాము. ఆ మాట ప్రాణంపోయినా సరే తప్పము—" అంది రమ.

"సరే—మీరు గదిలోకి వెళ్ళండి—" అన్నాడు బేతాళరావు. తర్వాత ఆయన కోనేటిరావును పిలిచి "వాటంచూస్తే ఆ కుర్రాళ్ళు అఖండుల్లాగున్నారు! ఈ పిల్లల మనసు నిజంగా మార్చిపారేశారు. పోలీసులువచ్చి బయటపడే అవకాశమిచ్చినా వాళ్ళు మాటకు కట్టు బడ్డారు. ఇలాంటివాళ్ళ అవసరం మనకెతైనా వుంటుంది!" అన్నాడు.

"అదిసరే—అసలు పోలీసులు మనింటికెందుకొచ్చారో ఆలోచించారా?" అన్నాడు కోనేటిరావు.

"లేదు."

"నేను మన మనుషుల్ని ఆ ఇద్దరిమీదా కాపుంచాను. నిన్న వాళ్ళు ఇన్స్పెక్టర్ మనోహర్ ఇంటికి వెళ్ళినట్లు తెలిసింది. ఈరోజు పోలీసులు మనిల్లు చుట్టుముట్టారు—"

అన్నాడు కోనేటిరావు.

"అంటే వాళ్ళు పోలీసుల మనుషులంటూనా?"

"అలాగే కనబడుతోంది. వాళ్ళ వ్యవహారం చూడా ల్సిందే—వాళ్ళనో కంట కనిపెట్టాల్సిందే!" అన్నాడు కోనేటిరావు.

## 9

"మీ కోసం మేము వెతుకుతూంటే మీరే మా యింటికొచ్చారే—" అన్నాడు బేతాళరావు.

శాస్త్రి నవ్వి-"అడిగిన డబ్బు ఇవ్వకుండా-చెప్పిన పని చేయించుకోడం మీ ప్రత్యేకతన్నారు. అందుకే మేము మా ప్రత్యేకతేమిటో మీకు చూపించాలను కున్నాం. చెయ్యని నేరానికి పోలీసులు మీ యిల్లు చుట్టు ముట్టారు. ఇదొక శాంపిల్. కావాలంటే ఇంకా చాలా శాంపిల్స్ చూపించగలం?" అన్నాడు.

"అంటే?"

"మీ దగ్గర రుమాలు కొట్టేశాం.. మనోహర్ భార్య ప్రమీల మా క్లాసుమేటు. ఆమె సాయం తీసుకొని పోలీసులు మీ యిల్లు రెయిడ్ చేసేలా చేశాం. ఇన్స్ పెక్టర్ మనోహర్ రమ, ఉమలను చూశాడు. మామాట మీద వాళ్ళు మీ మాటే అంటారనీ మాకు తెలుసు. అయితే వాళ్ళ ఉనికి ఆయనకు తెలిసింది. ఇప్పుడు మీరు వాళ్లను మీ యిష్టంవచ్చినట్లు చేయలేరు. వాళ్ల మాన, ప్రాణాలకు భద్రత ఏర్పడింది. అదీ మా బుద్ధిబలం-హౌ ఈజిట్!" అన్నాడు శర్మ.

"బాగుంది. ఇంతకీ మీ రెందుకొచ్చారు?"

"పని కావాలి!"

"పోలీసుల స్నేహితులకు పనివ్వను నేను-" అన్నాడు

బేతాళరావు.

"మీరు పనివ్వకపోతేనే మేము పోలీసుల స్నేహం కోరేది!" అన్నాడు శర్మ.

"ఇది బెదిరింపా?"

"కాదు. అభ్యర్థింపు-"

"అయితే మీకు పనిచ్చాను-వెళ్ళండి-"

"ఎక్కడ-పని?"

"ఆ ఉమ, రమలున్న గదిలోకి వెళ్ళండి. వాళ్ళకి సినిమా ఛాన్సులు లేవు. వాళ్ళ నెలాగో ఒప్పించి వాళ్ళ తలిదండ్రుల దగ్గరికి జేర్చండి. అందుకు నీకు పది వేలిస్తాను" అన్నాడు బేతాళరావు.

"ఏం-వాళ్ళతో మీకు పనిలేదా?"

"నన్ను రక్షించిన పిల్లల్ని నేను పాడు చేయను. ఇది నా ఆచారం-" అన్నాడు బేతాళరావు.

శాస్త్రి, శర్మ ఆ గదిలోకి వెళ్ళారు.

"పదండి పోదాం-" అన్నాడు శాస్త్రి ఆడపిల్లలతో.

"ఎక్కడికి?" అంది రమ.

"మాతో-మీ యింటికి!"

"తిరిగి యింటికి పోవడానికా యిక్కడికొచ్చింది?" అంది ఉమ.

"భలేవారే - ఇక్కణ్ణించి బైటపడగలగడం మీ అదృష్టం-ఎలాగో అవకాశం దొరికింది. తక్షణం ఉడాయించడం మేలు. ఆలస్యం చేశారంటే బేతాళరావు మనసు మారిపోగలదు-" అన్నాడు శర్మ.

"మేము రాము. మీరు వెళ్ళండి. మా అవస్థ మేం పడతాము-" అంది రమ.

"ఎందుకని రారు మీరు?"

"రామంటే రాము. అంతే!" అంది ఉమ.

"ఆ బేతాళరావేమైనా మంత్రం వేశాడా వీళ్ల మీద?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"వీళ్ళు రానంటే. ఇక్కడ పదివేలు అక్కడ లక్ష నష్టం-మొత్తంలక్షాపదివేలు నష్టం-" అన్నాడు శాస్త్రి.

ఆడపిల్లలు ససేమిరా రామన్నారు. మిత్రులిద్దరికీ ఏం చేయాలో తోచక-"మీరేం చెయ్యమంటే అది చేస్తాం. కానీ మాతో రామని అనవద్దు-" అన్నారు.

"ఏం చెబితే అది చేస్తారా?" అంది ఉమ.

"తప్పకుండా-"

"కోనేటిరావు మెడలో లాకెట్ గొలుసుంది-అది కావాలి-" అంది రమ.

కోనేటిరావు పేరు వినగానే శర్మ గుండెలదిరాయి. శాస్త్రి తడబడి-"అది తప్ప ఇంకేమైనా?" అన్నాడు.

"లాభంలేదు. అదే కావాలి-"

"ఏం చేసుకుంటారా లాకెట్?"

"అదంతా మీకనవసరం-" అంది రమ.

"అయితే సరే—లక్షాపదివేల కోసం మా ప్రాణా లొడ్డబోతున్నాం—" అన్నాడు శాస్త్రి.

శర్మ గదంతా కలయజూసి—"అదృష్టమంటే ఇలా గుండాలి. గదిలో మేకప్ సామానుంది—" అన్నాడు.

"ఆడపిల్లల్ని గదిలోవదిలి మేకప్ సామాను మర్చిపోతే వాళ్ళు పిచ్చెక్కిపోతారని బేతాళరావుకు తెలుస్తుంది. అతడిది రసిక హృదయం—" అన్నాడు శాస్త్రి.

శర్మ వెళ్ళి శాస్త్రి చెవిలో ఏదో చెప్పాడు. శాస్త్రి ఉత్సాహంగా తల ఊగించాడు.

అంతలో గది తలుపు తట్టిన చప్పుడైంది. శర్మ వెళ్ళి

తలుపు తీశాడు.

బేతాళరావు! పక్కన కోనేటిరావు లేడు.

"ఏమిటింత ఆలస్యం?" అంటూ విసుక్కున్నాడు బేతాళరావు.

"లోపలకు రండి. పిల్లలు కాస్త బెట్టు చేస్తున్నారు" అన్నాడు శర్మ.

బేతాళరావు లోపల అడుగుపెట్టాడు. శర్మ గది తలుపు వేశాడు.

శాస్త్రి బేతాళరావుని సమీపించి—"ఇది సౌండ్ ప్రూఫ్ గది కదూ?" అన్నాడు.

"అవును—ఎందుకు?" అనేలోగా శర్మ వెనుకనుంచి బేతాళరావు మెడ నరంమీద సుతారంగా కొట్టాడు. దెబ్బతింటూనే పెద్దగా కేక పెట్టి మొదలు నరికిన చెట్టులా కూలిపోయాడు బేతాళరావు.

శర్మ చకచకా అద్దం ముందుకు నడిచాడు. అయిదు నిముషాల్లో శర్మ బేతాళరావుగా మారిపోయాడు. పరీక్షించి చూసిన వాళ్ళకీ, అనుమానం కలిగినవాళ్ళకీ తప్ప అతడు బేతాళరావు కాదనుకోవడం కష్టం. శర్మ—బేతాళరావు బట్టలు తను వేసుకున్నాడు. తన బట్టలు బేతాళరావుకి తొడిగాడు. ఓ క్షణంపాటు బేతాళరావు కంఠాన్ని అనుకరించడానికి ప్రయత్నించాడు.

శాస్త్రి, ఉమ, రమ—అతణ్ని మెచ్చుకున్నారు.

తర్వాత ముగ్గురూ కలిసి బేతాళరావు నోట్లో గుడ్డలు కుక్కి — కాళ్ళూ చేతులూ కట్టేసి మంచంమీదకు తోసేశారు.

"శాస్త్రీ—నువ్విక్కడే వుండు— నేను బైటకు వెళ్ళి కోనేటిరావును పిల్చుకునివస్తాను—" అన్నాడు శర్మ.

"జాగ్రత్త — పులినోట్లో తల పెడుతున్నావు—" అన్నాడు శాస్త్రి.

శర్మ నవ్వి బైటకు వెళ్ళాడు. హాల్లో కోనేటిరావు ఉన్నాడు. అతడి మెడలో లాకెట్ చూశాడు. అందులో ఏం విశేషమూ ఉన్నట్టులేదు. పైగా అది చూడ్డానికి ఖరీదైనదానిలా కూడా లేదు.

"వాళ్ళకెందుకో ఆ లాకెట్?" అనుకున్నాడు శర్మ. పైకి మాత్రం—"కోనేటిరావ్!" అని పిలిచాడు. ఆ కంఠం బేతాళరావు కంఠంలాగే ఉన్నది.

కోనేటిరావును శర్మను సమీపించాడు.

"సీతో పని ఏర్పడింది. పద—ఆ పిల్లలున్న గదికి వెడదాం—" అన్నాడు శర్మ.

కోనేటిరావు శర్మను గుర్తుపట్టినట్టులేదు. అతడు గదివైపు నడిచాడు. శర్మ కోనేటిరావు ననుసరించాడు. కోనేటిరావు గుమ్మం దగ్గర ఆగాడు.

శర్మ మెరుపు వేగంతో అప్పుడే అతణ్ని రెండు దెబ్బలుతీశాడు. కోనేటిరావు కుప్పలా కూలిపోయాడు. తలుపు తీసుకొని అతణ్ని ఈడ్చుకుంటూ లోపలకు తీసుకెళ్ళాడు. క్షణాలమీద అంతా కలిసి అతణ్ని నోట్లో గుడ్డలు కుక్కి—కాళ్ళూ చేతులూ కట్టి మంచంక్రింద బేతాళరావు పక్కకు తోసేశారు. అంతకుముందుగానే కోనేటిరావు మెడలోని లాకెట్ తీసుకున్నాడు శర్మ.

"వాటే వండర్-ఎలా పడగొట్టావతన్ని-" అన్నాడు శాస్త్రి.

"చాలా సింపుల్. పరాయివాడైతే కోనేటిరావుని వెనుకనుంచి కూడా దెబ్బతీయలేడు. అతడి కదలికలో అంతటి వేగముంది. కానీ నన్నతడు బేతాళరావనుకుని

అజాగ్రత్తగా వున్నాడు. అదే నేనుపయోగించుకున్నాను" అన్నాడు శర్మ.

"శ్రీనేటిరావు మహా శక్తివంతుడు. అదే మన పాలిటి వరమైంది. ఈ యింటికి ఏకైక రక్షకుడతను. మనం హాయిగా బైటకుపోవచ్చు—" అన్నాడు శాస్త్రి.

"ఎందుకైనా మంచిది! ఇంట్లోంచి బైటపడేవరకూ వేషం మార్చను—" అన్నాడు శర్మ.

# 10

అంతా సులభంగానే బైటపడ్డారు. దార్లో వేషం మార్చుకున్నాడు శర్మ. లాకెట్‌ను శోధించగా అందులోంచి ఒక తాళంచెవి బయటపడింది.

"అది మాక్కావాలి?" అంది ఉమ.

"అఖ్ఖాం సారీ ఉమా! ఈ తాళంచెవి కథ ఏమిటో తెలుసుకోకుండా మీకివ్వను—" అన్నాడు శర్మ.

"అదంతా మీకు మేము చెప్పకూడదు—" అంది ఉమ.

"ఎందుకని?"

"చెబితే మా ప్రాణాలు పోతాయి-"

"మేముండగా మీ ప్రాణాలెవరు తీయగలరు?" అన్నాడు శాస్త్రి.

"రాఘవరావు-" అంది రమ.

"మీ ఘాటలకేమైనా అరముందా? కన్న తండ్రి కూతుళ్ళ ప్రాణాలు తీస్తాడా?" అన్నాడు శర్మ ఆశ్చర్యంగా.

"రాఘవరావు మా కన్న తండ్రి కాదు-" అంది ఉమ. ఆమె చెప్పిన కథ మిత్రులిద్దరికీ అమితాశ్చర్యాన్ని కలిగించింది.

రాఘవరావు విశాఖపట్నంవచ్చి రెండేళ్ళయింది. అంతకు పూర్వం అతను బేతాళరావు వ్యవహారాలు చూసేవాడు. కొన్నాళ్ళకిద్దరికీ ఏవో గొడవలువచ్చాయి. బేతాళరావు రాఘవరావుని తరిమేశాడు. రాఘవరావు దగ్గర బొత్తిగాడబ్బులేదు. అప్పుడతను ఎలాగో రమనూ, ఉమనూ సంపాదించాడు. ఓ అనాధ శరణాలయం వాళ్ళ దగ్గర్నుంచి వీళ్ళను ఉద్యోగం మిషతో తెచ్చుకుని-కూతుళ్ళన్న పేరులో విశాఖపట్నం వచ్చాడు. ఆడపిల్లల్నుపయోగించి తన పనులు సాధించుకుని కంట్రాక్టరుగా బాగా డబ్బులు సంపాదించాడు.

ఎంత సంపాదించినా ఆయన దృష్టి బేతాళరావు దగ్గరున్న తాళంచెవిమీదనే ఉన్నది. దాని గురించి ఆయన ఎలా తెలుసుకున్నాడో శాస్త్రి, శర్మలగురించి తెలుసుకున్నాడు. వాళ్ళ శక్తిసామర్థ్యాల గురించి ఆయనకు నమ్మకం కుదిరింది. ఉమనూ, రమనూ వాళ్ళ మీదికి ఉసిగొల్పాడు. తనే స్వయంగా నలుగురు వస్తాదుల్నెన్నికచేసి వాళ్ళ శక్తిసామర్థ్యాలు చూశాడు. అప్పుడు తన పథకం అమలు జరిపాడు. సినిమా ఛాన్సు పేరిట కూతుళ్ళిద్దరూ బేతాళరావింటికి వెళ్ళారు. ఎలాగో కోనేటిరావును మభ్యపెట్టి ఆ తాళంచెవి దొంగిలించాలి. శాస్త్రి, శర్మల సాయంతో అక్కణ్ణించి బయటపడి తాళంచెవి రాఘవరావుకు అప్పచెప్పాలి. ఇందులో ఏం తేడా వచ్చినా ఉమ, రమలకు ప్రాణాలు దక్కవు. ఎట్టి పరిస్థితుల్లోనూ తాళం గురించి శాస్త్రి, శర్మలకు తెలియనివ్వకూడదు.

అయితే ఉమ, రమలకు కోనేటిరావు నుంచి తాళం దొంగిలించే అవకాశం రాలేదు. అతడు అమిత బలవంతుడు.

అతి జాగ్రత్తపరుడు. వాళ్ళేం చేయాలో తెలియక కొట్టు మిట్టాడుతూంటే ఈలోగా శాస్త్రి, శర్మ వాళ్ల విడు దలకు ఏర్పాట్లు ప్రారంభించారు. ఉమ, రమ తాళంచెవి లేనిదే అక్కణ్ణించి బైటపడడానికిలేదు. అందువల్ల చివరకు ఏ దారీలేక అసలు విషయం చెప్పకతప్పలేదు.

"ఈ తాళంచెవి అసలు రహస్యం మీకూ తెలిసే వుంటుంది. అదేమిటో చెప్పకుండా ఇది మా దగ్గర్నుంచి తీసుకోలేరు-" అన్నాడు శాస్త్రి నిక్కచ్చిగా. ఉమ, రమ ఎంత బ్రతిమాలినా ప్రయోజనం లేకపోయింది.

"అది ఒక లాకరు తాళంచెవి. బేతాళరావుకు సంబంధించిన అపూర్వ విశేషాలూ, అమూల్య వజ్ర వైడూర్యాలూ ఆ లాకర్‌లో ఉన్నాయి. ఆ లాకర్ విలువ కొన్ని కోట్లుంటుందని రాఘవరావు అంచనా. ఆ లాకర్ బేతాళరావు పేరుమీద లేదు. ఒక అనామకుడి పేరుమీద ఉన్నది. బేతాళరావు యిచ్చిన దంతులో పెట్టడమూ, తెమ్మన్నది తేవడమూ అతడి విధి. లాకర్లోకి వెళ్ళేముందు, లాకర్లోంచి వచ్చేముందు బేతాళరా వతన్ని తీవ్రంగా శోధించి మరీ పంపుతాడు. తాళం ఎప్పుడూ కోనేటిరావు మెడలో లాకెట్‌లో ఉంటుంది. బేతాళ రావు ఎంత ప్రమాదకరమైన వ్యక్తో ఆ అనామకుడికి తెలుసు. అందువల్ల అతడు తనకు బేతాళరావు నుంచి లభించే స్వల్ప పారితోషికమే మహా ప్రసాదంగా భావి స్తాడు. మరి బ్యాంకు వాళ్లకు లంచం పెట్టాడో, ఆ అనా మకుణ్ణి వశపర్చుకున్నాడో తెలియదుగానీ రాఘవరావుకి లాకరుతాళముంటే చాలుట-" అంది రమ.

"అయ్యబాబోయ్-ఇంత గొప్పతాళాని కాయన లక్ష రూపాయలే ధర కట్టాడా?" అంటూ గుండెలు బాదు

కున్నాడు శాస్త్రి.

"ఈ తాళం మేమివ్వం!" అన్నాడు శర్మ.

"మీ నిర్ణయం మాకు జీవన్మరణ సమస్య-" అంది ఉమ జాలిగా.

"ఒకే ఒక్క షరతుపైన మీ కిది యిచ్చేస్తాను-" అన్నాడు శర్మ.

"చెప్పండి-" అంది ఉమ నీరసంగా.

"బేతాళరావు చెప్పినమాటల్లా వినమని మీకు మేం చెప్పాం. అప్పుడో అరగంట బేతాళరావు మిమ్మల్ని పరీక్షించాడు. తృప్తిపడ్డాడు. ఏం చేశాడోనని మా యిద్దరికీ చాలా కుతూహలంగా ఉంది-" అన్నాడు శాస్త్రి.

రమ, ఉమ ముఖముఖాలు చూసుకున్నారు. తర్వాత రమ నెమ్మదిగా "అది చెప్పుకోవడంకంటే చచ్చిపోవడమే మంచిది. ఆ తాళం మీ దగ్గరే ఉంచుకోండి. సెలవు-" అంది.

ఆడవాళ్ళిద్దరూ అక్కణ్ణించి కదలబోయారు.

"ఆగండి!" అన్నాడు శాస్త్రి. ఉమ, రమ ఆగారు.

"చెప్పుకోవడంకంటే ప్రాణాలు పోగొట్టుకోవడమే మేలనుకొనేలాంటి అవమానం మీకు చేశాడు బేతాళరావు. అలాంటివాడి దగ్గరకు తెలిసీ పంపించాడు రాఘవరావు. వాళ్ళిద్దరికీ ముఖ్యం ఈ తాళం. ఇద్దరిలో ఎవరికి తాళం ఇచ్చినా అది దేశద్రోహమే-కాబట్టి దీన్ని పోలీసులకిద్దాం-" అన్నాడు శర్మ.

"పోలీసులు దేవతలుకారు. వాళ్ళూ మనుషులు. కానీ బేతాళరావు, రాఘవరావు రాక్షసులు. ఆ యిద్దరిలో ఏ ఒక్కరు పగబట్టినా మనం బ్రతకడం కష్టం. ఇద్దరూ

పగబడితే మనమే మెపోతాం?" అంది ఉమ.

శాస్త్రి, శర్మ నవ్వారు-"ఈ జీవితమే ఒక పెద్ద చెరసాల. ఇందులో ఉరిశిక్షను ఎదురుచూస్తూ బ్రతికే ఖైదీలం మనం. శిక్ష ఎప్పుడమలు జరుగుతుందో ఎవ్వరికీ తెలియదు. అలాంటప్పుడు చేతనైనంతలో కొందరు రాక్షసుల్ని ఎదిరించగలిగితే ఎంత బాగుంటుంది?" అన్నాడు శాస్త్రి.

"అంటే ఏం చేయాలి?"

"ఇన్స్పెక్టర్ మనోహర్ని కలుసుకుందాం-మీరేమో మీకు తెలిసినంతవరకూ రాఘవరావు బ్రతుకు బయట పెట్టండి. ఈ లాకర్ తాళం బేతాళరావు బ్రతుకు బయటపెడుతుంది—దేశానికో ఇద్దరు రాక్షసుల పీడ విరగడవుతుంది. ఉడతా భక్తిగా దేశానికి మనంచేయ గల సేవ ఇదే!" అన్నాడు శర్మ.

"రమా! బేతాళరావు మిమ్మల్నేంచేశాడో చెప్పవా?" అన్నాడు శాస్త్రి మళ్ళీ.

"నువ్వు నన్ను పెళ్ళిచేసుకున్నానసరే—ఆ విషయం మాత్రం చెప్పను—" అంది రమ.

"మీ పెళ్ళి సంగతి తర్వాత-ముందు బేతాళరావు రాఘవరావుల పెళ్ళిళ్ళ సంగతి చూడాలి. పదండి—" అన్నాడు శర్మ.

అంతా ఇన్స్పెక్టర్ మనోహర్ ఇంటికి బయల్దేరారు.

—:ఐ పో యిం ది:—

# టక్కరి చుక్క

## సికిందర్

అయిదు నిముషాలనుంచీ అతన్నే గమనిస్తోన్న పద్మిని, ఇక ఉండలేక, చటుక్కున ముందుకువంగి, "ఏమిటాలోచిస్తున్నావు, నరేన్?" అనడిగింది కుతూహలంగా.

నరేన్‌కుమార్ ఉలిక్కిపడి ఆమెను చూశాడు. వెంటనే తేరుకొని సర్దుకూర్చున్నాడు. "వెయిటర్ ఏడి, ఇంకా రాలేదా?" అన్నాడు నవ్వుతూ అదోలా.

ఆ నవ్వుకి అర్థం తెలియలేదు పద్మినికి.

ఆమె అసహనంగా చూసి, "వస్తాడు. రాకుండా ఎక్కడికి పోతాడు?" అంది చిరాగ్గా. మళ్ళీ వెంటనే కుతూహలంగా, "నువ్వేదో తీవ్రంగా ఆలోచిస్తున్నావు, నరేన్" అంది.

నరేన్ చిన్నగా నవ్వి, వెంటనే గ్లాసులోని నీళ్ళు తాగేశాడు. మూతితుడుచుకొని, "ఆలోచిస్తున్నానా.... అవును, కరెక్టు!" అన్నాడు చటుక్కున.

"ఏమిటాలోచిస్తున్నావు?" అడిగిందామె మరింత

కుతూహలంగా.

"ప్రేమఘట్టం ముగిశాక ఇద్దరు ప్రేమికులు దేన్ని గురించి ఆలోచిస్తారు, డియర ?"

"పెళ్ళి...." అనేసింది పద్మిని అనాలోచితంగా.

"కరెక్టు! అదే నేనూ ఆలోచిస్తోన్నది!" అన్నాడతను.

పద్మిని ఉత్సాహంగా దగ్గరికి జరిగి అతని చేతిని తాకింది. చిటికెన వ్రేలికి ఉంగరాన్ని తిప్పుతూ కళ్ళలోకి చూసింది ఆరాధనగా.

"మరి....నువ్వు మీ వాళ్ళకు చెప్పావా, నరేన్?"

అతని కళ్ళలో విచారం చోటుచేసుకుంది వెంటనే.

"లేదు. ఎలా చెప్పాలా అని కిందామీదవుతున్నాను. వాళ్ళంటే నాకు మహా చెడ్డ అభిమానం! ఆదర్శ వివాహం చేసుకుంటానంటే ఎక్కడ అడుక్కుతిను పొమ్మంటారోనని వాడలి చస్తున్నాను! వాళ్ళ ఇష్టానికి వ్యతిరేకంగా నాకేదీ చేయాలనిపించదు... ఇది వంశ గౌరవానికి సంబంధించిన విషయం. ఈ మధ్య నేనిక్కడికి అడపాదడపా రావడం అప్పుడే వాళ్ళకి అనుమానంగా వుంది....మన సంగతి వాళ్ళకు తెలిసిపోతుందని నాకు భయంగా వుంది."

"ఎలాగో ఒకలా తెలిసిపోవడమే మంచిదిగా? ఏదో ఒకటి తేలిపోతుంది."

"లేదు పద్మినీ, నిన్నిలా హోటళ్ళకీ, సినిమాలకీ షికార్లకి తిప్పడం నాకేమాత్రం ఇష్టం లేదు. ఈ విజయవాడలో మాకు తెలిసినవాళ్ళు కొందరున్నారు. వాళ్ళకంటపడితే....గాడ్! ఎంతో పరువు ప్రతిష్టలుగల కుటుంబం మాది. జమీందారుగా ఊళ్ళో నాన్నగారికి

ఎంతో గౌరవం వుంది. ఆయనకి నేనొక్కడ్నే సంతానాన్ని. చాలా గారాబంగా పెంచారు. వాళ్ళకి చెడ్డ పేరు తెచ్చి బాధించడం నేనంగీకరించను! మనం ఈ సమస్యని ఎంతో జాగ్రత్తగా పరిష్కరించుకోవాలి, పద్మిని .. "

పద్మిని అసహనంగా నిట్టూర్చింది. తలతిప్పి చుట్టూ చూసింది. ఇప్పుడు జనంతో ఫ్యామిలీ రూం పూర్తిగా నిండిపోయివుంది. ఎవరూ ఎవరిని గురించి పట్టించుకోకుండా వాగేస్తున్నారు. వెయిటర్ అనబడే గున్న ఏనుగు ఆకారం నోర్లుకుంటూ వచ్చింది పదార్థాలతో. అది చకచకా ప్లేట్లను వాళ్ళముందు సర్దేసి అదృశ్యమైంది వచ్చిన దారిని.

నరేన్ తినడం ప్రారంభిస్తూ పద్మినిని చూశాడు. ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తోంది.

"నీ అభిప్రాయం ఏమిటి?" అన్నాడతను.

పద్మిని తలెత్తి చురుగ్గా చూసింది. "మీ వాళ్లని ఎలాగైనా ఒప్పించాలి!" అందామె ఆవేశంగా.

"ముందు మీ వాళ్లని ఒప్పిస్తే?" అన్నాడతను తక్కున.

ఆమె అదిరిపడి స్పూను వదిలేసింది.

అతను కంగారుపడి, "ఏమిటది?" అన్నాడు.

ఆమె కుదుటపడుతూ నొచ్చుకుంది. "సారీ ఏమీ లేదు, నరేన్. మా నాన్న చండశాసనుడని చెప్పాను గుర్తుందా? ఆయనముందు నిల్చోవాలంటేనే కాళ్ళలోంచి వణుకు... నాకు చెడ్డ భయం! ఇక మన సంగతి....మన గురించి...."

"ఫరవాలేదు, ఇద్దరం వెళ్దాం, నే చెప్పేస్తాను. నాకెందుకు భయం?"

"ఓహ్, వద్దు! నాన్న దగ్గరకి అప్పుడే వద్దు!" అర్థించింది పద్మిని, "ముందు మీ వాళ్ళని ఒప్పిద్దాం. అప్పుడు మా వాళ్ళని సులభంగా...."

"మళ్ళీ మొదటికే వచ్చాం! నాన్నతో చెప్పాలంటే నాకు—"

"మీ నాన్నంటే నీకు భయమా?"

"కాదు. భక్తీ, గౌరవం."

"అమ్మంటే?"

"డిటో."

"మరి అడ్డొచ్చిందేమిటి?"

"అభిమానం—మహా చెడ్డది."

"అయితే నేనొప్పిస్తాను!"

"నువ్వా?"

"ఏం? నేనొప్పించలేనా?"

అతనొక్క క్షణం తీక్షణంగా చూశాడు. "ఒప్పిస్తావ్, బ్రహ్మాండంగా!"

"నాలో ఏం లోపముందని?"

"నాకేం కన్పించలేదు."

"మా కులం వేరైనా మీ ఇంట్లో మీ ఆచారాలకీ, సాంప్రదాయాలకీ అనుగుణంగా నడచుకోగలను."

"ఇంకా?"

"మీ వాళ్ళని గౌరవించగలను. వాళ్ళని కూర్చోబెట్టి సపర్యలు చేయగలను."

"గుడ్! ఇంకా?"

"త్వరలోనే వాళ్ళని మెప్పించగలను! ఆ ఇంటికి తగిన కోడలన్పించుకోగలను! ఆ నమ్మకం నాకుంది."

"వెరీగుడ్! నా బరువు దించావు. అయితే ట్రయల్

ఎప్పుడు, ఎలా?"

"అది నువ్వే నిర్ణయించాలి" అంది పద్మిని కుదుట పడుతూ.

ఇద్దరూ తినడం పూర్తిచేశారు. అప్పుడన్నాడు నరేన్.

"ఎల్లుండి వాళ్ళిద్దరు తిరుపతి వెళ్తున్నారు.... రెండు రోజుల తర్వాత వస్తారు. ఆ మర్నాడు ఎలా ఉంటుంది?"

పద్మిని ఊపిరి బిగించడం గమనించాడతను.

"బాగుంటుంది, అప్పుడే వెళ్దాము" అందామె త్రోటు పాటుతో.

నరేన్ కొన్ని క్షణాలు మౌనంగా ఉండి, ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా చటుక్కున అన్నాడు. "మా అమ్మగారికి నగలంటే మహా చెడ్డ పిచ్చి!"

పద్మినికి ఉత్సాహం వచ్చింది. "అవును.... ఆ మాట చాలాసార్లు అన్నావు. అయితే ఈ వయసులో కూడానా?" అందామె.

నవ్వాడతను. "ఈ వయసులో కూడానా! కాదు, అది ఒకప్పటి మోజు! ఇప్పుడవన్నీ భద్రంగా సేఫ్‌లో దాచుకుంది. నువ్వొక్కసారి చూశావంటే కళ్ళు తిరిగిపడిపోతావు. అన్ని నగలు! చెవులకి, ముక్కుకీ, మెడకీ, తలకీ, నడుముకీ, కాళ్ళకీ, చేతులకీ, వేళ్ళకీ.... ఇలా అణువణువునా ఎన్నెన్నో! ఎన్ని నగలో! ఆ వెండి బంగారం సరిగ్గా ఎన్ని కిలోలు తూగుతుందో గానీ-జమిందారుగారి అర్ధాంగిగా అమ్మ చాలా వైభవంగా బ్రతికేసింది! ఇప్పుడామెకి అవన్నీ పెట్టుకొనే ఓపిక లేదు.

ఉత్సాహం అసలులేదు. తన కాలం తీరిపోయిందంటుంది అప్పుడప్పుడు ఆ సంపదని నాన్నగారికి చూపించి."

"చూపించి?" పద్మిని అడిగింది ఆసక్తిగా.

"ఎలా చెప్పను....ఆ కోడలెవరో త్వరగా పట్టుకొచ్చేస్తే, ఇవన్నీ దాని వంటికి తగిలించేసి నా బాధ్యత వదిలించుకుంటానుకదా, ఇంకెన్నాళ్ళు! అంటుంది...."

పద్మినికి ఊపిరాడడలేదు. ఉక్కిరిబిక్కిరి అయింది.

నరేన్ వెంటనే గంభీరంగా మారాడు. "విన్నావా? అంత నిస్వార్థురాలన్నమాట.... వెన్నలాంటి మనసు. కానీ నువ్వు అవన్నీ పెట్టుకోగలవా? ముక్కుపుడక? బారెడు వడ్డాణం? ఇంతేసి బరువు గాజులు? మెడ నొప్పెట్టే గొలుసులు? ఏమిటి.... చెప్పు. ఏ రాత్రికో లేచి పారిపోవు కదా?"

పద్మిని కలవరంలోంచి బైటపడి ఫకాలున నవ్వేసింది. "నువ్వు గమ్మత్తుగా మాట్లాడతావు, నరేన్!"

"అవన్నీ పెట్టుకునే షరతుమీదే నువ్వు ట్రయల్ కి రావల్సి వుంటుంది." అన్నాడతను.

## 2

లోపల గదిలో ప్రభావతి కుర్చీలోంచి లేచి కిటికీ దగ్గరకు వెళ్ళింది. ఆమె మూడ్ ఇప్పుడు చెడిపోయింది. ఇంతసేపూ ఆరాటాన్నంతా అణచుకుంటూ పత్రిక తిరగేసింది....ఇహ ఎదురుచూడ్డం తనవల్ల గాదు!

అశాంతిగా చేతుల్ని నలుపుకుంటూ కిటికీ అవతల చీకట్లోకి చూసింది....ఏమైంది పద్మిని? ఏడుగంటలకే వచ్చేయాల్సింది .... ఇప్పుడు పదవుతోంది. ఇంతవరకూ జాడలేదు! ఎక్కడ వుంది? ఏం చేస్తోంది? హఠాత్తుగా ఉలిక్కిపడిందామె. ఒకవేళ ఏదైనా విపత్తు సంభ

వించిందా? తన గురించి ఎక్కడైనా నోరు జారిందా? నరేన్ ఆమెని అనుమానించి....

ప్రభావతి వళ్ళు జలదరించింది....కొంపదీసి పోలీసు లామెని అరెస్టు చేయలేదు కదా?

"శేఖర్!" అర్చిందామె చటుక్కున తిరిగి.

శేఖర్ వచ్చి పడ్డాడు, రబ్బరు బంతిలా: "ఏమిటాంటీ?"

ప్రభావతి ఉరిమిచూసి గదమాయించింది, "పద్మిని ఇంకా రాలేదేమిట్రా?"

"అదే ఆలోచిస్తున్నామాంటీ!" శేఖర్ అన్నాడు జాగ్రత్తగా. అతని వెనుక నిశ్శబ్దంగా వచ్చి నిలబడ్డాడు నాగేష్.

"ఏడు గంటలకే వచ్చేయమన్నాను. ఇప్పుడు పదవుతోంది. ఏం చేస్తోందింతవరకూ....అతనికీ ఇంటికెళ్ళడం ఆలస్యంకాదా?"

"అతనింటికి ఇంకా వెళ్ళ లేదనుకుంటా నాంటీ!"

"మరి?"

"అతడికి ఆమె అంటే పిచ్చి, ఆంటీ! ఆమెకూ అతడంటే పిచ్చి....పిచ్చీ పిచ్చీ కలిస్తే ఇల్లూ వాకిలీ హుష్ కాకీ కదా, ఆంటీ?" నాగేష్ అన్నాడు హఠాత్తుగా.

"సినిమా కెళ్ళిందనుకుంటాను, ఆంటీ .... బుజ్జబ్బాయితో."

"మరి అతను అర్ధరాత్రి ఇంటికెళ్తే తలిదండ్రులేమీ అనరా?"

"మనకెందుకాంటీ, అతని గొడవ?"

"నిమ్మకాయలున్నాయా?"

"ఆంటీ_?"

"నిమ్మకాయల్రా!"

"ఉన్నాయ్—ఉన్నాయ్యాంటీ!"

"వెళ్ళి మజ్జిగలో పిండుకురా!" ఆజ్ఞాపించిందామె కుర్చీవైపు కదుల్తూ.

శేఖర్ చింకిచెలుకలా మాయమయ్యాడు. వెంట నాగేష్ కదిలాడు.

ఆమె తిరిగి కుర్చీలో వాలి కళ్ళు మూసుకుంది ప్రశాంతంగా. ఇప్పుడు మనసు కుదుటపడింది.... స్వల్ప విషయాలకే ఇలా చలించిపోవడం ఆమెకు అవమాన మనిపించింది. నిదానంగా ఆలోచిస్తే ఆందోళన కల్గించేవన్నీ దూరమవుతాయి.

అవును! పద్మిని సినిమాకే వెళ్ళివుంటుంది - పోలీసులు పట్టుకోవడమేంటి! తన పిచ్చిగాకపోతే! తిట్టుకుందామె. శేఖర్ అందించిన గ్లాసందుకొని మజ్జిగ తాగుతూ ఆలోచనల్లో పడింది. తనిప్పుడు చేపట్టిన పథకం మీదికి మనసును మళ్ళించింది.

నెలరోజులు గడిచాయి .... అన్నీ తృప్తికరంగానే గడిచాయి. అంతా అనుకున్న ప్రకారమే సవ్యంగా జరిగిపోతోంది.... కాకపోతే బోలెడు సహనాన్ని వెచ్చించాల్సివస్తోంది. ఇలాంటి పనులకు ఓర్పు చాలా అవసరం. లేకపోతే అనుకొన్నదంతా జరగదు. పద్మిని ఇప్పటివరకూ బాగానే ప్రవర్తించింది — ఊహుఁ — బ్రహ్మాండంగా నటించింది! చివరిదాకా ఇలాగే అతన్ని నమ్మిస్తుంది తనకా ధీమా వుంది. ఈ పూర్తి పథకం పద్మిని మీదే ఆధారపడి వుంది. ఆమె దాన్ని నిస్సందేహంగా విజయవంతం చేస్తుంది!

గ్లాసు కింద పెట్టి కొంగుతో మూతి తుడుచుకుంది

ప్రభావతి—

ఈ నరేన్‌కుమార్ జమిందారు బిడ్డ. ఏకైక గారాలపట్టి. విజయవాడకు పాతిక కిలోమీటర్ల దూరంలోని ఓ మారుమూల గ్రామం చెక్కిలి వాస్తవ్యుడు. చెక్కిలి! నవ్వుకుంది ప్రభావతి. చక్కిలిగింతలా? ప్రియురాలి చెక్కిళ్ళా? గమ్మత్తుగా వుంటాయి కొన్ని ఊళ్ళ పేర్లు!

ఆ ఊరికి ఆమెగాని, ఆమె అనుచరులుగానీ ఎన్నడూ వెళ్ళలేదు. అయితే నరేన్ పద్మినికి చెప్పకోగా అవన్నీ తెలుసుకుంది....ఆ ఊరి జనాభా అయిదొందలు. ధనవంతులంటూ ఎవరూ లేరు, ఒక నరేన్ కుటుంబంతప్ప. ఈమధ్యనే కరెంటు వచ్చింది. ఊరవతల చిన్న చెరువూ, దానవతల అడవి ప్రదేశమూ ఉన్నాయి. పోలీస్‌స్టేషన్ లేదు. ఇదే ప్రభావతికి ఊరట కలిస్తోంది. ఆమె ప్లానులో వాళ్ళ బెడద పూర్తిగా తప్పింది!

ఇహ తాము చేయవల్సిందేమీ లేదు — ఒకానొక అనువైన రాత్రి చప్పున కారేసుకుని వెళ్ళి, ఆ జమిందారు ఇంట్లో నగలు పట్టుకొచ్చేయడమే!

అప్పుడు తమకక్కడ ఎవరికంట పడ్డా భయపడే అవసరంలేదు. వాళ్ళు విజయవాడలో పోలీసు సహాయం పొందేలోపులో తాము ఎన్నో మైళ్ళదూరంలో వుంటారు- శాశ్వతంగా అదృశ్యమైపోతారు, అంతే.

ఏడు నెలలైంది! బెంగుళూరు వదలి ఈ విజయవాడ వచ్చిన ఇన్ని నెలల్లో ఒక్క లాభసాటియైన పనికూడా తగలేదు. పైగా చిల్లరమల్లర పనులతోనే చీటికీ మాటికీ పోలీసులతో తలపడటం జరుగుతోంది. ఇహ ఇక్కడ చాలు! ఈ జమిందారు సొమ్ము ఎత్తుకొంటే ఈ విజయ

వాడకు గుడ్ బై కొట్టేసి కలకత్తా చెక్కేయాలంతే!

పద్మిని ఆ రోజు (నెల క్రిందట) సాయంత్రం రోజులాగే ఎవరికైనా వల విసురుదామని బయల్దేరింది. అలా బయల్దేరిందంటే ఆమె రోజుకో చేపని చిక్కించుకుంటుంది. అప్పుడా చేప ఆ పూటంతా ఆమె గుప్పిట్లోనే వుంది— మస్తిష్కం బాగా తిమ్మిరెక్కుతోందంటే అడిగిందల్లా బయట పారేసుకుంటుంది!

అప్పుడు—పద్మిని అదంతా ప్రభావతిముందు గుమ్మరిస్తుంది. ప్రభావతి ఏరిచూసుకుని, ఆ ముడిసరుకులతో అద్భుతమైన ప్లానువండి అనుచరులకి వడ్డిస్తుంది—వాళ్ళిద్దరప్పుడు నమ్మకమైన జాగిలాల్లా వెళ్ళి చప్పున ఎముకలు ఊడ్చుకొచ్చేస్తారు.

ఇలా పట్టణంలో ఎన్నో కొంపలారిపోయి, ఎందరో రసికులు బికారులయ్యారు.

ఇదీ ప్రభావతి గ్యాంగ్ మోడస్ ఆపరెండి!

ఆ రోజు అదే రొటీన్ డ్యూటీమీద బయల్దేరిన పద్మినికి నరేన్ వ్యవహారం కొంచెం ప్రత్యేకంగా తోచింది. అతను మామూలు చేపలా లేడు. వారందరికీ భిన్నంగా మంచి వ్యక్తిత్వానికి మచ్చుతునకలా కన్పించాడు. నిజానికి తనే ఆమె వెంటపడి పరిచయం చేసుకున్నాడు. (ఆఫ్ కోర్స్, పద్మినిలాంటి రూపసి పరిచయ భాగ్యాన్ని కాంక్షించని పురుషుడెవరు!) అతను వెకిలిగా ప్రవర్తించలేదు. అతనిలో ఎంతో పవిత్రత, సంస్కారం కనిపించాయి....పద్మిని జాగ్రత్తపడి, అతని విషయంలో తొందరపడకూడదని నిశ్చయించుకుంది.

ఆది మొదలు—అడపాదడపా అతడు తన ఊర్నుంచి వస్తున్నాడు. ఆమెని కలుసుకుంటున్నాడు. కబుర్లు

చెప్తున్నాడు ఎంతో అమాయకంగా, స్వచ్ఛంగా, సున్నితంగా.

క్రమంగా ఆ పరిచయం గాఢమైన స్నేహంగా మారి అతి త్వరలోనే ప్రేమలోకి దిగి, ఇప్పుడు పెళ్ళికి పరుగులు తీస్తోంది!

అతనెప్పుడూ తమ జమిందారీ వంశం గురించి, తన ఫోటోగ్రాఫీ హాబీ గురించి చెప్పుకోడంతప్ప ఆమెని ఏమీ అడగడంలేదు. ఆమె విషయాల్లో అంతగా ఆసక్తి చూపడంలేదు. ఇదెంతో సదుపాయంగా ఉంది పద్మినికి. తనకి ఇరుకున పడుతూండే ప్రమాదం తప్పింది! ఎప్పటి కప్పుడు అతను చెప్పే విషయాలన్ని ప్రభావతికందిస్తోంది. నరేన్ని వంచిస్తోంది! మోసంచేస్తోంది, అతనితో అద్భుతంగా నటిస్తోంది తమ ప్రయోజనం కోసం.

పద్మిని అందిస్తోన్న సమాచారాన్ని పోగుచేస్తోన్న ప్రభావతికి క్రమంగా మెదడులో ఓ పథకం రూపొదిద్దుకోసాగింది. మంచి అయిడియాకి సోపానాలు పడసాగాయి....చివరికిప్పుడది ఓ రూపాన్ని ఏర్పరచుకుంది!

ఆ అయిడియా ఆచరణలో పెట్టే సమయం కూడా ఆసన్నమైనట్టు కన్పిస్తోంది ...పరిస్థితుల్ని చూస్తే.

ప్రభావతికి ఒళ్ళు తేలిపోసాగింది....

ఈ అయిడియా గనుక ఫలిస్తేనా!

ఆమెకు ఎగిరి గంతెయ్యాలన్పించింది....

లక్షలు! లక్షలు! ఓహ్, వాటిని వెదజల్లుకొని అందులో దొర్లాలి!

ఆమె వెంటనే తెప్పరిల్లుతూ చెవులు రిక్కించింది.

బయటేవో మాటలు విన్పిస్తున్నాయి....

పద్మిని! పద్మిని వచ్చేసింది!

# 3

మర్నాడు కూడా రోజులాగే సాయంత్రం నరేన్ కుమార్ ఆమెని హోటల్ నర్తకిలో కలుసుకున్నాడు.

అతనిలో ఏదో మార్పు కన్పించింది పద్మినికి.

టిఫిన్ చేస్తున్నప్పుడు నెమ్మదిగా అడిగిందామె.

"ఏమిటలాగున్నావ్, నరేన్? ఇంట్లో ఏమైనా జరిగిందా?"

అతను అడ్డంగా తలవూపాడు!

"రేపుదయమే మా అమ్మా నాన్న తిరుపతికి వెళ్తున్నారు...."

"అవును, వాళ్ళు వచ్చిన మర్నాడు మన ట్రయల్."

"కానీ డియర్, అంతకుముందు ఒక చిన్న డిమాన్స్ట్రేషన్."

"ఏమిటది, నరేన్?"

అతను నవ్వాడు. "నీకు మా అమ్మగారి నగల మ్యూజియం చూపిస్తాను!" అన్నాడు తినడం పూర్తి చేసి గర్వంగా.

పద్మిని కొయ్యబారిపోయింది ఒక్క క్షణం. అలాగే చూస్తూండిపోయింది, తినడం మానేసి.

అతనన్నాడు మళ్ళీ, "రేపంతా మనదే! వాళ్ళని రైలెక్కించి మధ్యాహ్నం ఇటొచ్చేస్తాను. పన్నెండు గంటలకి. నిన్ను మా ఇంటికి తీసుకెళ్తాను. మా ఊరు, పొలాలు చూపిస్తాను. నిన్ను ఫోటోలు తీస్తాను. మా అమ్మగారి మ్యూజియం చూపిస్తాను. అవి నువ్వు ధరిస్తే ఇంకెంత మెరిసిపోతావో చూసి తరిస్తాను! నువ్వొక్కసారి వాటిని ధరిస్తే మరిక తియ్యను పొమ్మంటావు, ష్యూర్!"

పద్మిని ఇంకా తేరుకోలేదు.

"ఏమంటావు, చేపొస్తావా?"

అప్పుడు తేరుకుంది పద్మిని. వెంటనే గ్లాసులోని నీళ్లు తాగేసి తలూపింది.

"మంచిది, నరేన్....చాలా థాంక్స్."

# 4

మర్నాడు ఉదయం పదిగంటలకల్లా పట్టణంలోని ప్రముఖ వ్యాపారి సేట్ డోమర్‌మల్ పకోడా షాపులో నగల చోరీ దవానలంలా వ్యాపించిపోయింది....

ఆ వార్త తీవ్రమైన సంచలనాన్ని కల్గించింది. ప్రజల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. తోటి వ్యాపారాసులకి తట్టుకోలేని షాక్‌ని తినిపించింది. ఇంత పెద్ద దోపిడీ జరగడం పట్టణంలో ఇదే ప్రథమమని ఎటు చూసినా వ్యాఖ్యలే!

దోపిడీ రాత్రి జరిగింది. ఉదయం షాపు తెరిచినప్పుడు అది తెలిసింది. షాపు వెనుక భాగంలో, గోడకి పైన వుండే ఇనుపచువ్వల వెంటిలేటర్, పూర్తిగా తవ్వి తొలగించబడింది. వెనుక ఇరుకు సందులో దోపిడీదారు(లు) ఉపయోగించిన చెక్క నిచ్చెన ఇంకా అలాగే వుంది. కానీ దానిమీద ఆధారాలేవీ లేవు. అతి ఖరీదైన ఆభరణాలన్నీ అపహరించబడ్డాయి. వాటి విలువ సుమారు ఏడులక్షలకి అంచనా వేయబడింది.

డోమర్‌మల్ వాటి వర్ణన వివరాలు పోలీసులకి ఇచ్చాడు.

పోలీసులు నేరస్థలాన్ని సందర్శించి పరిస్థితి తెలుసుకున్నారు. ఇంత పెద్ద దోపిడీ చేసిన దొంగలు ఇంకా పట్టణంలోనే ఉండే అవకాశంలేదు. అందువల్ల రైల్వే స్టేషన్‌లోనూ, బస్ స్టేషన్‌లోనూ, ఇంకా ఇతర ట్రాన్స్

పోలీసుస్టేషన్లోనూ మంచి వేడిమీద దర్యాప్తును ప్రారంభించారు. దొంగల ఆనవాలేవీ తెలీవు గనుక ట్రేస్ చెయ్యడం సులభమైన పనికాదు.

ముగ్గురు డిటెక్టివ్ ఇన్స్పెక్టర్లు పట్టణంలోని తమకు తెలిసిన నేరస్థులంతా వున్నారో లేదో తెలుసుకుందికి నడుంకట్టారు.

ఇంతలో సేఠ్ డోమర్ మల్ పకోడా దొంగ(ల్ని) పట్టిచ్చినవారికి పదివేల రూపాయల నగదు బహుమానం ప్రకటించడంలో, ఈ వ్యవహారం ఇంకా ఆసక్తికరంగా రూపుదాల్చింది.

రంగంలోకి దిగిన డిటెక్టివ్ ఇన్స్పెక్టర్లు బాజ్జీ, వెంకటేశ్వరరావు, సత్యనారాయణరావు మొదలైనవారు రెండు గంటల్లో పట్టణంలోని నేరస్థులందరినీ గాలించి పట్టుకొని విచారించారు. అందరూ ఊళ్ళోనే వున్నారు, తమకు తెలిసిన సంఖ్య ప్రకారం. వరుసగా ఒక్కొక్కరి స్టేట్మెంట్ని తీసుకొని హెడ్క్వార్టర్స్కి పంపినా, అక్కడి సిబ్బందితో వాళ్ళ ఎలిబీల్ని చెక్ చెయ్యడం చకచకా జరిగిపోతోంది. అందరివీ నిజమైన ఎలిబీలుగానే తేలుతున్నాయి....అసలు ఎలిబీలవరకూ అనవసరమని వాళ్ళకు తెలుసు. ఇంత పెద్ద దోపిడీ చేసి ఎవరూ పట్టణంలోనే వుండి ధైర్యం చేసి పోలీసులకి కన్పించే ప్రయత్నం చెయ్యరు!

పాత నేరస్థులంతా ఇక్కడే వున్నారు. రాత్రి ఎవరూ ఏ నేరానికీ పాల్పడలేదు. అయితే బయట దొంగలు కావచ్చా అని అనుమానం కల్గింది....అప్పుడే వాళ్ళకి తమ దర్యాప్తులో ఎవరో తప్పిపోయినట్టు తెలిసింది....

ప్రభావతి ముఠా!

అవును, అది పరాయి ముఠా! ఈ మధ్యనే ఇక్కడ స్థిరపడింది!

అయితే అది ఎప్పుడూ దోపిడీలూ దొంగతనాలు చేసే ముఠాగా కనిపించలేదు. అందువల్ల మరో రకంగా అనుమానించారు. కానీ ఎప్పుడు రెయిడ్ చేసినా ఏమీ వుండదు, ఎవరూ దొరకరు. పడక్కుర్చీలో ప్రభావతి పత్రికలు చదువుకుంటూ, మంచంమీద పద్మిని పూలు కట్టుకుంటూ, బయట అరుగులమీద పోరగాళ్ళిద్దరూ బీడీలు కాల్చుకుంటూ—అంతా బుద్ధిగా, ఎంతో ముద్దుగా కన్పిస్తారు.

వాళ్లంతా ఎంతో గుంభనంగా మసలుకొంటున్నారు.

ప్రభావతి ఎవరో, ఆమె పుట్టుపూర్వోత్తరాలేమిటో పోలీసులకింకా తెలీదు. ఆమె ఈ మధ్యనే రెండునెలల క్రితం వారి దృష్టిలో పడింది. అయితే ఆమెని ఏ కోవకి చేర్చాలో తోచక తలబద్దలు చేసుకుంటున్నారు. ఆమె కారును భరిస్తోంది. పటమటలోని పరువుగల కుటుంబాల మధ్య మూడొందల అద్దె ఇంటినీ భరిస్తోంది. ఆదాయం గురించి డొంకతిరుగుడు మార్గాలు చూపుతోంది.

డిటెక్టివ్ పోలీసులకి ఈ కేసులో ఆమెనీ కదిపి చూస్తే బాగుంటుందన్పించింది. వారి అంతరాంతరాల్లో ఎక్కడో ప్రభావతికి మరో రూపం వుందనీ, ఆ చాటు రూపం తామనుమానించే లక్షణాలనే కలిగివుందనీ, ఆమెని చూసినప్పటినుంచీ తోలుస్తూనే వుంది....

అందువల్ల ఈ కేసులో ఆమెనీ పరీక్షించి తీరాలనుకున్నారు.

మధ్యాహ్నం పన్నెండవుతోండగా వాళ్ళు ఆ ఇంటి ముందు జీపు దిగారు.

అప్పటికే నరేన్ కోసం వెళ్ళకుండా ఆలస్యం చేసిన పద్మినిని అదిలిస్తోన్న ప్రభావతి, ఇంటిముందు జీపును చూసి అదిరిపడింది. వెంటనే అనుచరుల్ని కేక వేసింది. వాళ్ళిద్దరు ఉపగ్రహాల్లా వచ్చి ఆమెను చుట్టుముట్టారు.

వారిని చూసి వారించిందామె. "మళ్ళీ వీరికేదో తోచినట్టుంది. జాగ్రత్త, మీరు మాట్లాడకండి. అంతా నే చూసుకుంటాను...."

"కానీ, ఇలా పగలెప్పుడూ రాలేదు ఆంటీ" శేఖర్ అన్నాడు.

"ఏదో విశేషం వుండాలి. ఊళ్ళో యేమైనా జరిగిందా?"

"తెలీదు ఆంటీ, పొద్దుట్నుంచీ మేం ఇంట్లోనే వున్నాం."

"సరే, తప్పుకోండి, వాళ్ళొచ్చేస్తున్నారు...."

వాళ్ళు ముగ్గురూ ఉత్సాహంగా లోపలికొచ్చారు. అందరి మొఖాలమీదా చిరునగవులున్నాయి. ముగ్గురూ ఆ నలుగురినీ సమీపించారు.

"రాత్రి మీరెక్కడున్నారు?"

"ఎందుకు? మళ్ళీ యేం వచ్చింది? ఇదివరకు రాత్రులు వచ్చేవారు. ఇప్పుడు పగలే వచ్చి వేధించడం మొదలెట్టారా?" విసుగ్గా అంది ప్రభావతి.

"మీ వెధవపనులకు రాత్రి పగలంటూ వుందా?"

"ఇన్స్పెక్టర్! సంగతి చెప్పండి. ఏం కావాలి మీకు? యేం జరిగింది?"

"నీకు తెలీదా? నిజంగా నీకేం తెలీదా?"

"మాకేం తెలీదు, మేం గౌరవంగా బ్రతుకుతున్నాం."

"సరే, నాతోనే చెప్పించాలనుకుంటే విను! రాత్రి

రాబరీ జరిగింది. నగలు. డోమర్‌మల్ షాపులోంచి. బీసెంట్ రోడ్డులో. ఏడులక్షలవి....."

ప్రభావతి వొళ్ళు చల్లబడిపోయింది .... భరించలేని చల్లదనం. మంచులో కూరేసినట్టు! కొయ్యబారిపోయింది. అనుచరుల స్థితీ అలాగే వుంది.

ప్రభావతి ఉలికిపడి ఈ లోకంలోకి వచ్చింది. వెంటనే అత్యంత ఆశ్చర్యంతో అర్చింది.

"దోపిడీ జరిగిందా! నగలు దోచుకున్నారా!"

"మోర్ ఏక్టింగ్!" బాబ్జీ అన్నాడు.

రావ్ నవ్వాడు. "నీకాశ్చర్యంగా వుందా? ఇదిప్పుడే వింటున్నావా? నువ్వు బ్రహ్మాండంగా నటిస్తావు ప్రభావతీ!"

రావ్ అన్నాడు సిగరెట్ ముట్టించుకుంటూ, "మమ్మల్ని నువ్వింతకాలంగా బాగానే ఫూల్స్ చేస్తూ వచ్చావు.ఎందులోనూ దొరికిపోకుండా చాలా జాగ్రత్తలు వహిస్తున్నావు. కానీ ఇప్పుడు—ఈ లోఫర్ గాళ్ళిద్దరూ నీ కొడుకులంటేనూ, ఈ లూజ్ కారెక్టర్ నీ కూతురంటేనూ మేం నమ్మే స్థితిలో లేము. నీ మొగుడు కువైట్‌లో డబ్బు గడించి పంపుతున్నాడంటేనూ కూడా నమ్మలేము. మీరంతా హంబక్స్! క్రూక్స్! క్రిమినల్స్! అది మా మనస్సాక్షికి తెలుసు. కానీ నిదర్శనాలే దొరకడంలేదు...."

"అంటే, ఆ దోపిడీ మేం చేశామంటారా?"

"అందుకేకదా వచ్చింది? బాబ్జీ! రాజుగారూ! మీ రిద్దరూ ఇంటిని సోదా చెయ్యండి!"

వాళ్ళిద్దరు వెంటనే కదిలివెళ్ళారు.

"చేసుకోండి. ఇన్‌స్పెక్టర్. మా చేతులు శుభ్రంగా

వున్నాయి" అంది ప్రభావతి.

"అయితే నిబ్బరంగా వుండు" అన్నాడు రావ్.

"కానీ మీరొక్కటి గమనించడంలేదు. అంత సొమ్ము దోచుకొనివుంటే మేం ఇంకా ఇక్కడే వుంటామా పారి పోకుండా?"

"వుంటారు ప్రభావతీ. పారిపోవడం నేరాన్ని చాటు కోడం కాదా?"

ఆమె అసహనంగా చూసింది. మాట్లాడలేదు.

ఇన్స్పెక్టరిద్దరూ తిరిగివచ్చి అడ్డంగా తలూపారు.

"వాటి నెక్కడో—చేర వేసింది" అన్నాడు బాబ్జీ.

"ఈమెతో లాభంలేదు, రావుగారూ!" అన్నాడు, "ఈ కుర్రాళ్ళ చేత పలికిద్దాం."

శేఖర్, నాగేష్‌లు ఉలికిపడే కార్యక్రమాన్ని ఇంకా సమాప్తం చెయ్యనేలేదు, వాళ్ళ చెంపలు రెండూ ఏక కాలంలో పెద్దపెట్టున పగిలాయి! కీచుగా అరిచి ఒకేసారి రక్తం కక్కుకున్నారు. పక్క గదిలోకి పరుగుతీశారు. రాజు వాళ్ళ వెనుక నడిచాడు.

"ఆగండి, ఇన్స్పెక్టర్!" ప్రభావతి ఆవేశంగా ముందుకెళ్ళిబోయింది.

బాబ్జీ ఆమెని వెనక్కు తోశాడు.

లోపల సంగీత కచేరి జరుగుతోంది. రాజు నిర్వహిస్తున్నాడు.

రావ్ వింటూ ఆనందిస్తున్నాడు. బాబ్జీ కాసేపు విని ఆపమని అరిచాడు.

"ఆపేయండి, రాజుగారూ! వారితో ఇంక లాభం లేదు. ఈ పెట్టుబడిని కదిపితే పెన్నిధి దొరుకుతుంది-"

"పెట్టుబడా....?" రావ్ అన్నాడు తికమకగా.

"మరి ఈ కవుజు పిట్ట ముసల్దాని పెట్టుబడికదూ?"

"బాబ్జీ! నీ మాటలు జాగ్రత్త!"

"ముందు నీ నోరు జాగ్రత్త ముసల్దానా! నన్ను ఇన్స్పెక్టర్ గారూ అని పిలువ్. నువ్వూ గివ్వూ అనకు. మీరూ అండీ అను!" బాబ్జీ హెచ్చరించాడు పద్మిని దగ్గరికి కదులూ. ఆమె భయంతో కంపించిపోయింది. ఒక్క కేకపెట్టింది.

ప్రభావతిని కదలకుండా రావ్ అదుపుచేశాడు.

పద్మిని చెంపమీద బాబ్జీ చెయ్యి ఛెళ్ళుమంది.

"చెప్పు, టక్కరిముండా! నగలెక్కడ దాచారు?"

పద్మిని చెంప ఎర్రబడి అయిదువేళ్ళ గుర్తులూ పడ్డాయి.

"మాకు తెలీదు, ఇన్స్పెక్టర్!"

బాబ్జీ ఆమెని గెడ్డంమీదా, కంఠంకిందా, పొట్టలోనూ స్టిక్‌తో పొడిచాడు.

"కమాన్, చెప్పు రమణీ! బెట్టుచెయ్యక!"

"మాకేం తెలీదు, ఇన్స్పెక్టర్!"

బాబ్జీ ఆమె మోకాళ్లమీద లాగికొట్టాడు. ఆమె గట్టికేక వేసి కిందపడిపోయింది.

అదే క్షణంలో ప్రభావతి రెచ్చిపోయిన పులిలా రావ్‌ని పక్కకితోసేస్తూ, బాబ్జీమీదపడి కాలరు పుచ్చుకుంది. బాబ్జీ ఆమె దవడకిందసాచి ఒక ముష్టిఘాతం ఇచ్చాడు. ఆమె పెద్దగా అరుస్తూ చేతు లెగరేసుకుంటూ వెళ్ళి తలుపు దగ్గర ధబీమని పడింది వెల్లికిలా.

"బి కేర్ ఫుల్, ముసల్దానా!" బాబ్జీ హెచ్చరించాడు షర్టు సరిచేసుకుంటూ-

రాజు అలసటగా తిరిగివచ్చాడు గదిలోంచి.

రావ్ నేలమీద పద్మినిని సమీపించాడు. ఆమె చేతు లడ్డం పెట్టుకొని వారించింది. "నా దగ్గరకి రాకండి! నన్ను కొట్టకండి! మాకేం తెలీదు! రాత్రి మేం ఇక్కడే ఉన్నాం! ఆ దోపిడీ మేం చెయ్యలేదు, నన్ను నమ్మండి!"

ఆమె కేకలు వింటూ ముఖంలోకి చూస్తూంటే రావ్‌కి ఆమె నిజమే చెప్తున్నట్టు అనిపించింది. నిట్టూర్చి బాబీజె వైపు తిరిగాడు.

"పదండి వెళ్ళిపోదాం, ఈ ట్రీట్‌మెంట్ చాలు."

"చాలంటారా?"

"చాలు. డోస్ ఒకింత ఎక్కువ ఇచ్చేం" అన్నాడు రాజు.

వాళ్ళు ముగ్గురూ బయటకు వెళ్ళి ఏదో మాట్లాడుకుని జీపెక్కారు.

హఠాత్తుగా నిశ్శబ్దం ఏర్పడింది. ప్రభావతి కళ్ళు తెరిచింది. దూరంగా నేలమీద పద్మినిని చూసి చటుక్కున లేచికూర్చుంది.

అప్పుడే గదిలోంచి శేఖర్ నాగేష్‌లు కుంటుతూ వచ్చారు.

ప్రభావతి నిండుగా పైట కప్పుకొని, కొప్పు సవరించుకొని చేతులు చాపింది—సాయంపట్టమని. వాళ్ళిద్దరు పట్టిలేపారు.

"పిళ్ళని అరికట్టాలి.ఆంటీ! ఈ దెబ్బల్ని భరించలేం!" శేఖర్ అన్నాడు.

"మర్చిపోండ్రా!" అంది ప్రభావతి ఒళ్ళు విరుచుకుంటూ, "ఈ దెబ్బల్ని ఎవడు లెక్కచేస్తాడూ, ఆ దోచుకుపోయిందెవడో తోచక చస్తూంటేనూ...."

పద్మినికి నొప్పులు ఎక్కువై మెలికలు తిరగసాగింది.

ప్రభావతి చలించిపోయింది, "ఆ చంటిది చూడండ్రా ఎలా రెపరెపలాడిపోతోందో! లేపి దానిగొంతులో కాస్త మజ్జిగ పోయండ్రా!"

వాళ్ళిద్దరు పోటీపడి లేపి ఆ మెని కుర్చీలో ప్రతిష్టించారు, సొంత నొప్పులు మర్చిపోయి. నాగేష్ విసనకర్ర విసురుతూ నిల్చున్నాడు. శేఖర్ మజ్జిగకోసం వెళ్ళాడు.

"ఏడు లక్షలు!" అర్చింది ప్రభావతి, "విన్నావా? ఏడు లక్షల నగలు దోపిడీ! ఎవడు చేసివుంటాడు? వాడింకా ఊళ్ళోనే వున్నాడా?"

"ఎందుకాంటీ, ఏంచేస్తావు?" నాగేష్ అడిగాడు.

ప్రభావతి తలపైకెత్తి గబగబా నవ్వింది. "ఏంచేస్తానేమిట్రా, మొద్దు సన్నాసీ! దోచుకుపోయేవాడొకడైతే తన్నులు తినేది మరొకరూనా? వాణ్ని పట్టుకొని బెదిరిస్తాను. బ్లాక్ మెయిల్ చేస్తాను. భాగమివ్వమంటాను-ఈ దెబ్బలకి పరిహారంగా!"

"ఆంటీ, నీకు తిక్కరేగింది!" అన్నాడు నాగేష్. ఆ మరుక్షణంలో అతను వంటగదిలో పారిపోయాడు.

శేఖర్ తిరిగివచ్చాడు మజ్జిగ గ్లాసులతో. పద్మినికి ప్రేమగా అందించి ప్రభావతికి భక్తితో అందించాడు.

"ఆ దోపిడీ ఎవరు చేశారో నీకు అయిడియా వుందట్రా, శేఖర్?" అడిగింది ప్రభావతి మజ్జిగ తాగుతూ.

"ఎలా తెలుస్తుంది, ఆంటీ...." అంటూ చటుక్కున నోటిదగ్గర గ్లాసు తీసేసి అన్నాడు శేఖర్, "ఆంటీ, ఇలాంటి గట్టిపనులుచేసే వాడొక్కడే!"

"యెవఁడ్రా అది, చెప్పు?"

"పొట్టోడు-ఆంటీ!"

ప్రభావతి ఉలిక్కిపడింది. "పొట్టోడా! అవును, కరెక్టు! వాడే! అయితే వాడింకా ఊళ్ళోనే వున్నాడా?"

"మనకెందుకాంటీ? వాడితో మనకు పడదు!"

"ఇలాంటి సమయాల్లోనే పగతీర్చుకోవాలి!" అంది ప్రభావతి గబగబా ముస్తాబవుతూ. "నేను వెళ్తాను. వాణ్ని పట్టుకొని....పద్మిని! నువ్వు నరేన్‌ని కలుసుకోవా?"

"కలుసుకోవాలి. గంట ఆలస్యమైంది!"

"మరి తెములు! నిన్ను హోటల్ దగ్గర డ్రాప్ చేస్తాను."

"ఆంటీ నువ్విలా వెళ్ళడం మంచిదికాదు. పోలీసులు కనిపెడుతుండవచ్చు" శేఖర్ హెచ్చరించాడు.

"వారి నోట్లో దుమ్ము కొడతాను!" అంది ప్రభావతి కసిగా.

## ౫

చెప్పిన టైము దాటి గంటగడిచినా పద్మిని జాడ లేకపోవడంతో నరేన్ అసహనంగా, ఆందోళనగా ఎదురు చూడసాగాడు.

అప్పుడామె దూరంగా కారు దిగి గబగబా నడిచి వస్తోంటే, కారులోని మరో స్త్రీని ఆశ్చర్యంగా చూస్తూండిపోయాడు.

పద్మిని అతన్ని పోర్టికోలో కలుసుకోగానే ఆమె వాలకం చూసి కంగారుపడ్డాడు.

"పద్మినీ! ఏం జరిగింది?"

ఆమె అడ్డంగా తలూపింది, మాట్లాడలేదు.

అతను చప్పున ఆమెని తీసుకొని లోన ఫ్యామిలీ రూంలోకి వెళ్ళిపోయాడు.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. పద్మినికి భయంతో మాటలు రావడంలేదు. నరేన్ ఇంకా కంగారుగా చూశాడు.

"చెప్పు పద్మినీ, ఏం జరిగింది?"

ఆమె మళ్ళీ అడ్డంగా తలూపింది.

"నో, దాస్తున్నావు! ఏదో జరిగింది....ఆ చెంపమీద గుర్తులేమిటి? ఎందుకలా నీరసంగా వున్నావ్? ఏడ్చావని నీ కళ్ళు చెబుతున్నాయి...."

పద్మిని తలవంచుకుంది. కార్లో ప్రభావతి చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి. హఠాత్తుగా కన్నీళ్ళు తెచ్చుకొని తలెత్తి చూసింది.

"మనగురించి నాన్నకు తెలిసిపోయింది, నరేన్!"

అతను కలవరపడి చూశాడు. వెంటనే తేరుకుంటూ, "అంతే కదా!" అన్నాడు.

"తెలిసి నన్ను కొట్టాడు!" అంది పద్మిని మళ్ళీ. "పరమ కోపిష్టి! ఎదిగిన పిల్లలతో ఎలా ప్రవర్తించాలో తెలియదు."

నరేన్ ఈసారి ఉలిక్కిపడి, కోపంతో పిడికిళ్ళు బిగించాడు.

"నిన్ను కొట్టే హక్కు ఆయన కెక్కడిది? నీకు మైనారిటీ తీరింది. ఇప్పుడు నీ బ్రతుకు నీ ఇష్టం, కాదా?" అంటూ ఆమె చెంపని ఆదుర్దాగా నిమిరాడు.

"నేనింక ఇంటికెళ్ళను, నరేన్" అందామె కన్నీళ్ళు ఆపుకుంటూ.

"ఇప్పుడే వెళ్ళి మీ నాన్నతో చెప్పేద్దాం, ఈ పెళ్ళి

జరుగుతుందని. పారిపోయి అందరి నోటా పడ్డం నా కసహ్యం!"

"వద్దు నరేన్, ఇప్పుడే వద్దు. కొంత టైం ఇవ్వు. ఆయన చల్లబడతాడు. ఈలోపు మీ వాళ్ళని ఒప్పిద్దాం-"

నరేన్ కాసేపటి తర్వాత తలూపాడు, "సరే, కానీ నువ్వీరోజు ఎంతో ఆనందంగా మా యింటికొస్తావను కున్నాను. ఎంతో హాయిగా గడుస్తుందనుకున్నాను-"

"లేదు, నరేన్ నే నిప్పుడు ఆనందంగానే వున్నాను. నువ్వు బాధపడకు."

వెయిటర్ వచ్చి ఆర్డరు తీసికెళ్ళాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది నరేన్‌కి—ఆ కారులోని స్త్రీ

వెంటనే అడిగాడు, "అయితే నిన్నిందాకా డ్రాప్ చేసిందెవరు?"

అదిరిపడిందామె. కళ్ళు తిరిగి కింద పడుతున్నట్లనిపించింది!

అయితే ప్రభావతి తనని డ్రాప్ చేయడం ఇతను చూశాడా!

వెంటనే ఏం చెప్పాలో తోచలేదు. "ఆమె— ఆమె—"

"ఆమె—?"

"మా పక్కింటావిడ! అంది పద్మిని గుటక మింగుతూ, "నన్ను ప్రేమగా చూస్తుంది!"

"ఓహ్, ఐసీ....ఆమెకు డ్రైవింగ్ కూడా వచ్చా? అది మీ కారు కదూ? ఒకటి రెండుసార్లు నువ్వు డ్రైవ్ చేసుకుంటూ వచ్చావు, ఏం?"

"మా కారే...."పద్మిని భయం ఇంకా తొలగలేదు,

"ఆమె యేదో పనిమీద వెళ్తూ మా కారాడిగి తీసు కుంది."

"మనగురించి ఆమెకు తెలుసన్నమాట!"

పద్మినికి అసహనంగా వుంది. విషయం దాటవేయాలని తొందరపడింది—ఇలాంటివే కొంపలు ముంచుతాయి! కానీ యేం మాట్లాడాలో తెలీని శూన్యత యేర్పడింది మనసులో. "తెలుసు .... చాలా సంతోషించింది" అందామె.

నరేన్ మాట్లాడలేదు. ఆలోచనలో పడ్డాడు.

పదార్థాలు వచ్చాక ఇద్దరూ మౌనంగానే తిన్నారు. పావుగంటలో బయటపడి ఇద్దరూ కారెక్కారు.

"గంటలో మన ఇంటికి చేరుకుంటాం!" అన్నాడతను నవ్వుతూ.

కారు కదిలింది .... శరవేగంగా కారు దూసుకు పోతోంటే, మౌనంగా కూర్చున్న పద్మినికి గుండె దడ విపరీతంగా వచ్చింది.

తానెలాంటి దృశ్యాన్ని చూడబోతోందో కదా సేఫ్‌లో!

## 6

పాట్టోడితో భేటీకి బయల్దేరిన ప్రభావతి, తనని పోలీసులు వెంటాడకుండా తను నేర్చిన యుక్తులన్నీ ప్రదర్శించింది. కానీ ఎక్కడా వెంటాడుతున్నట్టు యే వాహనమూ కనిపించలేదు.... ఆమెకు ధైర్యం చిక్కింది.

దాంతో పాట్టోడి మీద కసి ఇంకా పెరిగింది!

పాట్టోడు—అతని అసలు పేరు పూర్ణచంద్రయ్య—పూర్ణచంద్రుడిలా గుండ్రంగానేగాక, పొట్టిగానూ వుంటాడు. అందుకే అతనికా మారు పేరు స్థిరపడింది.

అతని ఎత్తు సర్గ్గా నాలుగడుగుల పదంగుళాలు మాత్రమే.

అతని తాతపొట్టి, తండ్రిపొట్టి. అందుకని అతనూ పొట్టి. అయితే అనువంశికముగాని అవలక్షణం ఒకటి అతనికబ్బింది. అది నవ్వేతీరు. చీటికీమాటికీ వానరంలా కిచకిచా నవ్వుతూంటాడు. ఎదుటివారి సహనానికి పరీక్ష పెడుతూంటాడు.

నిన్నటితో అతనికి నలభై అయిదు నిండి నలభై ఆరులో ప్రవేశించాడు. ఆ సందర్భంగా గతరాత్రి జన్మదిన వేడుకల్ని ఘనంగా జరుపుకున్నాడు. పాతిక మంది భక్తజనాన్ని పోగుచేసి పీకలదాకా బీరు పోయించాడు. దజనుకుపైగా కోళ్ళను తెగ్గోసి తృప్తి కరంగా విందుచేశాడు.

విజయవాడలో అతన్ని గురించి పోలీసులకీ, కొందరు పెద్దమనుషులకీ, బాగా తెలుసు. పొట్టోడు కిరాయి మనిషి. కిరాయిమీద ఏ పనిలోనైనా పట్టుబడితే ఆ పెద్దమనుషులు విడిపిస్తుంటారు. అతని అవసరం వాళ్ళకి చాలా వుంది. అందువల్ల పొట్టోడు పోలీసుల్ని చాలా తేలికభావంతో చూస్తాడు, పెద్దమనుషుల అండ తన కుందున్న ధీమాతో.

ప్రభావతి వచ్చినప్పుడు అతనప్పుడే భోజనం ముగించి చుట్ట కాలుస్తూ కూర్చున్నాడు.

ప్రభావతి అలా రావడం మొదట ఆశ్చర్యం కల్గించినా వెంటనే తేరుకొని కిచకిచ నవ్వాడు పలకరింపుగా. "రా ప్రభావతీ, చక్కగా వచ్చావు. చాలా కాలమైంది చూసి."

ప్రభావతికీ అతన్ని చూసి ఆశ్చర్యం కల్గింది. తనని

చూస్తేనే నిప్పు తొక్కిన కోతిలా ఎగిరే పొట్టోడు, ఇలా సౌమ్యంగా పలకరించడం అర్థంకాలేదు. అతనిలోని ఈ మార్పు అంతుపట్టలేదు.

ఇద్దరూ హాలు మధ్యలో కూర్చున్నారు.

పొట్టోడి వదనం ఎంతో ప్రశాంతంగా, స్వచ్ఛంగా వుంది. అతన్ని గమనిస్తోంటే ప్రభావతికి దారిలోని ఆవేశమంతా దిగిపోయింది.

"నీలో ఏదో మార్పు కన్పిస్తోంది, పొట్టోడా. కొత్తగా కన్పిస్తున్నావు" అందామె.

పొట్టోడు సంతోషంతో కిచకిచ నవ్వాడు.

గట్టిగా కళ్ళు మూసుకుందామె.

"అవును, ప్రభావతీ. నిన్నటితో నలభైఅయిదు నిండాయి. ఇహనుంచి ప్రశాంత జీవితం గడపాలనుకుంటున్నాను. ఆ బ్రతుకికవద్దు, చెల్లాయ్."

"పొట్టి వెధవా, నేను చెల్లాయ్‌నా? అలా పిలవకు!"

అతను కిచకిచా నవ్వేసి, "నిన్ను పార్టీకి పిలవలేదు ప్రభావతీ, సారీ!" అన్నాడు.

"పార్టీయా....ఏం పార్టీ?"

"నా పుట్టినరోజు పార్టీ. రాత్రి ఇచ్చాను. చాలా మంది వచ్చారు."

"అయితే నన్నెందుకు పిలుస్తావు? నేనెందుకొస్తాను, మన మధ్య వైరం వుంటే?"

"వైరం బిజినెస్‌లో. పర్సనల్‌గా నీతో స్నేహం గొప్ప వరం నాకు!"

"ఈ బిజినెస్‌లో స్నేహం లేదు పొట్టోడా, మర్చిపో!"

పొట్టోడు నవ్వాడు మళ్ళీ కిచకిచా.

"అలా నవ్వకు, నీ గొంతు పిసికేస్తాను!" అందామె రెచ్చిపోయి.

పాట్టోడు నవ్వాపేసి, "నన్ను ఆశీర్వదించు!" అన్నాడు.

ప్రభావతి అప్పుడు ఉలిక్కిపడింది ఏదో తట్టి. ఆమె కళ్ళు ఎర్రగా మెరిశాయి. చటుక్కున అతనికి దగ్గరగా జరిగింది. "నువ్వు పుట్టినరోజు పార్టీ చేసుకున్నావా?"

"అవును, ఏం? అదేదో వింత అన్నట్టుగా మాట్లాడుతున్నావు....?"

"నువ్వు చేసే పనులు వింతగా వుంటాయి! నీ దగ్గరకి పోలీసులొచ్చారా?"

అతను తలెగరేసి నిర్లక్ష్యంగా అన్నాడు, "వచ్చారులే...."

"ఎందుకు? ఏం చేశారు? ఏమన్నారు?"

"అది నీకు తెలుసు. నిజానికి వాళ్ళు మీ దగ్గరికీ వచ్చారు—నీ అప్పియరెన్స్ చెపుతోంది....నీకూ నాకూ డిఫరెన్స్ ఏమిటంటే—నాకు పెద్దమనుషుల అండ వుంది. నీకెవరూ దిక్కులేరు. నీ గోడు ఎవరికీ చెప్పుకోలేవు. వాళ్ళు నే చెప్పింది వ్రాసుకొని బుద్ధిగా వెళ్ళిపోయారంతే. కానీ, మీకు మంచి ట్రీట్ మెంట్ ఇచ్చివుంటారు అవునా? పిల్లలెలా వున్నారు?"

"ఆపు! వాళ్లు నువ్వు చెప్పింది నమ్మారా?"

"పాతికమంది సాక్షులుగా వున్నారు, నమ్మక నట్టేట్లోకి పోతారా?"

ప్రభావతి రెచ్చిపోయింది. "పాట్టోడా, నీ పార్టీ దూావ్! నన్ను ఏమార్చకు! ఆ పాతికమందికీ దూావ్ పార్టీ ఇచ్చి బదులుగా వాళ్ళచేత దొంగ ఎలిబీని

సృష్టించుకున్నావ్!"

పొట్టోడు ఆశ్చర్యంగా చూశాడు. "తప్పు ప్రభావతీ, చాలా తప్పు!"

"బుకాయించకు!" అర్చిందామె ఇంకా రెచ్చిపోతూ, "నీ యుక్తులు నాకు తెలుసు! మొన్న కాశీశ్వర్రావ్ మార్కెట్‌లో ఇసుకపల్లి సర్పంచ్ మీద సోడాబుడ్లు విసిరినప్పుడు నువ్వెక్కడ వున్నావ్? ఆ ఎదురుగా టీ బడ్డీలో నే! కానీ తెనాలిలో ఉన్నట్టు పదిమందిని సాక్ష్యం తెచ్చుకున్నావు!"

పొట్టోడు ఇంకా ఆశ్చర్యంగా చూశాడు. "ప్రభావతీ, చరిత్ర బాగా చెప్తున్నావు."

"నీ చరిత్ర నాకనవసరం, పొట్టోడా! నువ్వు జరిపిన ఘనకార్యానికి సన్మానం మేం పొందాం! దానికి పరిహారం కావాలి మాకు! నువ్వు దోచుకున్న దాంట్లో సగం ఇచ్చుకునితీరాలి నువ్వు!"

"ఓహ్, ప్రభావతీ! నీకు బలే అయిడియానే తట్టింది.. తప్పమ్మా బ్లాక్ మెయిల్ చెయ్యొద్దు. దానివల్ల ఏం లాభంలేదు. పాతిక మంది సాక్ష్యానికి వ్యతిరేకంగా నువ్వేమీ చేయలేవు. అసలు నువ్విలా దబాయించలేవు. నీ పెత్తనం ఈ ఊళ్ళో సాగదు. పరాయిదానివి, పరపతి లేనిదానివి.... మా ప్రాంతాలవచ్చిచేరి అన్నింటా మా లైనులో అడ్డుతగులుతున్నావు. నాకు ఇరవై ఏళ్ళ సీనియారిటీ వుందిక్కడ...నువ్వింకా పసిదానివి. నీ చేష్టలు చూసి ఒకసారి భీముడు నాతో ఏమన్నాడో తెలుసా? మీ కడుపుల్లో కొడవళ్ళు ఇరికిస్తే ఎలా వుంటుందని. మహా డేంజరస్ వాడు. నేనే వద్దని నచ్చచెప్పాను—"

"కోయకు, పొట్టోడా! కోయకు!"

అతను చటుక్కున ముందుకివంగి అన్నాడు "సోదరీ, నీకో నిజం చెప్పనా?"

"నువ్వు నిజాలు కూడా చెబుతావా?" అడిగిందామె వ్యంగ్యంగా.

పాట్రోడు వానర సంగీతం విన్పించాడు. "ఇది నిజం రేపు రాత్రికి నువ్వు చస్తావ్!"

ప్రభావతి రెచ్చిపోయి అర్చింది, "పాట్రోడా! అపు నీ ఆటపట్టింపు!"

"నా జ్యోతిషం నమ్ము ప్రభావతీ! రేపు రాత్రికి నువ్వు చచ్చిపోతావ్!"

"నోర్మూయ్, నడ్డి విరుగుతుంది!"

"తథ్యం సోదరీ! నువ్వూ నీ ముఠా అట్టే పైన ఉండరు!"

ఆమె అతని చొక్కా పట్టుకొని వూపేసింది. "విషయం మార్చకు. చచ్చుమాటలు చెప్పకు. నగ లెక్కడున్నాయి చెప్పు, వాటా కావాలి నాకు!"

అతనొక్క తోపుతోసి చొక్కా వదిలించుకున్నాడు. "గెటవుట్! లేకపోతే ఇప్పుడే పోలీసుల్ని పిలుస్తాను. నువ్వు నామీద ఏం ఆరోపిస్తున్నావో వాళ్ళకు చెప్పు! అప్పుడు నీకెందులో వాటా కావాలో వాళ్ళే ఇస్తారు!"

ప్రభావతి చల్లబడిపోయింది, ఒక్కసారి. అది ప్రమాదమని గ్రహించింది... ఆమెకు గుండె వేగం హెచ్చి, వెంటనే అక్కడనుంచి వెళ్ళిపోవాలనిపించింది.

"వెళ్ళిపో ప్రభావతీ, నీ యుక్తులు పారవు!"

"నీవల్ల మేం దెబ్బలుతిన్నాం!" అందామె మొండిగా.

"మిమ్మల్ని కొట్టమని నేను చెప్పలేదు...."

"సరే! నీ సంగతి తర్వాత చూస్తాను. బాగా ఆలో

చిస్తాను. దీనితో పద్ధతి కనిపెడ్తాను. నీకు దిక్కులేని నక్షత్రస్థితిని కల్పిస్తాను!"

"మంచిది, ఇక వెళ్ళిపో."

# 7

ఊళ్ళోని వీధులు తిరుగుతూ పోతూంటే కారుని చూసి జనం రకరకాలుగా అనుకోసాగారు.

"బాబుగారితో ఎవరో వున్నారు, చూశావా?"

"బాబుగారెప్పుడో పెళ్ళి చేసుకున్నారు గామోసు!"

"ఛ, మనకి తెలియకుండా చేసుకోడు!"

"అయితే ఆమె ఎవరై వుంటుంది?"

"స్నేహితురాలు కావచ్చు."

"అదీ! ఇంట్లో ఎవరూ లేరు కదూ? వంటరి పక్షి!"

"ఛ, బాబుగారు అలాంటివాడు కాదు!"

"అవును, ఆమెని దొంగచాటుగా తీసికెళ్తున్నాడా? పట్టపగలు మన కళ్ళెదుటే తీసుకుపోతున్నాడు...."

"బాబుగారు చాటుమాటు పనులు చేయ్యడు."

"బాబుగార్ని చెడ్డగా అనుకుంటే కళ్ళుపోతాయ్."

నరేన్ యెవరినీ పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా డ్రైవ్ చేస్తున్నాడు. ఆ ఊరి గురించి, అక్కడి మనుషులూ పరిసరాల గురించీ గర్వంగా చెప్పుకుపోతున్నాడు. ఆమె ఆసక్తిగా వింటున్నట్లు నటిస్తోంది. ఆలోచనలు ఎక్కడో వున్నాయి. కాంబినేషన్ని అతన్నుంచి ఎలా తెలుసుకోవాలా అని ఆలోచిస్తోంది.

యేవేవో మాట్లాడుతూన్న వాడల్లా "అయిడియా!" అన్నాడతను హఠాత్తుగా.

పద్మిని తేరుకుని, "ఏమిటి?" అంది.

"మా ఊళ్ళో అందరికీ నేనంటే మంచి ఇష్టం, గురీ.

మన విషయం వాళ్ళకి తెలిస్తే నాన్నగారిమీద గట్టి వత్తిడి తెస్తారు. మన పెళ్ళికి ఒప్పిస్తారు" నరేన్ అన్నాడు.

పద్మిని విసుగ్గా తలూపి వూరుకుంది.

కారు ఒక మేడముందాగింది.

అతను దిగి, గేటు తీసివచ్చి లోపలికి పోనిచ్చాడు. మల్లెపందిరికింద ఆపి ఇద్దరూ దిగారు. అంతా నిశ్శబ్దంగా వుంది. పరిసరాలన్నీ నిద్రపోతున్నట్లున్నాయి. ఆ వాతావరణం ఎందుకో పద్మినికి వింతగా, భయంగా తోచింది. ఆ మేడ ఊరికి బాగా చివరగా, యేకాంత ప్రదేశంలో వుంది.

అతడామె చెయ్యిపట్టుకొని వరండాలోకెళ్ళి తలుపు తాళం తీశాడు.

"నౌకర్లని ఇంటికి పంపేశాను" అన్నాడతను లోపలికి కదులూ—

ఆమె తడబడుతూ లోపల అడుగుపెట్టింది.

"ఇదీ మా ఇల్లు, ఎలా వుంది?" అన్నాడతను ఫ్యాను వేసి నవ్వుతూ.

పద్మిని చటుక్కున సోఫాలో కూర్చుని చుట్టూ చూసింది. హాలుకిరువేపులా గదులూ, గోడలకి పటాలూ, మధ్యలో ఫ్లోరోసెంట్ లైటూ. కిటికీ తెరలూ, పూల కుండీలూ....అన్నీ ముచ్చటగా, గొప్పగా కన్పించాయి.

కానీ లోలోపల ఆమెకేదో భయంగా వుంది.

"అన్నట్టు నువ్వేకాలు మోపావు ఇంట్లో?" అన్నాడతను హఠాత్తుగా.

పద్మిని బిక్కమొహం వేసింది.

"నెవర్ మైండ్! ట్రయల్ కొచ్చినపుడు అది

గుర్తుంచుకో" అన్నాడతను నవ్వుతూ.

"అటు కాదు, అది మా నాన్నగారి గది. అమ్మగారి గది పైన వుంది. నా గది కూడా పైన ఉత్తరం వైపు వుంది. కిటికీ తెరిస్తే ఊపిరి సలపని దృశ్యాలు కనిపిస్తాయి. అవతల దూరంగా చిన్న చెరువూ, అడవీ వున్నాయి. రాత్రులు ఆ కిటికీ దగ్గర కూర్చుని అడవిలోకి చూస్తూ గడిపేస్తాను....చక్కటి ఆలోచనలు వస్తాయి. నీకిష్టమైన పూలన్నీ తోటలో వున్నాయి. నీకు షవర్ బాత్ అంటే ఇష్టమున్నావుకదూ? అది కూడా వుంది. కిచెన్ లో కూడా నువ్వు మెచ్చే పరికరాలే వున్నాయి..."

అతను గ్రాంఫోన్ దగ్గరకు కదిలి, ఘంటసాల శ్లోకం వేసి, "ఇది మా నాన్నగారికెంతో ఇష్టం!" అన్నాడు.

పద్మిని కళ్ళు అప్పగించి చూస్తోంది.

అతడామెని సమీపించాడు. "పూర్ అప్పీయరెన్స్. నువ్విలా బొమ్మలా కూర్చుంటే మావాళ్ళు పోయిరామ్మా అంటారు!" నవ్వాడతను పెద్దగా, "పద, పైకెళ్దాం. ముందు మా అమ్మగారి మ్యూజియం చూశాక, కిందకొచ్చి జొన్ను తిందాం."

ఆమె లేచి అతన్ని అనుసరించింది తడబడుతోన్న అడుగులతో. ఆమెకి తన భయం యేమిటో స్పష్టంగా తెలుస్తోంది....ఆ ఇంట్లోకి అడుగు పెట్టినపుడే దేవాలయంలోకి ప్రవేశించినట్లు భావన కలిగింది. ఆ ఇంట్లో యే మూల చూసినా ఎంతో గాంభీర్యత, పవిత్రత, ప్రశాంతత, ఇంకేదో మానసికంగా లోబర్చుకొనే అతీతమైన శక్తి, గోచరిస్తున్నాయి....

అటువంటి పవిత్రమైన ఆలయంలోకి చెడు ఆలోచనలు

పెట్టుకొని రావడం తీవ్రమైన పాపంగా తోచిందామెకు. దానికి నిష్కృతి లేదు. దైవం శిక్షిస్తాడు!

జీవితంలో మొదటిసారి ఆమెకు ఇలాంటి సెంటిమెంట్స్‌తో భయం పట్టుకుంది. ఆ భయంవల్ల ప్రభావతికి గుడ్ బై కొట్టేసి ఇతనితో కాపురం పెట్టేసే ...అనే ఆలోచన కూడా వచ్చింది. కానీ అదీ ఆమెకు తృప్తినివ్వలేదు. తనకంతటి నైతిక అర్హత వుందా? అమ్మో, దేవుడు వూరుకుంటాడా!

శరీరమూ మనసూ కడిగిన ముత్యంలా స్వచ్ఛంగా, పవిత్రంగా వున్న అదృష్టవంతురాలికే స్థానం ఇక్కడ.

పైకి వెళ్ళాక అతను గదితాళంతీసి లోపలికి వెళ్ళి పిల్చాడు. పద్మినికి మరీ భయం వేసింది! అతను రోజూ వినిపించే మాటల్నిబట్టి అతని తల్లిని గొప్ప దేవతామూర్తిగా వూహించుకుంది....ఆ గదిలో అడుగు పెట్టాలంటే ఆమెకు చెప్పరాని భయం పట్టుకొంది!

"రా, పద్మిని!" అన్నాడతను చెయ్యిపట్టిలాగి.

ఆమె అయోమయంగా లోనికి అడుగు పెట్టింది.

"ఇదే మా అమ్మగారి గది, ఎలా వుంది?"

ఆమె భయపడ్తూ, ముఖంమీద చెమట తుడుచుకుంటూ చుట్టూ చూసింది.

పెద్దగా ఆర్భాటం లేకుండా నిరాడంబరంగా వుంది గది. తలుపుకెదురుగా గోడవారగా మెత్తటి పరుపుతో ఎత్తయిన మంచం వుంది. దానికి తలవైపు గోడకి దేవుడి పటాలున్నాయి.

తలుపు ప్రక్కన మూలగా ఎత్తయిన పీటమీద సేఫ్ వుంది.

"ఇదే నగల మ్యూజియం!" అన్నాడతను నవ్వుతూ.

పద్మిని ఊపిరి బిగబట్టి చూసింది. అతడామెని దాని దగ్గరకు తీసుకెళ్ళి, "తెరువనా?" అన్నాడు.

ఆమె రక్తం వురకలు వేసింది! అతను చకచకా డయల్ తిప్పి సేఫ్ తెరిచేశాడు!

పద్మిని ఆసక్తిగా గమనిస్తూనే దాన్ని చాకచక్యంగా బుర్రలో రికార్డు చేసుకుంది.

"చూశావా?" అన్నాడతను డోర్ పట్టి లాగుతూ.

పద్మిని గబుక్కున ముందుకు జరిగి లోపలకు చూసింది. ఆమె గుండె ఒక్కక్షణం ఆగి తిరిగి కొట్టుకోనారంభించింది ...గొంతు తడారిపోయి నోరు తెరిచిపెట్టేసింది. ఆమెకు రెండు కళ్ళూ చాలడంలేదు! ఏదీ కంటికానడం లేదు! తల తిరుగుతూ స్వృహ తప్పేలా వుంది పరిస్థితి!

సేఫ్ నిండా వెండి—బంగారం!

నరేన్ ఆమెని పట్టుకొని, "చూడు! ఎలా వుంది మ్యూజియం!" అన్నాడు.

"బ్రహ్మాండం, నరేన్! ఎలా వర్ణించను!"

"వర్ణనకేదీ అందదిక్కడ!"

పద్మినికి మతిపోతోంది! లోపల అరల్లో ఎన్నో రకాల గొలుసులు వ్రేలాడుతున్నాయి. నాటిలో పొదగబడిన రాళ్ళు కళ్ళను చెదరగొడుతున్నాయి. ఒక పెద్ద వడ్డాణం మంచి తేజస్సుతో మెరుస్తోంది. పట్టాగొలుసులు వెండివి-వెన్నెల చూసినంత ఆహ్లాదాన్ని కల్గిస్తోన్నాయి. గాజులు వివిధ నగిషీలలో చెక్కబడినవి—గొంతుతడి నార్పేస్తున్నాయి. ఒక్కో-ఆభరణం ఒక్కో ప్రత్యేకతను సంతరించుకొని మతి పోగొడ్తోంది! అరలనిండా అవే! అందంగా, శ్రద్ధగా పేర్చివున్నాయి! అరంగుళం కూడా ఖాళీలేదు! పదిలక్షలు! లెక్కకట్టింది పద్మిని—అంతకు

తక్కువ వుండదు!

నరేన్ మరొక చిన్న అర తెరిచి, అందులోంచి గుప్పెడు ఉంగరాల్ని తీసి ఆమె చేతుల్లో పోశాడు. ఆమె ఉద్వేగంగా ఒక్క కేక వేసింది. వాటిని కళ్ళకద్దుకుంటూ.

'నరేన్ ఆమెని ముక్కుపట్టిలాగాడు. "అంతేకాదు, ముక్కు పుడకలు కూడా వున్నాయి....నువ్వు ముక్కు పొడిపించుకోవాలి ఇక!"

ఆమె కిలకిలా నవ్వేసి అతని చుట్టూ చేతులు వేసింది. అతను సేఫ్‌లోంచి పెద్ద చంద్రహారంతీసి ఆమె కళ్ళ ముందు వూపాడు. "ఇదెలా వుంది?"

"ఓహ్, ఏం చెప్పను! ఏం చెప్పను! ఎన్ని కాసులుంటుంది?"

"విలువ కట్టకు! మెడకి కట్టుకో!" అతడామె మెడలో కట్టివదిలాడు దాన్ని.

అప్పుడామె నిగ్రహం కోల్పోయింది. ఆమె ఇంద్రియాలు వశం తప్పాయి.

తన్మయత్వంతో హారాన్ని తడిమి తడిమి చూసుకొని గుండెలకి హత్తుకుంది. ఉద్రేకం శిఖరాగ్రానికి ఉరకలు వేస్తోంటే కన్నూ మిన్నూ కానరాకుండా వెళ్ళి మంచం మీద పడింది. దాంతో విరహాగ్ని రగుల్కొని, దేహం కోర్కెల పురివిప్పడంతో ఉన్మాదిలా అరుస్తూ అస్తవ్యస్తంగా దొర్ల సాగింది....

ఇదంతా నరేన్ కొయ్యబారిపోయి చూస్తున్నాడు. హఠాత్తుగా తేరుకొని వెళ్ళి కోపంతో ఆమె చెయ్యిపట్టి లాగాడు.

"తెలివిలోకిరా! లే, నిన్నే!" అరిచాడతను రెచ్చి

పోతూ, "ఇది మా అమ్మగారిపక్క! దీనిమీద కూర్చోవాలంటే నాకే భయంగా వుంటుంది! నువ్విలా.... అసభ్యంగా.... నిర్లజ్జగా... మూడోతరహా మనిషిలా.... ఛ. అపవిత్రం చేశావు దీన్ని! లే, త్వరగా!"

ఆమె తెలివిలోకొచ్చి అదిరిపడి క్రిందకు దూకేసింది. అతను విపరీతంగా వణికిపోతూ ఆందోళనగా పక్క సరిచేశాడు.

"నిన్నొక అభిసారికలా, నా ప్రియకాంతగా ఎంతో ఉన్నతంగా ఊహించుకున్నాను. నువ్వింత హైన్యాన్ని ప్రదర్శిస్తావనుకోలేదు!" అన్నాడతను ఆవేదనగా.

ఈమాటలామెకు సూటిగా తగిలాయి. నిలువెల్లా సిగ్గుతో ఆమె తల వాలిపోయింది.... జీవితంలో మొదటిసారి ఆమెకు జుగుప్స కలిగింది, తన ప్రవర్తనకి!

## 8

"అయితే నా అంచనా తప్పుకాలేదన్నమాట!" అంది ప్రభావతి సంతోషంగా.

పద్మిని తలూపి వూరుకుంది ముభావంగా.

"పది లక్షలు! టెన్ లాక్స్!" అరిచింది ప్రభావతి, "వెరీగుడ్! అయితే రేపు రాత్రి మీరిద్దరూ సినిమాకెళ్ళండి. మేం అతనింటికి వెళ్ళి ఉన్నదంతా ఊడ్చుకొచ్చేస్తాం, ఏం?"

పద్మిని అప్పటికీ మాట్లాడలేదు. ఆమె మనసంతా ఎలాగో... ఆవేదనగా, చికాకుగా వుంది.... ఆమెలో విచిత్రమైన మార్పు వచ్చింది. కళ్ళలో ఎన్నడూ కనిపించని భావసంచలనం వుంది.... నరేన్ వాళ్ళ ఇల్లు, ఆ పరిసరాలూ వాతావరణమూ, ఆమెపై తీవ్రమైన

ప్రభావమే కలిగించాయి. అంతేగాక అక్కడ తాను ప్రవర్తించిన తీరుకి జీవితం అంటేనే అసహ్యాం ఏర్పడింది! ఒక సంస్కారవంతుడైన ప్రేమాస్పదునికి అర్ధాంగి అయ్యే నైతిక అర్హతను నోచుకోని తన దౌర్భాగ్యానికి ఎంతగానో నొచ్చుకుంది!

తాను జీవితంలో కోల్పోయిందేమిటో, తనకే అదృష్టం పట్టలేదో తలచుకుంటూ లోలోపలే కుమిలి పోతోంది....

"మాట్లాడవేమిటి బొమ్మలా? కాంబినేషన్ తెలుసు కున్నావా?"

పద్మిని తేరుకొని తలూపేసింది. ఆమెలో మార్పుని ఇప్పుడు గమనించింది ప్రభావతి.

"ఏమిటలా వున్నావ్? ఏం జరిగింది?"

పద్మిని అంది మెల్లగా. "నాకీపని ఇష్టంలేదు.... నే నే కాదు, మీరూ చేయకూడదు. మనల్ని—మనల్ని దేవుడు శిక్షిస్తాడు ఆ పని చేస్తే!"

"ఏమి టేమిటీ!" అర్చింది ప్రభావతి కళ్ళు పెద్దవిచేసి.

"నరేన్‌ని మర్చిపోవాలి! ఆ నగల్ని కూడా మర్చి పోవాలి మనం!"

"ఓయమ్మోయ్! ఓయమ్మోయ్! చూడండ్రా!" గుండెలు బాదుకుంది ప్రభావతి అనుచరులవైపు తిరిగి, "చూడండ్రా! ఇదెలా చెబుతోందో! దీని బుద్ధి ఎలా మారిపోయిందో! మనల్ని ఎలా దింకికొట్టిస్తుందో! దీన్ని - ఈ రెండీ రాణిని చూడండ్రా! పేవ్‌మెంట్లమీద అడుక్కుంటూంటే చేరదీసి సాకి దీన్ని ఇంతదాన్ని చేస్తే నాకే ఎసరుపెడుతోంది! పార్టీ ఫిరాయిస్తోంది—"

"ఆగు!" అర్చింది పద్మిని పిచ్చిగా, "ఆవేశపడకు!

శాంతంగా వింటే నీకే తెలుస్తుంది....ఆ ఇంట్లో అడుగు పెడితేచాలు మంత్రించినట్టు పరివర్తన చెందుతాం! నీచ బుద్ధుల్ని త్యజిస్తాం! అంత పవిత్రమైందన్నమాట. అక్కడ చెడుపని తలపెట్టడం అన్న ఆలోచనే మహా పాపం! ఆ తలంపుతో అక్కడికెళ్తే తర్వాత మళ్ళీ మళ్ళీ చస్తాం! అది దేవాలయం, దేవుని ఇల్లు. దేవుడికి మనం ఎప్పుడూ దూరంగా నేవుంటూ వచ్చాం...."

"నోర్మూయ్! ఎక్కడ నేర్చావ్? నీ మాటలకి కరిగిపోయి వదులుకుంటామనుకునే? నువ్వెప్పుడా సొమ్ములు సొంతం చేసుకుని ఆ రాకుమారుడితో కులుకుదామనుకునే? చూడు పిచ్చిదానా, నీకేం జబ్బుచేసిందో నాకు తెలుసు. నీకంతగా అతనిపై ప్రేమపుట్టివుంటే నిజంగానే పెళ్ళాడి వూరేగు! నో అబ్జెక్షన్! కానీ ముందు మా కోసం ఆ కాంబినేషన్ కక్కి ఏడువ్!"

"ఆ పని చేయకూడదు—నా మాట విను!"

"కాంబినేషన్!"

"నా మాట విను! మనం క్షేమంగా...."

"కాంబినేషన్!" అంది ప్రభావతి కఠినంగా.

"నే చెప్పను!"

"కోపం తెప్పించకు, కాంబినేషన్!" ప్రభావతి రెచ్చిపోయింది.

"నాకు తెలీదు! నేను తెలుసుకోలేదు!"

ఆమె చెంప ఫెళ్ళున పగిలింది. "చెప్పవూ?"

"చెప్పను! చెప్పను! చెప్పను! నన్ను చంపుకో!"

ఆమె జడపట్టిలాగి, ఈడ్చి చెంపమీద కొట్టింది ప్రభావతి. "చెప్పవూ?"

"నన్ను చంపుకో! చచ్చినా చెప్పను!"

ప్రభావతి అనుచరులవైపు తిరిగి అరిచింది. "నిమ్మకాయ పట్రా, శేఖర్! కత్తికూడా!"

శేఖర్ భయపడ్డాడు, "ఎందు కాంటీ?"

"పట్రా, పిరికి సన్నాసీ!"

అతను పరుగెత్తుకొని వెళ్ళి మరు నిముషంలో తిరిగి వచ్చాడు, నిమ్మకాయా, కత్తి పట్టుకొని. ఆమె వాటిని తీసుకొని గదమాయించింది బయటికెళ్ళమని. వాళ్ళిద్దరు భయపడ్తూ వెలుపలకొచ్చేశారు. ఆమె దఢాలున తలుపు లాగేసుకొని గొళ్ళెం పెట్టుకుంది—

అప్పుడు ప్రారంభమైంది లోపల రభస! ప్రభావతి బెదిరింపులూ. పద్మిని అరుపులూ విపరీతంగా వస్తున్నాయి. శరీరాలు దొర్లుతున్నాయి....మూల్గులూ, నిట్టూర్పులూ వెలువడుతున్నాయి. అనుచరులిద్దరూ భయపడి బయటకురికి వీథిలోకి చూశారు. జనం ఇటుకేసి చూస్తున్నారు.... ఏవో అనుకుంటున్నారు. శేఖర్ లోపల పరుగెత్తికెళ్ళి తలుపుమీద బాదాడు.

"ఆంటీ, ఆ పేయ్! జనం ఇటే చూస్తున్నారు!"

లోపల సద్దుమణిగింది అప్పటికి. శేఖర్ అదురుతున్న గుండెలతో కాచుకున్నాడు. అప్పుడు చటుక్కున తలుపు తెరిచి వచ్చింది ప్రభావతి. ఆమె ముఖం వికృతంగా మెరుస్తోంది...."ఎలా చెప్పదు? దాని టెక్కు నాకు తెలుసు!" అనుకుంటూ వెళ్ళిపోయిందామె.

అనుచరులిద్దరూ గదిలోకి జొరబడ్డారు. పద్మిని నేలమీద పడివుంది. చెదిరిన దుస్తులతో మొఖం చేతుల్లో దాచుకొని ఏడుస్తోంది. వాళ్ళిద్దరు ఆమె ప్రక్కన కూలబడి చేతులు అడ్డంతీసేశారు. అప్పుడామె పరిస్థితి చూసినవాళ్ళ రక్తం మరిగింది.

"నిమ్మరసం పిండింది, రాక్షసి!" పళ్ళు నూరాడు నాగేష్.

"నీళ్ళు పట్రా, కళ్లు కడుగుదాం!" అరిచాడు శేఖర్.

పద్మిని ఏడుపు నాపుకునేందుకు ప్రయత్నిస్తోంది....

## 9

మర్నాడు. రాత్రి తొమ్మిదిగంటలకల్లా పొట్టోడు చెక్కలి గ్రామం చేరుకొన్నాడు.

అతని సంతోషం ఇంతా అంతా కాదు. ఏర్పాటు చేసుకున్న లారీ దిగి, ఊళ్ళో వీధులగుండా గాక, చుట్టూ తిరిగి ఉత్తరం దిక్కునుంచి నరేన్ వాళ్ళ ఇంటికి చేరుకునే వరకూ అతడు కూనిరాగంతీస్తూ హుషారుగా నడిచాడు... చంద్రుడా, ఆకాశం నీ హద్దురా! నరుడా, అవకాశం వదలొద్దురా! ...అనుకుంటూ.

ప్రహరీ గోడమీకి లోపలికెళ్ళినప్పుడు సమయం సరిగ్గా తొమ్మిదీపన్నెండయింది.

ఆవరణంతా చిమ్మచీకటి! మేడ కూడా నిర్మానుష్యంగా, చీకటిగావుంది. ముఖద్వారం దగ్గర ఆగి అతను తాళాన్ని పరిశీలించాడు. నమ్మకమైన తాళం. దృఢమైనది. దీనిపై అత్యాచారము తగునా? దానితో పోరాటంచేయ దల్చుకోలేదు. ఈలవేసుకొంటూ చుట్టు ముట్టించుకొని, ఇనుమడించిన ఉత్సాహంతో ఇంటివెనుక నడిచాడు. లూటీకొరకు కోటిమార్గాలున్నాయ్!

వరండాలో ఎక్కి కిటికీల్నీ, తలుపుల్నీ పరీక్షించాడు. కిటికీలన్నీ మూసివున్నాయి. కానీ తలుపొకటి నెడితే చప్పుడు గాకుండా తెరుచుకుంది! ఆహాఁ. ఇది నా కోసమే తీసివుంచినట్లున్నది....ఏమి సౌఖ్యము! ఏమి రాజసము!

అతను ఠీవిగా లోపలకు నడిచాడు. లైటు వేసి చీకటిని తరిమేశాడు. కిచకిచ నవ్వుకుంటూ కిచన్‌లోకి దారితీశాడు. టేబిల్ మీద అతని కోసమే అన్నట్లు సిద్ధంగా వుంచిన గిన్నెల్లోని జున్నంతా తినేశాడు. ఒక చెంబెడు నీళ్లు తాగి తృప్తిగా త్రేన్చాడు. ఆహాఁ, నా జన్మ ధన్యము సుమతీ! అక్కడనుంచి సెలవుతీసుకున్నాడు.

అప్పుడతను బయటకొచ్చి ఉలికిపడి మేడమీదకి వురికాడు. క్విక్! త్వరపడాలి, చంద్రుడూ! వాళ్లొచ్చేస్తారు! జేబులోంచి తాళంచెవి తీసి, ఆ తలుపు తాళం తెర్చేసి లోపల కెళ్ళిపోయాడు. లైటువేసి, ఆ వెలుగులో చుట్టూ చూసి, ఓ మూల టేబిల్ మీదనున్న బ్రీఫ్ కేసు అందుకున్నాడు. దాంతో సేఫ్ దగ్గరకొచ్చి నవ్వుకున్నాడు. పిచ్చి ప్రభావతి! నువ్వీరాత్రి చస్తావని చెప్పాను, అవునా? ఇంకాస్సేపట్లో నీ గుండెకు బ్రేకుపడి బాల్చి తన్నేస్తావు చూడు!

కసిగా నవ్వుకుంటూ జేబులోంచి చీటీతీసి కాంబినేషన్ చూసుకున్నాడు. క్షణాల్లో డయల్ తిప్పి సేఫ్ తెరిచేశాడు. లోపల రాశుల్ని చూసి సంతోషంపట్టలేక ఒక్క గంతువేశాడు. నీదేనోయ్, అంతా నీదే! దోచుకో! దాచుకో! లేచిపో వీరుడా విజయశంఖమ్ము నూది!

గబగబా క్షణాల్లో సేఫ్‌లోని సంపదంతా లాగి బ్రీఫ్ కేసులో పడేసుకున్నాడు. సేఫ్ మూసేసి వెనక్కి తిరుగుతూండగా కైట హారన్ వినిపించింది.

అదిరిపడి లైటార్పేసి బయటపడి తలుపులు లాగేశాడు. బయట ఇంకేదో అలికిడైంది. అతను గుమ్మడికాయలా మెట్లమీంచి దొర్లి వెళ్ళి కింద డ్రాయింగ్ రూంలోకి

దూరాడు. చటుక్కున తలుపులు లాగేసుకున్నాడు.
శభాష్ చంద్రుడూ, నువ్విక్కడ దాక్కో!

ప్రభావతి, ఆమె అనుచరులు మెరుపులా కారుదిగి గేటు తాళం పగులకొట్టి లోపలికొచ్చేశారు. అలాగే ముఖద్వారం తాళం కూడా తీసేసి లోపల హాల్లోకొచ్చేశారు నిముషాల్లో.

పాట్లోడు నిశ్శబ్దంగా కాచుకున్నాడు. అడుగులు హాల్లోంచి దూరమవుతున్నాయి.

వాళ్ళంతా వేగంగా మెట్లవైపు కదిలి పైకె ఎక్కుతున్నారు. పాట్లోడు కొద్దిగా తలుపుతీసి చూశాడు. వాళ్ళు చకచకా వెళ్ళిపోయారు. అవుట్ చంద్రుడూ, నువ్విక వెళ్ళి వాళ్ళ ఎమోషన్స్ చూడమ్మా!

అతను అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళి మెట్లెక్కి పిల్లిలా పైకిచేరుకున్నాడు. అప్పటికి వాళ్ళంతా గదిలో వున్నారు. లైటు వెలుగుతోంది. సేఫ్ చుట్టూ మూగి తగ్గు స్వరంలో మాట్లాడుకుంటున్నారు. అప్పుడు ప్రభావతి డయిల్ తిప్పసాగింది.

పాట్లోడు ఉత్సాహంగా పరిశీలిస్తున్నాడు సన్నివేశాన్ని.

ఆమె డయల్ తిప్పి, డోర్ లాగీలాగడంతోనే లోపల ఊపిరి బిగబట్టి చూసి, గిరుక్కున అనుచరుల వేపు తిరిగింది, పాలిపోయిన ముఖంతో.

అనుచరులు కూడా లోపలకు చూసి కళ్ళు తేలవేశారు. కెవ్వున అర్చారు.

"ఇందులో ఏమీ లేదు. ఆంటీ!"

"ఆంటీ, పద్మిని మోసం చేసింది!"

ప్రభావతి కళ్ళు నిప్పుకణాల్లా వున్నాయి. ఆమె

పళ్ళునూరి, కసితో సేఫ్‌ని ధడాలున మూసి, రెచ్చిపోయి ముక్కాలి పీటసులాగి ఒక్క తన్ను తన్నింది. ఆమె ఆవేశం పెచ్రేగిపోయి భయంకరంగా ఒక్క కేక వేసింది.

"నరకంద్రడా! దాన్ని పట్టుకొని ముక్కలుగా నర కండి!"

బయటనుంచి కిచకిచమంటూ నవ్వు వినిపించింది.

ఆ ముగ్గురూ అదిరిపడి చూసి, చేష్టలుడిగి నిలబడి పోయారు. వారి నోళ్ళు పెద్దగా తెరచుకున్నాయిగానీ, మాటరాలేదు. పొట్టోడు మరో నవ్వు విసిరి ఠీవిగా లోపలకొచ్చాడు. ప్రభావతి అప్పుడు వెంటనే తేరుకొని భయాన్ని అదుపు చేసుకొని, నడుములోంచి తక్కున రివాల్వర్ తీసి గురిపెట్టింది. క్షణంలో ఆమె ఏం జరిగి వుంటుందో గ్రహించింది.

"నువ్విక్కడా దాపురించావా, మరుగుజ్జు వెధవా!" అర్చిందామె గట్టిగా.

పొట్టోడు వీనుల విందుగా వానర సంగీతం వినిపించాడు.

"పొట్టివానికి పుట్టెడు బుద్ధులు సోదరీ!"

"కదలక!"

"కదలను, అటెన్షన్!" పొట్టోడు చేతులులేపాడు.

"వెధవా, మొన్న షాపులో దోచుకుని మమ్మల్ని కొట్టించిందిగాక, ఇక్కడా దాపురించావా?"

"బిజినెస్‌లో కాంపిటీషన్ అని ఒకటి ఏడ్చింది. దాన్ని సద్వినియోగం చేసుకోవాలి."

ఆమె దగ్గరకి వచ్చి అతని తలకి రివాల్వర్ ఆన్చింది. "చచ్చుమాటలు చెప్పకు, చంపుతాను. మా సొమ్మెక్కడ

దాచావు. చెప్పు!"

పొట్టోడు నిర్లక్ష్యంగా నవ్వేసాగాడు.

"చెప్పు పొట్టోడా, లేకపోతే నీ బుర్రలోకి బుల్లెట్ని పంపిస్తాను—" అందామె నిగ్రహం కోల్పోతూ.

పొట్టోడు నవ్వాపేసి భయంగా చూశాడు. "వద్దు, ఆ గొట్టం తీసేయ్! డేంజరస్! ఈ అంగుష్టమాత్రుడి మాట ఆలకించు! నా బుర్ర పగిలితే ఫటేలున చప్పుడవుతుంది. పట్టుబడతావు. నువ్వు జైలుకి, నేను పైకి పోతాం. ఎవరికి ప్రయోజనం? అలా వద్దు, బ్రతికుంటే బలుసాకు తినొచ్చు — నా కష్టఫలం నీకిచ్చేస్తాను. నాతోరా!"

"ఎక్కడికి?"

"కింద గదిలోకి.... అక్కడ సోఫా కూడావుంది, కూర్చోవచ్చు."

అనుచరులిద్దరు ప్ర భా వ తి ని హెచ్చరిస్తున్నట్లు చూశారు.

ఆమె పొట్టోడిని అనుమానంగా చూసింది. "నువ్వెంత తేలిగ్గా లొంగిపోవు. నువ్వసలు లొంగవు! అక్కడేమైనా వేషాలు వేస్తే బుర్ర పేలిపోతుంది జాగ్రత్త!"

"వేషాలెయ్యను, నాకు బుర్రతో చాలా పని వుంది. పద!"

"అసలు నీకు కాంబినేషన్ ఎలా తెలిసింది?"

"వద్దు, అది చెబితే నువ్వు తారెత్తిపోతావ్. గుండెలు బేజారెత్తి లాగి తన్నేసావ్ బాల్చీని!"

"చెప్పు పొట్టోడా! నాది కాంక్రీటు గుండె!"

"పద్మిని చెప్పింది...." అన్నాడతను మెల్లిగా.

వాళ్ళు ముగ్గురూ అదిరిపడ్డారు, "యేమిటీ....పద్మిని

చెప్పిందా!" అర్చిందామె.

పాట్టోడు తలూపాడు.

"దాన్ని—దాన్ని—"

"సువ్వేం చేయలేవు. ఈపాటికి ఎంతో దూరం వెళ్ళి పోయివుంటుంది."

"ఎక్కడికి? ఇంకేం చెప్పింది? నిన్నెక్కడ కలుసు కుంది?"

"నాకు కలలో కనిపించి చెప్పింది."

ఆమె రెచ్చిపోయి పిడికిలితో బిగించి అతని మెడ మీద కొట్టింది.

పాట్టోడు గిరుక్కున తిరిగి, ఆమె ముక్కుపట్టుకొని గట్టిగా పిండివదిలాడు.

"చిట్టి అమ్మలూ, కాస్త చోరమర్యాద పాటించు!"

ప్రభావతి నోర్మూసుకొని నడిచింది. అనుచరులు వెనుక వచ్చారు.

కిందకొచ్చి అంతా డ్రాయింగ్ రూంలో కళ్ళారు. చీకటిగా వుంది. ప్రభావతి పాట్టోడ్ని జాగ్రత్తగా అదుపుచేస్తూ శేఖర్ తో అంది, "స్విచ్ నొక్కు!"

శేఖర్, నాగేష్ లు గదిలో కదిలారు.

సరిగ్గా అప్పుడే పాట్టోడు ప్రాణాలకు తెగించి మెరుపులా విరుచుకు పడ్డాడు ప్రభావతిమీద. ఆమె రివాల్వర్ లాక్కుని మెడమీద లాగికొట్టాడు.

"స్విచ్చికాదు నొక్కాల్సింది అమ్మలూ, నీ మెడ నరాల్ని!" అంటూ అతను బయటకు ఉడాయించి తలుపులులాగి గడియపెట్టేశాడు.

శేఖర్, నాగేష్ లు పరుగెత్తుకొచ్చి తలుపుకి కొట్టు కున్నారు. గదిలో చటుక్కున లైటు వెలిగింది. ఆదే

క్షణంలో ప్రభావతి బాధగా మెడరుద్దుకొంటూ ఎదురుగా చూసి అదిరిపడింది —

# 10

పొట్టోడు కిటికీ అవతలకి వచ్చి నిల్చుని కిచకిచ నవ్వి చేతులూపాడు సంతోషంగా. "బాబయ్యా, ఇహ మీ పని కానిచ్చుకోండి!"

అతన్ని కృతజ్ఞతగా చూసి తలూపాడు నరేన్ కుమార్.

అతను సోఫాలో కాళ్ళు జాపుకొని, వొళ్ళో బ్రీఫ్ కేసుతో, చేతిలో రివాల్వర్ తో సిద్ధంగా కూర్చుని వున్నాడు.

అతని పెదిమల మధ్య సిగరెట్ వెలుగుతోంది ఎర్రగా.

ఆ సమయంలో అతన్నక్కడ చూసి ప్రభావతికి, ఆమె అనుచరులకీ ప్రాణాలెగిరిపోయాయ్!

వెన్నులోంచి చలిపుట్టుకొచ్చి శరీరాలు కంపించి పోతున్నాయి.

నోళ్ళు తెరిచిపెట్టేసి అలాగే చూడసాగారు.

చివరికెలాగో ప్రభావతి అదుపులోకొచ్చింది. ఆయుధంలేని ఆమె చేతులు దేనికీ సాహసించలేక పోయాయి. ఆమె నరేన్ నీ, పొట్టోణ్ణీ మార్చి మార్చి చూసింది.

నరేన్ సిగరెట్ పారేసి నవ్వాడు. "ప్రభావతీ, నా నాటకం బాగా రక్తి కట్టింది కదూ? చాలా బాగా సక్సెసయింది."

పొట్టోడు వెంటనే చప్పట్లు కొట్టాడు.

"ఏమిటీ నాన్సెన్స్! దేనికీ నాటకం?"

"దేనికా?" అన్నాడు నరేన్. అకస్మాత్తుగా అతని

ముఖం ఎర్రబడింది కోపంతో. రివాల్వర్ చెయ్యెత్తి టేబిల్ మీద చూపించాడు, "అటు చూడు! .... ఆ ఆ ఫోటోని! గుర్తుపట్టావా?"

ప్రభావతి చూసింది తలతిప్పి. వెంటనే అడ్డంగా తలూపింది.

అనుచరులు కూడా ఆ ఫోటోని చూసి అడ్డంగా తలూపారు.

"మర్చిపోయారా?" అన్నాడు నరేన్ పళ్ళు బిగించి. "అంత త్వరగా మర్చిపోయారా? అవును, మీకెన్నని గుర్తుంటాయి? గుర్తుంచుకునే వీలెక్కడిది? ఎప్పటికప్పుడు మర్చిపోతుండాలి, కదూ?"

అతను హఠాత్తుగా పెద్ద గొంతుకతో అన్నాడు— "మీకు జ్యోతి గుర్తులేదా?....జ్యోతి! పద్దెనిమిదేళ్ళ అమ్మాయి? పైకి ఎంత చలాకిగా కన్పించినా శుద్ధ అమాయకురాలు ....? ఆమె కారణంగానే మీరు బెంగుళూరు విడిచి పారిపోయి వచ్చారు....ఏడు నెలల క్రితం....ఏమిటి? ఆమెని కిడ్నాప్ చేసి అది బెడిసి కొట్టడంతో ఆమెమీద అత్యాచారం జరిపి చంపేశారు. ఇప్పుడు గుర్తొచ్చిందా?"

"అయితే—?" అంది ప్రభావతి భయంగా.

"ఆ జ్యోతి అన్నయ్యనే నేను" అన్నాడు నరేన్ మరో సిగరెట్ వెలిగిస్తూ.

"ఏమిటీ! నువ్వామె అన్నయ్యవా?" అరిచింది ప్రభావతి విస్మయంతో.

"అవును. నువ్వు నన్ను చూడలేదు!" అన్నాడు నరేన్ ప్రశాంతంగా, "జ్యోతిని కిడ్నాప్ చేశాక నీ అనుచరులు నా వివరాలు తెలుసుకున్నారు. నా ఆఫీసు

దగ్గరా, ఇంటి దగ్గరా ఈ ఇద్దర్నీ చూశాను—కానీ వాళ్ళే కిడ్నాపర్స్ అనుకోలేదప్పుడు. తర్వాత పోలీసుల దగ్గర ఫోటోలు చూశాక తెలిసింది—అప్పటికే మీరంతా పారిపోయారు. గుర్తుందా ఇప్పుడు?"

లేకేం? చాలా బాగా గుర్తుంది ప్రభావతికి!

ఆ రోజు చిల్లర మొత్తాలతో బేజారెత్తి, కిడ్నాప్‌తో పెద్ద మొత్తాన్ని రాబట్టుకోవాలనుకొన్నప్పుడు, పద్మిని కార్లో బయల్దేరి కాలేజీ దగ్గర కాస్త ఆధునికంగా, ఆడంబరంగా, ధనిక కుటుంబానికి చెందినట్లు కన్పించిన అమ్మాయిని కారెక్కించుకొని తెచ్చింది—లిఫ్ట్ ఇచ్చే నెపంతో.

కానీ, ఆ తర్వాత ఆమెకంటూ ఒక్క అన్నయ్యే ఉన్నాడనీ, అతనొక కంపెనీలో మామూలు ఉద్యోగనీ, అతని దగ్గర యేమీ లేదని తెలిసినప్పుడు—ప్రభావతికి పిచ్చెత్తి, అనుచరుల్ని తిట్టి, తక్షణం జ్యోతిని ఇంటి దగ్గర వదిలేసి రమ్మని ఆజ్ఞాపించింది.

అక్కడే జరిగింది పొరపాటు!

అనుచరులిద్దరు ఆమెని ఇంటికి తీసుకెళ్ళలేదు. మారుమూల ప్రాంతాలకి తీసుకెళ్ళి తెల్లారి తిరిగివచ్చారు.

ఆ ఉదయం దారుణమైన స్థితిలో శవం దొరికి, జరిగిన దర్యాప్తులో జ్యోతి మాయమైన రోజున ఎక్కిన కారుని ట్రేస్ చేయగలారు పోలీసులు.

కానీ అప్పటివరకూ ప్రభావతి సిటీలోలేదు. తెల్లారి ఎర్రబడ్డ కళ్ళతో తిరిగివచ్చిన అనుచరుల్ని చూసి, వాళ్ళు చెప్పకపోయినా యేం జరిగివుంటుందో వూహించింది. ఆ మరుక్షణమే అనుచరులు ముగ్గురితో బెంగుళూరు విడిచి మద్రాసు పారిపోయారు.

అక్కడ కొన్నాళ్ళు గడిపి, ఎవరి దృష్టి పడని ఈ విజయవాడ చేరుకుంది.

సాధారణంగా పారిపోయిన నేరస్థులకోసం పోలీసులు పెద్ద నగరాలనే గాలిస్తుంటారు. ఈ ఆర్నెల్లూ ఇక్కడ క్షేమంగా గడిచాక ఇక ప్రమాదకాలం తప్పిందనే నమ్మింది ప్రభావతి.

కానీ ఇప్పుడు—ఈ క్షణంలో—ఇలా అనూహ్యంగా విడ్డూరంగా—సాక్షాత్తూ ఆమె అన్నయ్యే కళ్ళెదుట ప్రత్యక్షంగావటంతో మతిపోయినట్లయింది ప్రభావతికి!

"కానీ—నువిక్కడెలా వున్నావ్! నువ్వు జమిందారు బిడ్డకాదే?" అర్చిందామె భయాన్ని అణచుకొంటూ.

అనుచరులిద్దరూ ఆమె అరుపుకి తేరుకొని, అప్పుడు గుర్తించారు నరేన్‌ని!

నరేన్ పగలబడి నవ్వాడు, "నేను జమిందారు బిడ్డని కాను! ఈ ఇల్లు జమిందారుది కాదు! అంతా బూటకం! ఈ ఇల్లు మిమ్మల్ని ఆకర్షించడానికి ఎన్నుకొన్న పంజరం! నా జమిందారీ వంశం కథ—మిమ్మల్ని పట్టివుంచడానికి విసిరిన వల! ఈ నాటకమంతా — మిమ్మల్ని అంత మొందించటానికి రూపొందించుకొన్న పన్నాగం!"

"యేమిటి నీ పన్నాగం—"

"ఇంకేం వుంటుంది, పాపిష్టిదానా! నా చెల్లెల్ని చంపి మీరు కులాసాగా ఉండగలమనుకున్నారా? నా చెల్లెల్ని చంపి! నా చెల్లెల్ని" అరుస్తున్నాడు నరేన్ ఉద్రేకంతో, "అలాంటి చెల్లెల్ని నానుంచి దూరంచేసిన మిమ్మల్ని ఇంకేం చేస్తాను, రాక్షసీ!"

"చంపుతావా!" అంది ప్రభావతి బెదరకుండా.

"చంపి నా పగ తీర్చుకుంటాను! జ్యోతిని మంటల

కాహుతి చేసినప్పుడే నేను ప్రతిజ్ఞ బూనాను-ఎప్పటికైనా మిమ్మల్ని పట్టుకుని అంతమొందిస్తానని. ఉద్యోగం వదిలేశాను. ఇల్లమ్మేశాను. వచ్చిన డబ్బును బ్యాంకులో వేసి మీ వేటలో బయల్దేరాను. పోలీసులు మిమ్మల్ని పట్టుకుంటారని నాకు నమ్మకం పోయింది.... సామాన్యుడ్ని వారికేం ఆసక్తి వుంటుంది? కానీ నేను స్వయంగా పట్టుకోగలనన్న నమ్మకం యేర్పడింది.

“పోలీస్ రికార్డులోని మీ ఒక్కొక్కరి ఫోటోని నా మనసులో ముద్రించుకున్నాను. మీ రూపాలు నా కళ్ళముందు మెదుల్తుంటే ఈ ఆర్నెల్లూ ఎక్కడెక్కడో తిరిగాను. కూపీలు తీశాను. మద్రాసులో ఒక డిటెక్టివ్ నాకెంతో సహాయపడ్డాడు. పోలీసులు ట్రేస్ చేసిన మీ కారు నెంబర్ సహాయంతో మద్రాసులో మీరెక్కడ బసచేసిందీ తెలుసుకున్నాను. కానీ అది ఆర్నెల్ల క్రిందట విషయం. మీరప్పుడు మైలాపూర్‌లోని ఒక హోటల్‌లో ఇరవై రోజులు గడిపారు. అక్కడనుంచి వెళ్ళేముందు మీరు విజయవాడ గురించి మాట్లాడుకోగా బట్లర్ విన్నాడు. ఆ ఇన్ఫర్మేషన్‌తో మీరింకా ఇక్కడే వుంటారన్న నమ్మకంతో బయల్దేరి వచ్చేశాను.”

వాళ్ళు ముగ్గురు విస్తుపోయి చూస్తున్నారు.

నరేన్ అన్నాడు. “విజయవాడకొచ్చి ఘరానా నేరస్థుడని ఆశ్రయించాను-ఆ పొట్టోణ్ని. అతను నాకెంతో సహాయపడ్డాడు.”

పొట్టోడు కిసకిస నవ్వాడు ఆనందంగా.

“మీ కారు వివరాలు, మీ ఆనవాలూ అతనికి చెప్పి సులభంగా మీ ఆచూకి తెలుసుకున్నాను. మీరంటే పొట్టోడికి వళ్ళుమంట! ఆరోజు-నెల క్రితం పటమటలోని

ఒక ఇంటిలో మిమ్మల్ని చూసినప్పుడు నా మనస్థితి ఎలా వుందో వర్ణించలేను! ఆలస్యమైనా నా ప్రయత్నం ఫలించింది!"

"అయితే మమ్మల్ని అప్పుడే కాల్చిచంపక ఎందుకు తాత్సారం చేశావ్?"

"ఎందుకా...? మిమ్మల్ని అలా చంపి తర్వాత హంతకుడిగా పట్టుబడితే జ్యోతి శాంతిస్తుందా? అప్పు డపుడు కలలో కన్పించి చెప్పేది—ఆ కిరాతకుల్ని చంపు! కానీ హంతకుడిగా పట్టుబడకు! అని.

"అందుకే మిమ్మల్ని చంపి క్షేమంగా బైటపడే ఉద్దేశంతో ఈ తాత్సారం చేశాను. ఈ నాటకం నడిపాను. పటిష్టమైన పథకం వేసుకొని బెంగుళూరికి తిరిగివెళ్ళి డబ్బు తెచ్చుకున్నాను. నా జమిందారీ కధకి తగినట్లు ఈ ఇల్లు ఎన్నుకున్నాను. ఈ ఇల్లు మూడ్నెల్లుగా ఖాళీగా వుంటోంది. వాళ్ళ కుమారుడికి భోపాల్ లో పెద్ద ఉద్యోగం రావడంతో వాళ్ళు అక్కడేపోయి వుంటున్నారు. ఈ ఇంటిని అద్దెకి ఇమ్మని ఊళ్ళోని ఒక పెద్దమనిషికి చెప్పి వుంచారు-నా జమిందారీ కధ కేవలం మీవరకే. కానీ ఈ ఊళ్ళో వారి దృష్టిలో నేను ప్రకృతి ఆరాధకుణ్ని. కొన్నాళ్ళు ఈ పరిసరాల్లో గడిపి ముచ్చటైన ఫోటోలు తీయటానికి వచ్చాను. వాళ్ళు సులభంగానే అంగీకరించి ఈ ఇల్లిచ్చారు.

నాకు డబ్బుతో కావల్సిన సామగ్రి చేరవేశాను ఇక్కడ. బెంగుళూరులోనే సెకండ్ హాండ్ కారును కొని తెచ్చుకున్నాను. అంతా సిద్ధంచేసి అప్పుడు రంగ ప్రవేశం చేశాను. ఆ రోజు పద్మనిని వెంటాడి నేనే పరిచయం చేసుకున్నాను. నన్ను మీ రెవరూ గుర్తుపట్ట

లేరని నాకు తెలుసు. ఈ ఏడు నెలల్లో నా రూపు రేఖలు చాలా మారిపోయాయి. జ్యోతి గురించి విచారంతో ఆరోగ్యం చెడింది. మీ వేటలో విపరీతంగా అలసిపోయాను....కళ్ళు లోతుకుపోయాయి. చెంపలు పీక్కుపోయాయి. నల్లబడ్డాను. బాగా చిక్కిపోయాను."

"యెంత మోసం జరిగింది!"

నరేన్ నవ్వాడు హేళనగా. "అంతా నేను అనుకున్నట్టుగానే జరిగింది! రోజూ పద్మినిని కలుసుకుంటూ పరిచయం పెంచుకున్నాను. ఆకర్షించాను. ప్రేమలోకి దింపి నా జమిందారీ వంశం కథ పదే పదే నూరిపోశాను. మా అమ్మగారి నగల గురించి గొప్పలు చెప్తున్నాను! అక్కడే వుంది ఈ పథకానికి పునాది. అది పడితే ఆపైన అంతా సులువే! అలాగే మిమ్మల్ని 'మా అమ్మగారి నగలు' ఆకర్షించాయి. పద్మిని ప్రేమ నటిస్తోందనీ, ఆ నగలకోసం ఎత్తులు వేస్తోందనీ నాకు తెలీదనుకున్నారు. కానీ నేనూ నటిస్తున్నానని మీరెవరూ తెలుసుకోలేకపోయారు!

"మీరా నగలకోసం తహతహ లాడుతున్నారని నిశ్చయమయ్యాక నేనెదురు చూస్తున్న కార్యం కాస్తా జరిపేయాలనుకున్నాను. ఆ రోజు నా తలిదండ్రులు తిరుపతికి వెళుతున్నారని బుకాయించాను. మర్నాడు ఆమెని మా యింటికి తీసుకెళ్ళి నగలు చూపిస్తానని పూరించాను. ఆ మర్నాడు రాత్రి సినిమాకెళ్దామని ఒప్పించాను. అంతే—దాంతో మీ రొట్టె విరిగి నేతిలో పడినట్లనిపించి, నిన్న పద్మిని కాంబినేషన్ తెలుసుకుని వెళ్ళిడమూ — ఈ రాత్రి మీరిలా దండయాత్రకి

రావడమూ అంతా నా స్క్రీన్ ప్లేలో భాగానే జరిగింది!"

"అయితే.... ఆ నగలు.... అవి నీ కెక్కడివి!"

నరేన్ ఫకాలున నవ్వాడు. "చచ్చు ప్రశ్న! ఇంకా తట్టలేదా?"

"అంటే డోమర్ షాపులోంచి...."

"కరెక్టు. చెప్పానుగా పొట్టోడు నాకు సహాయపడుతున్నాడని? మొన్న రాత్రి ఈ నగలు దోచుకుని తెచ్చాడు-పద్మినికి చూపించి సన్నివేశానికి బలం చేకూర్చడానికి!

"ప్రభావతీ, నువ్వింక బయటపడలేవు! మీ శవాలే బయటికిపోతాయి. ఈ దోపిడీ కేవలం మిమ్మల్ని ఆకర్షించటానికే కాదు, మిమ్మల్ని చంపి నేను బైటపడేందుక్కూడా! ఈ రాత్రి మిమ్మల్ని వరసబెట్టి చంపెయ్యాలని నిర్ణయించాను. పొట్టోణ్ని ఇక్కడకు రప్పించాను. నేను పద్మిని కోసం విజయవాడ కెళ్తూ అతనికోసం వెనుక తలుపు తీసివుంచాను. లోపలకొచ్చి సేఫ్‌లో నగలు తొలగించమని చెప్పి, కొన్ని సూచనలిచ్చి, ఈ గదిలోకి మిమ్మల్ని రప్పించమన్నాను. ఈలోపు-మీరొచ్చేలోపు అక్కడ విజయవాడలో పద్మినిని షూట్ చేసి, కృష్ణలో పారేసి వచ్చి ఇక్కడ వుంటానన్నాను.

"అలాగే వచ్చాను—పద్మినిని కూడా తీసుకొచ్చాను. ఆమె ఇంటి వెనుక నా కార్లోవుంది. ఆమె మీద నాకిప్పుడు జాలిగా వుంది. ఆమెలో పశ్చాత్తాపం కలిగింది. ఆమె పరివర్తన చెందింది. వస్తూనే నన్ను పట్టుకొని ఏడ్చింది. నన్ను మోసం చేస్తున్నానని, తన నడత మంచిదికాదనీ, నన్ను పెళ్ళాడే అర్హత తనకులేదనీ

వాపోయింది. అప్పుడు తాను పనిచేసే ముఠా గురించి చెప్పింది. మీకీరాత్రి మా ఇంట్లో నగలు దోచుకుం టున్నారనీ-తక్షణం పోలీసులతో వెళ్ళి దక్కించుకోమనీ ప్రార్థేయపడింది. తన్నిక మర్చిపొమ్మనీ, క్షమించి మరొక మంచి అమ్మాయిని పెళ్ళాడమనీ వేడుకొంది.

"ఆమెలో ఈ మార్పుకి కలతచెందాను. ఏమీ తోచని స్థితిలో పడ్డాను. ఆమెని క్షమించి వదిలేయాలను కున్నాను. కానీ అప్పటికే బాగా ఆలస్యమైంది. ఆమె నిద్రమాత్రలు బాగా మింగేసివచ్చింది ...మాట్లాడుతూనే నా పాదాలమీద పడిపోయి ప్రాణాలు కోల్పోయింది. ఇప్పుడామె శవం బయట కారులో వుంది."

ప్రభావతీ, ఆమె అనుచరులూ కొయ్యబారిపోయారు.

నరేన్ అన్నాడు మళ్ళీ. "నాకిపుడు చిక్కులేంలేవు. పద్మిని ఆత్మహత్య చేసుకోడం నాకు కొంత రిస్క్ తప్పించింది. ఆమె శవాన్ని పోలీసులకి అందజేసి వాళ్ళకు మీకు చెప్పిందే చెప్తాను. నమ్ముతారు. ఆమెని నిన్న నేనిక్కడకి తీసుకురావడం ఊళ్ళో చాలామంది చూశారు. తర్వాత చెప్పాను వాళ్ళకి, ఆమెని ప్రేమిస్తున్నట్టూ, త్వరలో పెళ్ళాడుతున్నట్టూ. కానీ ఇప్పుడామె నిజ స్వరూపం తెలిసి అంతా నన్ను అభినందిస్తారు."

నరేన్ మరోసారి గట్టిగా రివాల్వర్ ఎత్తాడు. "నా లెక్చర్ చాలిస్తాను, ఇప్పుడు క్లయిమాక్స్! ఇప్పుడు మీరు ముగ్గురు మిగిలారు. మిమ్మల్ని ఇక్కడే ఈ రివాల్వర్‌తో కాల్చి చంపుతాను. మీరు జ్యోతిని ఘోరంగా చంపారు. చేతులు దులుపుకున్నారు. క్షేమంగా వున్నామని చంకలు కొట్టుకున్నారు-కానీ చేసిన పాపం చావదు! అది శిక్షను కోరుతుంది ఎప్పటి

కై నా!"

"ఆగు!" అరిచింది ప్రభావతి కంగారుగా, "కానీ నువ్వెలా బైటపడ్డావ్ మిమ్మల్ని చంపి?"

"ఆలోచించు!" అన్నాడు నరేన్, ట్రిగ్గర్ మీద వేలు సిద్ధంగా వుంచి, "దొంగల రాణివి, పథకాలు వేసే దానివి, ఆమాత్రం ఆలోచించలేవా? ఈ నగలు నన్ను బైటపడేస్తాయి. మిమ్మల్ని వరసబెట్టి కాల్చేసి పోలీసుల్ని పిలుస్తాను. పొట్టోడు పారిపోతాడు. పోలీసులకి మీ శవాల్ని చూపిస్తాను. వాళ్ళు మిమ్మల్ని గుర్తిస్తారు- అప్పుడు ఈ బ్రీఫ్‌కేసు అందిస్తాను. ఇది మీ కారులో దొరికిందంటాను! వాళ్ళు అందులో నగల్ని గుర్తిస్తారు- డోమర్ షాపులోంచి దోచుకోబడ్డ నగలు! అర్థమవుతోందా....?

"ఈ నగలు దోచుకొని పారిపోతూ మీరు నా ఇంటి మీద దాడిచేశారు. పద్మిని నన్ను ప్రేమిస్తున్నట్టు నటించి సేకరించిన తప్పుడు సమాచారంతో మీరంతా ఒయల్దేరి వచ్చేశారు—నా సేఫ్‌లో ఏదో విలువైనది వుందన్న అభిప్రాయంతో. కానీ నా సేఫ్‌లో ఛాయా చిత్రాలు తప్ప ఏమీ లేవు. నేను ప్రకృతి ఆరాధకుణ్ణి! అర్థమవుతోందా?

"అప్పుడు మీతో జరిగిన ఘర్షణలో నేను కాల్పులు జరిపాను, ఆత్మరక్షణార్థం. మీరు ముగ్గురూ చచ్చారు. ఈ రివాల్వర్, దీని లైసెన్సూ మద్రాసులో డిటెక్టివ్ సహాయంతో పొందాను. పోలీసులు నా మాటల్ని ఇట్టే నమ్మేస్తారు. పైగా మెచ్చుకుంటారు. మీ బందిపోటు ముఠాని నాశనం చేసినందుకూ ఈ నగల్ని కాపాడి నందుకూ! డోమర్ నుల్ అభినందించి ఆ పదివేల బహు

మానమూ నాకిచ్చేస్తాడు! నేనా డబ్బు తిరిగి పొట్టోడికి ఫీజు క్రింద ఇచ్చేస్తాను. అప్పుడు ఇంకొన్నాళ్ళక్కడేవుండి, పోలీసు తతంగం ముగించుకొని నా దారిని నేను-తృప్తి నిండిన హృదయంతో పోతాను! ఎలావుంది అయిడియా?"

ప్రభావతి గొంతు పెగల్లేదు. ఆమె అలా శిలా ప్రతిమలా వుండిపోయింది.

అనుచరులిద్దరికీ రానున్న ప్రమాదం తెలిసి వళ్ళు చల్లబడిపోయింది. కానీ నాగేష్ ధైర్యం పుంజుకున్నాడు. ప్రమాదాన్ని ఆహ్వానిస్తూ కూర్చోకూడదు, ఎదురువెళ్ళి రూపుమాపాలి!

ఆ మరుక్షణమే అతను సంధించిన బాణంలా వెళ్ళి తన ఎముకల పిడికిలతో బిగించి నరేన్ గెడ్డంకింద కొట్టాడు. పటపట శబ్దమయింది - నరేన్ వూహించలేదు. అతని చేతిలోని రివాల్వర్ ఆ విసురుకు ఎగిరివెళ్ళి దూరంగా పడింది. అతను వెనక్కు విరుచుకుని అంత బరువు సోఫానూ పడేస్తూ, తనూ పడ్డాడు క్రింద వెల్లకిలా!

బ్రీఫ్‌కేసు ఎగిరివెళ్ళి ఓ మూలగా పడింది.

అప్పుడు తేరుకున్న ప్రభావతి, శేఖర్‌లు విజయోత్సాహంతో వెర్రిగా అరుస్తూ వెళ్ళి చెరో వస్తువును చేజిక్కించుకొన్నారు-కానీ అదెంతోసేపు కాదు! ఈ అమానుషం చూసి కిటికీ అవతల ఉద్రేకపడ్డ పొట్టోడు, ప్రభావతి దగ్గర లాక్కున్న రివాల్వర్‌తో నిర్లక్ష్యంగా కాల్చాడు గదిలోకి.

మొదటి బుల్లెట్ గోడకి, రెండో బుల్లెట్ శేఖర్ చేతికి తగిలి పెద్ద శబ్దాన్ని, భయోత్పాతాన్ని సృష్టించాయి. శేఖర్ కీచుగా అరిచి నరేన్ రివాల్వర్‌ని అక్కడ వదిలేసి వురికాడు. ప్రభావతి బ్రీఫ్‌కేసుని

గుండెలకి హత్తుకొని తలుపు దగ్గరికి పరుగెత్తింది.

పొట్టోడు మళ్ళీ కాల్చాడు రెచ్చిపోతూ-

అప్పుడు నాగేష్ ముందుకెళ్ళి కిందపడ్డ రివాల్వర్‌ని గబుక్కున అందుకోబోతున్నవాడల్లా ఆగి, అక్కడే సరిగ్గా వచ్చి తగిలిన బుల్లెట్‌కి గట్సి పోగొట్టుకుని ఓ గావుకేకవేసి ప్రభావతికేసి పరిగెత్తాడు.

ప్రభావతి తలుపును పట్టి లాగుతోంది, పిచ్చిగా అరుస్తూ.

అప్పటివరకూ కిందపడి కళ్ళప్పగించి చూస్తోన్న నరేన్, తెలివిలోకొచ్చి, గభాల్న లేచి నిల్చున్నాడు. కిటికీవైపు తిరిగి గట్టిగా అరిచాడు. "నువ్వు కాల్చకు పొట్టోడా! ఇవి నా పిట్టలు!"

"నాది జేమ్స్‌బాండ్ షాట్, బాఁయ్యా! మీరు తప్పుకోండి-"

నరేన్ నేలమీద రివాల్వర్ అందుకుంటుంటే వెనుక నుంచి శేఖర్ అతనిమీదికి దూకి మెడ పుచ్చుకున్నాడు. నరేన్ వెంటనే వెనక్కి ఒక్క కుదుపుతో అతన్ని క్రిందబడేశాడు - శేఖర్ పడ్తూ నరేన్ కాళ్ళు పట్టి లాగేశాడు. నరేన్ అతనిమీద వెల్లికిలా పడ్డంతో నాగేష్ పరిగెత్తాడు రివాల్వర్ కోసం-కానీ అప్పుడూ ఆలస్యమైంది!

భళ్ళున తెరుచుకున్న తలుపులోంచి పొట్టోడు అంబోతులా దూసుకొచ్చి తాటికాయల్లాంటి పిడికిళ్ళతో నాగేష్ మెడమీద బాదడం మొదలెట్టాడు. నాగేష్‌కి రివాల్వర్ దొరకలేదు.

"పొట్టోడా! వాణ్ణిచంపేస్తున్నావ్!" నరేన్ అరుపుతో గాభరాపడి వదిలేశాడు పొట్టోడు. నాగేష్ మేకపిల్లలా

పరుగుతీశాడు బయటికి, ప్రభావతి వెంట.

అది చూసి నరేన్‌తో పోరాడుతోన్న శేఖర్ కూడా లేచి ఉరికాడు బైటికి!

వాళ్ళప్పటికే గేటు లోంచి అదృశ్యమైయ్యారు. గబగబా కారెక్కేస్తున్నారు. కానీ పిచ్చిపిచ్చిగా బుల్లెట్లు వచ్చి టైర్లకు తగిలి గాలి దిగిపోవడంతో, పెద్దగా అరుస్తూ ప్రాణరక్షణ కోసం బయటకు దూకేసి పరుగు ప్రారంభించారు-ఉత్తరంవైపు అడవిలోకి.

నరేన్ కారువద్దకి వచ్చి ఆగిపోయాడు. చిమ్మచీకటి! వాళ్ళ ఆకారాలు కనిపించడంలేదు. అరుపులు మాత్రం విన్పిస్తున్నాయి. పొట్టోడు పడుతూలేస్తూ వచ్చి నరేన్‌ని చేరుకున్నాడు.

"నువ్వు కాల్చకు పొట్టోడా! నా పగ నేనే తీర్చుకోవాలి!"

"కానీ ఆ నగలు బాబయ్యా.... నా పదివేలు!"

"భయపడకు! అవెక్కడికీ పోవు, పద!"

తిరిగి ఇద్దరూ ఉరికారు, అరుపులు వస్తోన్న వైపుకి చీకటిలో ఏమీ కన్పించకపోయినా. నరేన్ ఉజ్జాయింపుగా కాలుస్తూ ఉరుకుతున్నాడు.

వెనుక రివాల్వర్ షాట్స్‌కి వాళ్ళు ముగ్గురు వేగం పెంచి ఉరికారు. ప్రభావతికి ఆయాసం వస్తోంది.... బ్రీఫ్‌కేసును మోయలేక శేఖర్ కందింబింది. ముగ్గురూ చెరువుకట్ట దాటేసి అవతల విశాల మైన మైదానంలోకి పరుగెత్తుతున్నారు.... అడవి సమీపిస్తోంది.

పొట్టోడు పిచ్చెత్తిపోతూడు. నరేన్‌ని వదిలేసి ఆవేశంగా, ఉద్రేకంగా వాళ్ళని తిడుతూ పరుగు ప్రారం

భించాడు. నరేన్ పిచ్చివాడిలా వెనుక ఉరికాడు.... అలా ఉరుకుతూనే వున్నారు. ఇద్దరూ—చీకటిని చీల్చుకుంటూ, గావుకేకలు విన్పించేవరకూ.

పొట్టోడు హఠాత్తుగా ఆగిపోయాడు.

అరుపులు దగ్గర్లోనే విన్పించాయి.

“ఏం జరిగింది?” అనడిగాడు నరేన్.

“అవి చావుకేకలు బాబయ్యా!”

“ఎలా చచ్చారు, నేను కాల్చిందే?”

పొట్టోడు గబగబా ముందుకు వెళ్ళాడు. అప్పుడు సన్నగా ఏదో విన్పించింది.... చెవులు రిక్కించాడు. అది ఈసారి స్పష్టంగా విన్పించింది! కాళ్ళు నేలకేసి కొడుతున్న చప్పుడు!

చటుక్కున అగ్గిపుల్ల గీసి చూశాడు. అరడుగుల దూరంలో దృశ్యం కనిపించింది....నరేన్ పరుగునవచ్చి చూశాడు. పొట్టోడు మరోపుల్ల గీశాడు.

శేఖర్, అతనిమీద నాగేష్‌లు ప్రక్కనే ప్రభావతి ముగ్గురూ ఎత్తయిన పాములపుట్టమీద నురుగులు కక్కుతూ పడివున్నారు. ప్రక్కన బ్రీఫ్‌కేసు వుంది.

“పుట్టమీదికి ఉరికారు బాబయ్యా, పాము కరిచేసింది!”

నరేన్ ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు. రివాల్వర్ ఎత్తి అప్రయత్నంగా దించేశాడు.

పొట్టోడు ఆనందంగా వెళ్ళి బ్రీఫ్‌కేసు ఎత్తుకున్నాడు.

నరేన్ అలాగే కళ్ళార్పకుండా చూసి తల తిప్పుకున్నాడు.

వాళ్ళిద్దరు ఒకర్నొకరు చూసుకున్నారు.

"బాబయ్యా, మీరు బ్రహ్మాండంగా సాధించారు!"

"నా చెల్లెలికి శాంతి చేకూర్చాను."

"మీ చెల్లెలు అదృష్టవంతురాలు బాబయ్యా, మీలాంటి అన్నయ్యను పొందింది!"

—:ఐపోయింది:—

# గుండు చేసిన మేలు!

## ఇమంది రామారావు

హోటల్ 'హెవెన్' రూమ్ నెంబర్ ఫైవ్ జీరో ఫోర్ ముందు వందలమంది సినిమా జనం. వాళ్ళని చూడ్డానికి యెగబడుతున్నట్లు వేలమంది జనం.

ఇన్స్పెక్టర్ కిరణ్‌ను చూడగానే కానిస్టేబుల్స్ గది తలుపులు తెరిచారు.

ఊహించినంత గందరగోళం ఏం లేదక్కడ. ఫిలిం ప్రొడ్యూసర్ భీమానాయుడు ప్రశాంతంగా నిద్రపోతు న్నట్లనిపించింది. గుండు చేయించుకున్నాడు.

రూమ్ అంతా పరికించి చూశారు. డ్రెస్సింగ్ టేబుల్ దగ్గర పర్సుంది. పర్సులో వందరూపాయల నోట్లు వున్నాయి. లెక్కపెట్టాడు కిరణ్. యాభై నాలుగు న్నాయి. పర్సు మిగతా అరల్లో చూశాడు. ఏవో అడ్రసులు ఉన్నాయ్. అన్నీ అమ్మాయిల అడ్రసులే. ఇంకో సీక్రెట్ అరవుంది. అందులో యెవరో అమ్మాయి నేకడ్ నెగటివ్ ఉంది.

కిరణ్ శవాన్ని మరోసారి పరీక్షగా చూశాడు.

"రాజూ! డీటైల్ గా ఇన్ఫర్మేషన్ సేకరించండి. పోస్టుమార్టమ్‌కి ప్రొసీడింగ్స్ జరిపించండి. గోవిందురెడ్డి గారూ! కెన్ ఐ హావ్ ఏ పర్సనల్ టాక్ విత్ యూ!" అనడిగాడు. ఆ హోటల్ ప్రొప్రయిటర్ గోవిందురెడ్డి "ష్యూర్ ష్యూర్" అంటూ తన ఆఫీసురూమ్‌కేసి నడిచాడు.

భీమానాయుడు పేరుమోసిన ఫిలింప్రొడ్యూసరు. చాలామంది నటీనటుల్ని తన సంస్థద్వారానే పరిచయం చేశాడు. భీమానాయుడు సినిమా హీరోలాగా ఉంటాడు. అందుకే చాలామంది హీరోయిన్లు ప్రేమించారు. పెళ్ళి కూడా సిద్ధమయ్యారు.

"ఊఁ.... చెప్పండి!" కుర్చీలో కూర్చుంటూ అడిగాడు కిరణ్. ఆఫీసంతా ఒకసారి కలియచూశాడు. చాలా మోడ్రన్ గా ఉంది. అందమయిన అమ్మాయిల అర్ధనగ్న చిత్రాలున్నాయి.

"అసలు ఏం జరిగిందంటే!" అంటూ చెప్పడం మొదలుపెట్టేసరికి యస్. ఐ. రాజు "ఎక్స్క్యూజ్ మి సర్!" అంటూ తలుపు తోసి లోపలికి వచ్చాడు.

"ఆయన బెడ్ క్రింద ఈ డెయిరీ ఉంది సర్!" అన్నాడు రాజు ఎర్రటి డెయిరీ అందిస్తూ. ఆ డెయిరీ మీద 'భీమానాయుడు ఫిలిం ప్రొడ్యూసర్' అని గోల్డు లెటరింగ్ ఉంది.

ఇన్‌స్పెక్టర్ కిరణ్ డెయిరీ పేపర్లు స్పీడ్ గా తిరగేసి చివరి పేజీ కొచ్చాడు.

"డేట్ మే ఒకటి— ఈ రోజు యింటిదగ్గర పుష్పకి చెప్పవలసినవన్నీ చెప్పేసు. నా ఫ్రెండ్స్‌కి ఫోన్ చేసి

పిల్లల గురించి చెప్పాను. తిరుపతి 'సప్తగిరి' ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళాను. స్పెషల్ దర్శనం చేశాను. దర్శనం బాగా జరిగింది. స్వామివారి విగ్రహాన్ని బాగా చూశాను. 'సప్తగిరి'లోనే బయలుదేరాను.

'హోటల్ హెవెన్' రెడ్డిగారికి ఇంతకుముందు నాలుగువేలు చిల్లర రూమ్-ఫీజ్ బాకీ వున్నాను. నేనీ రాత్రి ఆత్మహత్య చేసుకుంటున్నానని పాపం రెడ్డికి తెలీదు. నా డైయిరీ పోలీసులకి దొరుకుతుంది. వివరాలు చదివితే రెడ్డిగారికి నేనివ్వవలసిన డబ్బు ఇప్పించగలరు. మిస్ లీలారావ్‌కి ఒక వెయ్యిరూపాయలు ఇవ్వాలి.

నా ఆత్మహత్యకు నేనే కారణం. ఇందుకు యెవరూ బాధ్యులుకారు. నా ఆస్తి నాలుగులక్షలు. అప్పులు పది హారులక్షలు. నా జీవితంలో ఈ అప్పులు తీర్చలేను. బ్రతికి నా మొహం చూపించలేను. అందుకే స్లీపింగ్ పిల్స్ తీసుకున్నాను" అంటూ క్రింద సంతకం చేసివుంది.

బరువుగా నిట్టూర్చి డైయిరీని జేబులో పెట్టుకున్నాడు.

"అసలేం జరిగిందం టేనండీ" అంటూ మొదలుపెట్టాడు రెడ్డి. "నిన్నరాత్రి పదకొండు గంటల ప్రాంతంలో వీరు మా హోటల్లోకి వచ్చారండి. ఆయన మా 'హెవెన్'కి ఎప్పుడొచ్చినా సెంటిమెంటల్‌గా 504లోనే దిగుతారండీ. ఇంతకుముందు డబ్బు యివ్వలేదు కదాని కొంతసేపు తటపటాయించానండీ. మీరు ఒకేసారి తీసుకుందురు కాని, ఇప్పుడు రూమ్ కావాలి! అని పట్టుబట్టారండీ. రూమ్ యిచ్చానండీ. ఇంతవరకే నాకు తెలుసండీ. పదకొండున్నరకి నేను యింటికి వెళ్ళిపోయానండీ. ఆ తర్వాత ఏం జరిగిందో నాకు తెలీదండీ. సత్యప్రమాణకంగా చెప్తున్నానండీ!" అన్నాడు గోవిందురెడ్డి

కళ్ళల్లో నీరు తిప్పుకుని.

"ఆయనకి రూమ్ ఎలాట్ చేసింది యెవరు?"

"మిస్ లీలారావ్ అండీ!"

"కొంచెం పిలుస్తారా ఆమెను?" అని అడిగాడు కిరణ్.

లీలారావ్ కీ భీమానాయుడికీ ఏదో సంబంధం వుంది. అందుకే వెయ్యిరూపాయలు ఆమెకోసం కేటాయించాడు. మరోసారి డైరీ తిరగేశాడు. లీలారావ్ గురించి రాసిన మాటలు చదివేడు.

"లీలారావ్ చాలా మంచిది. ఎప్పుడూ నవ్వుతూ మాట్లాడుతుంది. తెలివిగా సమాధానం చెబుతుంది. లీలా రావు నిజంగా దేవత" అంటూ ఒకచోట వుంది.

ఇంటర్ కమ్‌లో లీలారావ్‌తో మాట్లాడేడు, గోవిందు రెడ్డి. నిముషాలమీద లీలారావ్ వాలింది. "యస్ప్లీజ్!" అంది.

లీలారావ్ ఎర్రగా ఎత్తుగా, ఎత్తుకు తగ్గ లావు, ఎంచక్కా అజంతా శిల్పంలా వుంటుంది. పెదవులమీద ఎప్పుడూ నవ్వు దొర్లుతునే వుంటుంది.

"భీమానాయుడు రూమ్ యెప్పుడు తీసుకున్నారు?"

"నిన్న పదకొండు గంటల ఏడునిమిషాలకి" అంది వాచీకేసి చూసి.

"మీకు భీమానాయుడు చాలా బాగా తెలుసా?"

"చాలా బాగా అంటే?" మిస్ లీలారావ్ కంగారు పడలేదు. నవ్వుతూనే సమాధానం చెబుతోంది. నవ్వు తూనే అడిగింది.

"ఆయన డైరీలో మీరున్నంతగా" కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు కిరణ్.

ఆమె నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో అర్థాలు.

"వాట్ డు యూ మీన్" అన్నాడు ముందుకు వంగి.

"లెట్ మీ నో వాట్ డు యూ మీన్" అంది ఎదురుప్రశ్న వేస్తూ.

"మీ యిద్దరి మధ్య సమ్ రిలేషన్‌షిప్ వుండితీరాలి!"

"ఒక పాసింజర్‌కి, రిసెప్షనిస్టుకీ మధ్య రిలేషన్‌షిప్ తప్ప మరొకటి ఊహించకండి."

"ఆయన మీ కెప్పుడయినా డబ్బు ఇచ్చాడా?"

"లేదు!"

"ఇస్తానన్నాడా?"

"లేదు!"

"ఈ హోటల్‌కి వచ్చే పాసింజర్స్‌లో ఎవరైనా, యెప్పుడయినా టిప్స్‌గా వెయ్యిరూపాయలు మీకిచ్చారా?"

"వెయ్యిరూపాయిలా!" ఆశ్చర్యపోయింది.

"ఏం యివ్వకూడదా?"

"మీరయితే ఇస్తారా?" అంది తక్షణ. కిరణ్ మొహం తుడుచుకున్నాడు.

గోవిందురెడ్డి మొహంలో రంగులు మారుతున్నాయ్. ఇబ్బందిగా ఫీలవుతున్నాడు. 'యు కెన్ గో' అన్నాడు కిరణ్, రెడ్డికేసి చూసి. రెడ్డి అక్కడ్నుంచి కదిలాడు. రాజు ఫాలో అయ్యాడు.

"కెన్ ఐ గో!" అంది లీలారావ్ నవ్వుతూ.

"నో,నో. మీరు వుండాలి. అవసరమయితే ఈ కేసు పరిశోధన ముగిసేవరకూ నువ్వు.... సారీ మీరు నాతో ఉండవలసి వస్తుంది!" అన్నాడు.

"ఎందుకని-మీకా్కవలసిన వివరాలు అడగండి చెబుతాను. పోలీసుల జీపుల్లో తిరిగే అలవాటింకా రాలేదు!" కొంచెం చిరుకోపంతో కూడిన నవ్వు విసిరింది.

"చూడండి మిస్ లీలారావ్ గారూ! మీరొక రిసెప్షనిస్టుగా కాకుండా నా వెల్ విషర్ గా చెప్పండి. నాకా్క వలసిన ఇన్ ఫర్మేషన్ అందించండి. నాకు మీరీ విషయంలో సంపూర్ణమైన సహకారాన్ని అందించాలి!" అంటూ రిక్వెస్టు చేస్తున్నట్లు అడిగాడు.

మిస్ లీలారావ్, కిరణ్ మొహంలోకి చూసింది.

కిరణ్ అందగాడు. ఆరడుగుల ఎత్తు. నొక్కులజుత్తు, సినిమా హీరోలు చూసి తల దించుకునే పర్సనాలిటీ ఉందతనికి.

"ఏం మాట్లాడరు!" అంటూ లేచినిలబడ్డాడు.

"ఇక్కడేం మాట్లాను. మనం ఏం మాట్లాడుకున్నా రెడ్డిగారు వింటారు. సౌండ్ కనెక్షన్ వుంది. అదిగో చూశారా రెడ్ లైట్. క్రిందనుండి రెడ్డిగారు మన మాటలు వింటున్నారు. మిమ్మల్ని తర్వాత కలుసుకుంటాను" అంటూ కాగితంమీద రాసింది తెలివిగా.

మిస్ లీలారావ్ ని అభినందించకుండా వుండలేక పోయాడు ఇన్ స్పెక్టర్ కిరణ్.

## 2

"ఆయన నిన్న ఉదయం ఎన్ని గంటలకు ఇంటినుండి బైటికి వెళ్ళారమ్మా!" శోకసముద్రంలో వున్న భీమానాయుడి భార్య పుష్పను ప్రశ్నించాడు కిరణ్.

"అయిదు గంటలకి!" దుఃఖాన్ని ఆపుకుంటూ జవాబు చెప్పింది.

"ఆయన యెవరికయినా ఫోన్లు చేశారా!"

"చేశారు!"

"సుమారు ఎన్ని ఫోన్లు చేసివుంటారు?"

"అలాంటి విషయాలు నేను పట్టించుకోనండీ. నిన్న మాత్రం ఆయన ఎప్పటిలాగే నాలుగ్గంటలకి లేచిపోయి, నన్ను పిల్లల్ని లేపి చాలా హేపీగా మాట్లాడారు. ఈ మధ్యకాలంలో అంత హేపీగా మాట్లాడ్డం ఎప్పుడూ చూడలేదు. తర్వాత ఫోన్లు చేశారు-నాలుగయిదు ఫోనులుంటాయండీ...." అంది పుష్ప.

పుష్ప పాతకాలం మనిషి. మాటతీరు, చూపుతీరు చూస్తే కొంత వెనకపడిన తత్వం స్పష్టమౌతోంది.

"ఆయన ఈ మధ్య ఏమయినా బాగా నష్టపోయారా?"

"ఏమోనండి, ఆయన మాకు తిండీ బట్టా తప్ప, మిగతా విషయాలు చెప్పడంగాని, నేను అడగడంగాని యింతవరకూ జరగలేదు."

"స్త్రీ సావాసాలు ఎక్కువట కదమ్మా!" అన్నాడు కిరణ్ ఇబ్బందిగా మొహంపెట్టి.

రియాక్టయింది పుష్ప. కోపం ముంచుకొచ్చింది.

"మీలా కొందరు అనడం తప్ప నాకు తెలీదు. సినిమాఫీల్డు కదండీ గోరంతలు కొండంతలు చేస్తారు. అయినా మా వారిమీద నాకు నమ్మకముంది. నన్ను సుఖపెట్టారు. పిల్లలు ముగ్గుర్నీ సుఖపెడుతున్నారు. ఆయనకేం రాజా—ఆయన మాటకి నేను పెళ్ళియినప్పటినుండీ ఎదురు చెప్పలేదు-ఎదురుచెప్తే ఆయన సహించలేరు. ఆయన అనుకున్నది జరిగితీరాలి. జరగలేదో దాని అంతు చూస్తారు. ఆయనకి కోపమొచ్చినా, సంతోషమొచ్చినా తట్టుకోలేరు" అంటూ ఏడుపు ఆపుకోలేకపోయింది

పుష్ప—

భీమానాయుడు బెడ్‌రూమ్, డ్రెసింగ్‌రూమ్ కలయ చూశాడు కిరణ్. భీమానాయుడికి మంచి టేస్టువుంది. అందమయిన మాడ్రన్ ఆర్టు ఇంటినిండా వుంది.

"పిల్లల పేరునగాని, మీ పేరునగాని ఏవైనా ఇన్సూరెన్స్ చేయించారామ్మా?"

"ఏం తెలీదండీ!"

పుష్ప ఏవడిగినా తెలీదంటుంది. పిల్లలు ముగ్గురూ చిన్నవయసులోవున్న పిల్లలే. పెద్దవాడికి పన్నెండు సంవత్సరాలుంటాయి. చిన్నపిల్లకి ఎనిమిది సంవత్సరాలుంటుంది. మరో చంటిపాప వుంది. రెండు సంవత్సరాల వయసుంటుంది.

డైరీలో దాచిన కొన్ని కాగితాలు తీసి ఎడ్రసులు చూశాడు. మూడు ఎడ్రసులున్నాయి. మూడూ లేడీస్ ఎడ్రసులే.

"సువర్ణ, ఇందిర, పద్మ వీరి ముగ్గురు పేర్లు యెప్పుడయినా విన్నారా!"

"చూశానండి!"

"ఎప్పుడు."

"వేషాలకని మా యింటికి ప్రతిరోజూ వచ్చేవారు. చాలామంచి పిల్లలు" అని సర్టిఫికేట్ యిచ్చింది.

కిరణ్ ఆశించిన సమాధానం ఒకటీ దొరకటంలేదు. పుష్ప అమాయకురాలని నిస్సందేహంగా చెప్పొచ్చు. సనాతన ఆచార, ధర్మాలు తు.చ. తప్పకుండా పాటించే మనిషి. భర్తంటే దేవుడులా చూసుకుంటుంది. బహుశా,

తన దృష్టిలో అందరూ మంచివాళ్ళేనేమో. ఆమెకు ధైర్యం చెప్పి బయటికి నడిచాడు.

# 3

కిరణ్ జీపులో కూర్చున్నాడేగాని ఆలోచనలు.

డైరీ యింకోసారి తిరగేశాడు. సువర్ణ, ఇందిర, పద్మ ముగ్గురూ ఒకే ప్రాంతంలో వుంటున్నారు. వెస్టు కె.కె. నగర్ మెయిన్‌రోడ్‌లో. సువర్ణ హౌస్ నెంబరు 91 లోనూ, ఇందిర 80 లోనూ, పద్మ 70 లోనూ వుంటున్నారు.

ముందు 'పద్మ' యిల్లు కనిపించింది. బయట 'పద్మ' సినీ ఆర్టిస్ట్ అని బోర్డుంది.

జీపు ఆగింది.

కిరణ్ ఒక్కడే లోపలికి నడిచాడు.

పద్మ కిరణ్‌ని చూసి బెదిరిపోయింది. ఖాకీబట్టలు చూసేసరికి యెవరికయినా కంగారు పుట్టుకురావడం సహజం.

"మిస్ పద్మ ఎవరు?" అన్నాడు కిరణ్ పద్మని పరీక్షగా చూస్తూ.

"నేనే.... నేనే సార్. కూర్చోండి సార్!" అంది తడబడుతూ.

"కంగారు పడకండి. ఊరికే చూసి వెడదామని వచ్చాను!" అన్నాడు భయం పోగొట్టడానికి.

"ఇంతకుముందు మా యింటికి ఎపుడయినా వచ్చారా?" అంది పద్మ ఆలోచిస్తూ.

పద్మ మరోరకంగా ఆలోచిస్తోంది. పోలీసులు సినిమా నటుల యింటికి రావడం, మంచి చెడు మాట్లాడ్డం, పదో పాతికో పట్టుకుపోవడం అలవాటే—సబ్ ఇన్స్పెక్టరూ

ఇన్ స్పెక్టర్లూ అయితే అకేషనల్ గా రావడం, ఒక్కపూట వుండి 'విందు' ముగించుకొని వెళ్ళిపోవడం పరిపాటే! అలాంటి దృష్టితో అడిగింది పద్మ.

"నేను ఇంతకు ముందు రాలేదు—మీకు ఫిలిం ప్రొడ్యూసరు భీమానాయుడు గారితో పరిచయముందా?" అన్నాడు కిరణ్ కూర్చుంటూ.

టీపాయ్ మీద అందమయిన తెలుగు ఇంగ్లీషు తెలుగు సినిమా స్టార్ల బొమ్మల్ని సంతరించుకున్న బుక్సున్నాయి. కిరణ్ పద్మ ఇంటిని పరిశీలించసాగాడు.

ఇల్లు పెద్ద రిచ్ గా ఏంలేదు. సంపాదన వందలమీద నే అయివుంటుంది.

"భీమానాయుడుగారు తెలుసండీ అంతవరకే! "అంది వినయంగా.

"మీ అడ్రసు ఆయన దగ్గరుందా?"

"వుండొచ్చు. ఒకసారి అడ్రసిచ్చి వెళ్ళమ్మా.... కబురు చేస్తానన్నారు."

"కబురు చేశారా!"

"లేదు!"

"పోనీ మీరు కలిశారా!"

"చాలాసార్లు కలిశాను. సినిమా షూటింగు పార్టు ఫినిష్ అయ్యేంతవరకూ చూశాను. పిక్చర్ ఫినిషయ్యాక వెళ్ళలేదు. అన్నట్లు ఆ సినిమా ఈ మధ్య నే విడుదలయింది. ప్లాప్ అయింది కూడా" అంది ఆ సినిమాకి సంబంధించిన ఇన్ ఫర్మేషనిస్తూ.

"చూడండి! భీమానాయుడుగారు చనిపోయారు మీకు తెలుసా?"

షాక్ ఫీలయ్యింది. కాసేపు మాట్లాడలేకపోయింది

పద్మ.

"చనిపోయారా? ఎప్పుడండి....ఎలా....?" ప్రశ్నల వర్షం కురిపించింది.

"హోటల్ హెవెన్ రూమ్ నెంబర్ 504లో చనిపోయారు. ఆత్మహత్య చేసుకున్నారు."

"ఆత్మహత్య....ఆత్మహత్య భీమానాయుడుగారు చేసుకున్నారా? నో అలా జరగటానికి వీల్లేదు సార్!" అంది పద్మ.

"ఏం! ఆయన గురించి అంతా తెలుసా?"

"ఆఁ!.... నేను ఒకసారి వెళ్ళినపుడు నా ఫామిలీ ఎఫైర్స్, ఇండస్ట్రీలో నేను ఫేస్ చేసిన ప్రాబ్లెమ్స్ అన్నీ చెప్పి, మాటల సందర్భంగా ఆత్మహత్య చేసుకుంటానని చెప్పేశాను....అంతే ఆయన గంటసేపు ఉపన్యాసం ఇచ్చారు. ఆత్మహత్య మహాపాపమని మనల్ని మనం చంపుకునే హక్కు లేదని, ఏదయినా కష్టం వస్తే ధైర్యంగా, ఎదొర్కోవాలని, ఎంతో నచ్చచెప్పి నా చేతిలో అయిదువందల రూపాయలు పెట్టారు. అంత మంచిమనిషి ఆయన.

ఓ రోజు అరుణాచలం స్టూడియోలో షూటింగు జరుగుతుంది. ఆయన వున్నారని తెలిసి కలవటానికి వెళ్ళాను. చీకటి పడింది. బిజీగా వుండబట్టి వెంటనే మాట్లాడి పిలిపించలేకపోయారు. నేను ఓపిగ్గా షూటింగ్ 'పేకప్' అయనంతవరకూ వున్నాను.

'వుండు పద్మా ఇంటి దగ్గర డ్రాప్ చేస్తా' నన్నారు.

కారులో ఆయన ఫ్రంట్ సీట్లో కూర్చున్నారు. నేను బాక్ సీట్లో కూర్చున్నాను. డ్రైవరు కారు స్పీడుగా పోనిచ్చాడు. ఆయన అదిరిపోయారు. ఒకటి రెండుసార్లు

మందలించాడు.

"ఏమిటిది. నువ్వు మనిషివా! పశువ్వా. చెబితే వినిపించుకోవేం. దేనితోనైనా ఆడుకోగానీ, మనుషుల ప్రాణాలతో ఆడుకోకు!" అన్నారు.

డ్రైవరు వినిపించుకోలేదు. "ఇంతకంటే స్లోగా ఎలా తోలమంటారండీ!" అంటూ ఎదురుతిరిగాడు.

అంతే! కారు ఆపుచేయించి తను స్వయంగా డ్రైవ్ చేశారు! ప్రాణాలంటే అంత తీపి ఆయనకి—ఎవరికయినా కష్టం వచ్చిందంటే తనకు తోచిన సహాయంచేసే ధర్మాత్ముడు ఆయన!" అంటుండగా పద్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కిరణ్ ఆలోచనల్లోపడ్డాడు. భీమానాయుడు గురించి భీమానాయుడు భయం గురించీ వివరంగా చెప్పింది పద్మ. అంటే అతను ఆత్మహత్య చేసుకోలేదు, చేసుకోలేడు. ఎవరో చంపివుండాలి. తన అనుమానమే నిజమైంది.

ఎవరు చంపుతారు? భీమానాయుడ్ని చంపవలసిన అవసరం ఎవరికి వుంటుంది. గోవిందురెడ్డి చంపాడా? చంపడానికి అవకాశాలు తక్కువ. మిస్ లీలారావ్‌కీ భీమానాయుడికీ మధ్య ఏమిటి సంబంధం. లీలారావ్ తనను పర్సనల్‌గా కలుసుకొని మాట్లాడుతానని ఎందుకు చెప్పింది? ఇందులో గోవిందురెడ్డికి ఏవన్నా భాగముందా? లీలారావ్ గోవిందురెడ్డిముందు తనకు తెలిసిన వివరాలు చెప్పటానికి ఎందుకు నిరాకరించింది?

పద్మ ఏవన్నా నాటక మాడుతుందా? నిజంగా పద్మకి భీమానాయుడితో పర్సనల్ టచస్ వుంటే ఇంత పూర్ లైఫ్ అనుభవించవలసిన అవసరముండదు.

"పద్మగారూ! మీ రీ మధ్య ఆయన్ని కలవడం

జరిగిందా?"

"లేదండీ!"

"ఆయన కలవడం జరిగిందా?"

"రెండూ ఒకటే కదండీ!" నవ్వింది.

"భీమానాయుడికీ ఇందిర, సువర్ణలకీ ఏమయినా సంబంధం వుందా? మీ అడ్రసుతోబాటు వారిద్దరి ఎడ్రసులూ దొరికేయి! ఆయన పర్సులో వున్న ముగ్గురు భామలు మీ ముగ్గురూ—వారిద్దరి గురించి మీకు ఎంత వరకూ తెలుసు?"

"వాళ్ళూ చిన్న చిన్న వేషాలు వేస్తుంటారండీ.... మేం ముగ్గురం కలిసి వెళుతుండేవారం ఆయనింటికి ఆటోలో....

ముగ్గురం మా ఇంటి దగ్గర్నుంచే బయలుదేరి వెళ్ళే వారం ఆటో, టాక్సీ, డబ్బులు కలిసొస్తాయని—అంతే—మిగతా వివరాలు నాకు తెలీదు. నాకు తెలిసి భీమా నాయుడికి మాతో తిరగవలసిన పనిలేదు. వారు తలుచుకుంటే అగ్రశ్రేణి కథానాయికలంతా పరుగెత్తుకు వస్తారు!" అంది పద్మ.

హౌస్ నెంబర్ 80కి దారితీశాడు కిరణ్.

ఇందిర ఇల్లు. కొంచెం మాడ్రెన్‌గా వుంది. ఇంట్లో ఇద్దరు అమ్మాయిలున్నారు. కిరణ్‌ని చూసి నవ్వింది ఇందిర యింతకుముందు పరిచయమున్నట్టు — కిరణ్ నవ్వాడు.

"ఏంటి సార్ యిలా వచ్చేశారు?" అంది పరిచయంగా.

"మిమ్మల్ని చూడాలని. 'సువర్ణ' గారిల్లు ఈ ప్రక్కనా—"

ఇందిర ప్రక్కకు చూసింది. బహుశా ఆమె 'సువర్ణ' అయివుండొచ్చు.

"ఈమె సువర్ణ ...." అంటూ పరిచయం చేసింది. తను 'ఇందిర' అని తెలుస్తోంది.ఇంట్లో మరెవరూ లేరు. అర్ధ నగ్న ఛాయాచిత్రాలున్నాయి. సినిమా కోసమని తీయించుకున్న స్టిల్స్ ఫుల్ సైజులోనివి ఫ్రేమ్ చేసినవి గోడకి తగిలించి వున్నాయి.

"మీరు ప్రస్తుతం సినిమాల్లో నటిస్తున్నారా?" ఫోటో చూస్తూ అడిగాడు కిరణ్.

"మలయాళం చిత్రాల్లో చేస్తున్నాను" అంది ఇందిర ధైర్యంగా.

"మీరు కూడా ఏవైనా ఫిల్మ్స్ చేస్తున్నారా?" అన్నాడు సువర్ణను చూస్తూ. తల దించుకుంది. బదులు చెప్పటానికి సిగ్గుపడింది.

"తనేం చేయడంలేదండీ! మలయాళంలో రెండు మూడు పిక్చర్స్ ఆఫర్స్ వచ్చాయి. ఒప్పుకోలేదు. ముందు మాతృభాషా చిత్రాల్లో చేసిగాని పరభాషా చిత్రాలు ఒప్పుకోదట. ఈవిడగారు గాంధీగారి మనుమరాలు. సెక్స్ క్రైమ్ ఫేంటసీ ఇలాంటి సినిమాలు ఒప్పుకోదు. ఈవిడగారి గురించి కుటుంబగాథ చిత్రాల్ని మాత్రమే ప్రత్యేకించి తయారు చేయించాలి!" అంటూ జోక్ చేసినట్లు ఫీలయి నవ్వింది. సువర్ణ ముక్కుపుటాలమీద చిరుకోపం పొడుచుకొచ్చింది.

"తెలుగు ఫిలిం ప్రొడ్యూసరు భీమానాయుడు చని పోయారు. మీకు తెలుసా?" అనడిగాడు కిరణ్.

"అవునట పాపం!" అంది ఇందిర.

"ఎపుడు తెలిసింది?"

"యిప్పుడే తెలిసింది!"

"ఎలా తెలిసింది!"

"అదేవిట్సార్ పిల్ల పుడితే పేరు దాగుతుందా! భీమా నాయుడుగారంటే ఎవరికి తెలీదు? ఆయనకి అమ్మాయిల పిచ్చి—సారీ ..." అంటూ నాలుక్కొరుచుకుంది ఇందిర.

ఇందిర గడగడా మాట్లాడేస్తుంది మనసులోనున్నది. ఏదీ దాచుకోదు. పసిపిల్ల మనస్తత్వం అనిపిస్తోంది.

"ఆయనంత పచ్చిగా తిరుగుతుండేవారా?" అన డిగాడు కిరణ్.

"పోలీసువాళ్లు—మీతో జాగ్రత్తగా మాట్లాడాలి. నోరు పారేసుకున్నాను. క్షమించండి సర్. ఆయనకి ఆడ వాళ్ళంటే మహాపిచ్చి. అందమయిన ఆడది కనిపిస్తే, వేలు, లక్షలయినా ఖర్చుపెట్టించి బలవంతంగానైనా ఆమెను పొందేవారట. అంతటి రసికుడట. మాలో మేం కథలు కథలుగా చెప్పుకోవడమేగాని పర్సనల్ ఎక్స్ పీరియన్స్ ఎవరికీ లేదుసార్!" అంది ఇందిర నిర్మొహ మాటంగా.

కిరణ్‌కి మెదడు చురుగ్గా పనిచేయసాగింది. మరి సువర్ణ, ఇందిర, పద్మల ఎడ్రసులు ఎందుకున్నట్లు? ఆఫీసులో వుండొచ్చుకదా? అసలు భీమానాయుడికి వీరు ముగ్గురుగాక యింకా చాలామందితో సంబంధం వుందన్న మాట.

"భీమానాయుడుగారికి మంచి గర్ల్ ఫ్రెండ్స్ ఎవరో చెప్పండి. పోలీసు డిపార్టుమెంట్‌కి మీరు ఎంతో సహాయం చేసినవారౌతారు. భీమానాయడు ఆత్మహత్య చేసుకున్నట్లు ఆయన డైరీలో వుంది. భీమానాయుడు మన స్తత్వం దృష్ట్యా ఆయన ఆత్మహత్య చేసుకోలేదని

ఎవరో ప్రయత్నం మీద హత్య చేశారని అనిపిస్తోంది. యెవరో చాలా తెలివిగా హత్య చేశారు. బయటపడని విధంగా హత్య చేశారు. భీమానాయుడికి బాగా క్లోజ్ గా యెవరుంటారు? యెవరంటే భీమానాయుడికి ప్రాణం కొంచెం వివరంగా చెప్పి హెల్ప్ చేయండి" అన్నాడు కిరణ్.

కిరణ్ అందరితో స్నేహపూర్వకంగా వుంటాడు. ఆయనతో మాట్లాడుతుంటే ఒక పోలీసాఫీసరుతో మాట్లాడుతున్న ఫీలింగు ఎవరికీ వుండదు. అంత ఆత్మీయతా భావం వుట్టిపడుతుంది ఆయన మాటల్లో.

ఇందిర ఏదో చెప్పటానికి కొంచెం అనుమానిస్తోంది.

"ఊఁ చెప్పండి. ప్లీజ్!" అంటూ ముందుకు జరిగాడు.

"వర్ధమాన హీరోయిన్ సంధ్యగారితో ఎక్కువ చనువుగా వుంటాడు. ఆమెను ఫీల్డుకు పరిచయం చేసినది ఆయన. ఏమో సార్, మాకు తెలిసినంతవరకూ చెప్పాం. ఈ కేసు విషయంలో మీరు చాలా టైర్ అయినట్టుంది. వుండండి. 'లంచ్' తీసుకొని కాస్సేపు విశ్రాంతి తీసుకొని వెడుదురు" అంది ఇందిర నవ్వుతూ. ఆ నవ్వుకి అర్థం మరొకటి.

"నో థాంక్స్! అవసరమయితే మీరు ఓసారి స్టేషన్ కు రావలసి వుంటుంది. ఓ. కే?"

"ఓ. కే. సర్ విత్ ప్లెజర్!" అన్నారు యిద్దరూ కూడబలుక్కున్నట్టు.

ఇన్స్పెక్టర్ కిరణ్ మౌంట్ రోడ్ కేసి జీపు పోనిచ్చాడు.

# 4

డిటెక్టివ్ సాయిబాబా త్రిబుల్ ఫైవ్ వెలిగించి గుప్పుగుప్పుమంటూ పొగలు గ్రక్కుతున్నాడు.

గోవిందురెడ్డి, విగ్రహంముందు పూజారిలా వినయంగా తన గోడు వినిపించుకోడానికి సిద్ధంగా వున్నాడు.

"శవాన్ని పోస్టుమార్టమ్ చేయించారా?" అనడిగాడు సాయిబాబా.

"లేదుసార్. కిరణ్ గారు డెడ్ బాడీని అలాగే ఆపమని లేక్ కి ఫోన్ చేసి డెడ్ బాడీ డిస్టర్బ్ అవకుండా కెమికల్ ప్రొటెక్షన్ తో, చూడమని మెసేజ్ పంపించారట—"

"యెందుకట!" అర్ధంకానట్లు జులపాలు నొక్కుకున్నాడు.

"తెలిస్తే మీ దగ్గరికి ఎందుకు వస్తాను! నాకు భయంగా వుంది సర్. భీమానాయుడుగారు హోటల్ కి రావడం టౌన్ లో అందరికీ తెలుసు. ఫైవ్ జీరో ఫోర్లో బస చేయడం కూడా తెలుసు. వున్నట్లుండి సడన్ గా ఆయన డెడ్ బాడీ కనిపించింది" ఆయాసంగా రొప్పుతున్నాడు గోవిందురెడ్డి.

"ఆయన రూమ్ లో ఇంకేవన్నా కనిపించాయా?"

"డెయిరీ కనిపించింది సర్!"

"ఆ డెయిరీలో ఏముంది?"

"కిరణ్ గారు చూశారు ఏముందో—"

"బహుశా ఆత్మహత్య చేసుకుంటున్నట్లు రాసి వుండొచ్చుకదా."

"అవున్సార్."

"స్లీపింగ్ పిల్స్ బాటిల్ కనిపించిందా?"

"లేదు సర్!"

"ఏం తాగి చనిపోయాడట!"

"స్లీపింగ్ పిల్స్ వేసుకొని పోయినట్లే అనుకుంటున్నారు సర్!"

డిటెక్టివ్ సాయిబాబా మరోసారి తలగోక్కున్నాడు.

"పిల్స్‌తోబాటు బాటిలు కూడా మింగేశాడటా!" క్వొశ్చన్ మార్క్ మొహం పెట్టాడు సాయిబాబా.

"కావొచ్చు సర్!" అన్నాడు గోవిందురెడ్డి అమాయకంగా. సాయిబాబా గతుక్కుమన్నాడు.

"నీకెంత ఇవ్వాలన్నావ్?" తన ధోరణిలో ప్రశ్నలు కురిపిస్తున్నాడు సాయిబాబా.

"నాలుగువేలు చిల్లర—అవ్వి ఇవ్వకపోయినా పరవాలేదు. కేసుమాత్రం నామీదకు రాకూడదు. మీకెంత ఫీజు ఇచ్చుకోమన్నా ఇచ్చుకుంటాను!" అని ప్రాధేయపడ్డాడు.

డిటెక్టివ్ సాయిబాబా ప్రయత్నం మీద నవ్వాడు ఇదెంతమాట అన్నట్లు.

"ఇంతకుముందు మీ హోటల్లో ఇలాంటి కేసులు జరిగాయా?"

"లేదండీ! ఇదే ఫస్టుటైమ్!" బాధగా అన్నాడు.

"అయితే తప్పకుండా ఈ కేసు నీ నెత్తిన పడుతుంది. నీకు నాలుగయిదువేలు బాకీవున్నారని నువ్వే చెబుతున్నావ్. మనలో మనమాట. నువ్వు ఆయనకి ఎప్పుడయినా అమ్మాయిల్ని సప్లయ్ చేయడం జరిగిందా?" అనుమానంగా అడిగాడు సాయిబాబా.

"రామ రామ! అలాంటి అలవాట్లు నాకు లేవండీ, ఆయన అడగలేదు నేను చేయలేదు. మా రిసెప్షనిస్టు

శీలారావ్ మీద మాత్రం నాకు అనుమానం. ఎందుకంటే ఆమెమీద చాలామంది పెద్దమనుషులు మనసుపడ్డారు. ఆ మనసుపడ్డ మనుషుల్లో భీమానాయుడుగారు గొప్ప పెద్దమనిషి. ఆయన గురించి వివరాలు ఆమెకే తెలిసి వుంటాయి. కాని గడుసుది. చాలా తెలివయింది. చెప్పదు. మీరు పిలవమంటే పిలుస్తాను" అన్నాడు గోవిందురెడ్డి.

"లేదు! ఆమె ఎడ్రసు ఇవ్వండి. నేనే కలుస్తాను!" అన్నాడు సాయిబాబా.

ఆమె ఎడ్రసు ఇచ్చాడు గోవిందురెడ్డి.

సాయిబాబా ఎడ్రసుకేసి పరీక్షగా చూశాడు.

"సాలిగ్రామంలో వుంటుందా?" అనడిగాడు మరోసారి చూసి.

"అవునండి!"

"మీకేం భయంలేదు. అసలు ఇలాంటి విషయాల్లో ఇన్వెస్టిగేట్ చెయ్యవలసింది మేం....పోలీసులకేం తెలుసు? మేం ఫలానాచోట వున్నాడు పట్టుకోండి అంటే వాళ్ళు తీసుకొస్తారు. బైదిబై—గోవిందురెడ్డిగారూ! మిమ్మల్ని కిరణ్ కలవొచ్చు! క్రాస్ ఎగ్జామిన్ చెయ్యొచ్చు! బెదిరించొచ్చు. మీరేం అధైర్యపడకండి. భీమానాయుడికి అమ్మాయిల పిచ్చి వుంది కదా. ఏ అమ్మాయితో మీ హోటల్కి ఎక్కువసార్లు వచ్చాడో, ఎవరితో ఎక్కువ గడిపాడో ఆమె పేరు యెడ్రసు సేకరించండి. మరోసారి ఫైవ్ జీరో ఫోర్ని బాగా వెదికించండి. ఏవయినా ఆధారాలు దొరకచ్చు!" అన్నాడు సాయిబాబా సిగరెట్ అంటించుకొని. తర్వాత జులపాలు సవరించుకొని టవల్తో మొహం తుడుచుకున్నాడు సాయిబాబా చేతిలో 'హోటల్ హెవెన్' కవరు పెట్టి

వెళ్ళిపోయాడు గోవిందు రెడ్డి.

సాయిబాబా కవరు చింపి చూశాడు. అందులో ఒక లెటరుంది. పది వందరూపాయనోట్లున్నాయి.

"మె ఐ కమిన్!" అంటూ తలుపుతట్టిన చప్పుడు.

"య్యాస్....కమిన్!" అన్నాడు సాయిబాబా హుందాగా.

"ఇన్స్పెక్టర్ కిరణ్!" అన్నాడు గొణుక్కుంటూ.

"య్యాస్ ప్లీజ్....కన్ ఐ సిట్ హియర్!" అన్నాడు కిరణ్.

చేతిలో డబ్బుని తడబాటుగా జేబులో వుంచుకున్నాడు సాయిబాబా.

"ఏమిటిలా దయచేశారు?" అన్నాడు గౌరవంగా సాయిబాబా.

"మీ సహాయం కావాలి!"

"నా సహాయమా! మీకా!....మీరు పెద్ద ఇన్స్పెక్టర్ కదా!"

"మీకంటే కాదులెండి!"

"పొగుడుతున్నారు...." అంటూ పెద్దగా నవ్వాడు-కాదు-నవ్వడానికి ప్రయత్నించాడు సాయిబాబా.

"మీకు గిరాకీ బాగా వున్నట్లుంది!" అన్నాడు కిరణ్ పాకెట్‌లో వందరూపాయి నోట్లమీద చూపు నిలిపి.

"మ్చి....మ్చి....ఆ.... చెప్పండి గురువుగారూ! ఏమిటి కాఫీయా హార్లిక్సా... కూల్ డ్రింకా..హాట్ మీకు పట్టదు కదా!" అన్నాడు సాయిబాబా చనువుగా.

"భీమానాయుడు అనే ఫిలిం ప్రొడ్యూసరు మీకు తెలుసుకదూ?"

"విన్నాను!"

"ఆయన ఆత్మహత్య చేసుకున్నాడు!"

"అదీ విన్నాను!"

"ఆత్మహత్య కాదని నా అనుమానం!"

"ఇది కూడా విన్నాను!" అన్నాడు తలూపుతూ.

"ఎవరు చెప్పేరు?" సడన్ గా రివర్సయ్యాడు కిరణ్.

"ఏమంటారు?" అంటూ తృప్తిపడిసర్దుకోటానికి ప్రయత్నిస్తూ.

"ఇప్పుడే ఎవరో క్లయింట్ వచ్చి వెళ్ళాడు. మాటల సందర్భంగా.... ఊరికే పిచ్చాపాటిగా దొర్లాయి ఇవన్నీ" అంటూ చిన్నగా నవ్వాడు.

"హోటల్ హెవెన్ ప్రొప్రయిటరు గోవిందురెడ్డి తెలుసా?"

"తెలుసా? అంటే తెలీదు. తెలీదా అంటే తెలుసు. మనకేం పనుంటుందండీ హోటల్ ప్రొప్రయిటర్స్ తో- చాలా మంచివాడని విన్నాను!" అన్నాడు త్రిబుల్ ఫైవ్ నోట్లో పడేసుకొని.

"ఆయన మంచితనంమీద మీకు నమ్మకం వుందా?"

"అందరూ అనుకొంటున్నది వినడమే తప్ప మనకి పూర్వాపరాలు ఏం తెలుస్తాయి చెప్పండి! దిగితేనేగా 'లోతు' తెలిసేది" అన్నాడు. సాయిబాబా.

"ఆయనే ఈ హత్య చేసినట్లు నా అనుమానం!" అన్నాడు సాయిబాబా మొహంలో మరీ రంగుల్ని గమనిస్తూ.

"ఎందుకు చేసాడంటారు?"

"అదే మీరు తేల్చుకోండి. మీ సహాయం ఇందులో కావాలి!"

"ఆయన రూమ్‌లో దొరికిన డైరీలో తనే స్వయంగా ఆత్మహత్య చేసుకుంటున్నట్లు వుందిట కదా!"

"ఎవరు చెప్పేరు?"

"ఆ..ఆ..ఇందాక మీ రాకముందు ఓ క్లయింట్‌తో పిచ్చాపాటీ మాట్లాడుతుంటే దొర్లింది."

"మీ క్లయింట్ ఇంకా ఏం చెప్పేడు?"

"ఈ విషయాలన్నీ ఆయనకేం తెలుస్తాయి. బయట విన్నది చెప్పాడు. ఇంతకీ ఆ డైరీలో ఏం వుందిట?"

"ఆత్మహత్య చేసుకుంటున్నానని వుంది!"

"ఆయనే ఆత్మహత్య చేసుకోవొచ్చుగా! పైగా మనిషి బాగా దేనికైనా తెగించినవాడని విన్నాను!"

"ఎవరు చెప్పారు?" కిరణ్.

ఈసారి సాయిబాబాకి చిరుకోపం ముంచుకొచ్చింది.

"ఎవరు చెప్తారండీ. కోర్టులో ముద్దాయిని అడిగినట్లు అన్నిటికి సాక్ష్యాలూ, ఆధారాలూ అడుగుతారు. కావలసినవారు కదా ఈ కేసుని హేండిల్ చేసింది మీరు కదా అని వృత్తి ధర్మంతో మాట్లాడుతాం. మేం విన్నది మాట్లాడుతాం. అనుకున్నది మాట్లాడుతాం" అన్నాడు సాయిబాబా.

కిరణ్ చిన్నగా నవ్వాడు. ఆ నవ్వు సాయిబాబా గుండెల్ని దొలిచేసింది.

"సాయిబాబాగారూ! తనే ఆత్మహత్య చేసుకొంటున్నట్లు రాశాడు. కాని రైటింగ్‌లో 'మార్పు' వుంది. ఎవరో కావాలని ఈ హత్యచేసి తన హేండ్‌రైటింగ్ స్టైయిల్‌తో వారికి కావల్సిన మేటరురాసి హత్యచేసారని నా అనుమానం!" అన్నాడు కిరణ్.

"మీకభ్యంతరం లేకపోతే ఆ డైరీ చూపించండి!"

"ఓ ష్యూర్!" అంటూ డెయిరీ అందించాడు. డెయిరీ పరిశీలనగా చూసి, చివరి పేజీ చదివాడు. ఆద్యంతమూ, మరోసారి చదివేడు సాయిబాబా.

"ఇందులో నాలుగయిదు హాండ్ రైటింగ్ లతో డెయిరీ రాసివుంది. చివరి పేజీలోని హాండ్ రైటింగ్ మధ్య పేజీల్లో కొన్నిచోట్ల వున్న హాండ్ రైటింగ్ కి ఈక్వల్ గావుంది గనుక—ఆయనే మనసు బావున్నప్పుడు స్పష్టంగా, చికాగ్గా వున్నప్పుడు గజిబిజిగా ఎందుకు రాసి వుండకూడదు?" అన్నాడు సాయిబాబా ఏదో పాయింట్ అందించినట్లు ఫీలయ్యి.

"నిజమే! చివరి పేజీ చూడండి! మీరన్న ప్రకారం కాన్సెపట్లో ఆత్మహత్య చేసుకుంటాడనగా రాసింది. చాలా అందంగా వుందే. దీని మాటేమిటి?" అన్నాడు కిరణ్.

"ఆరిపోయేముందు ఏ దీపమైనా బాగా వెలుగుతుం దండీ!"

"మీరు చాలా 'బ్లయిండ్'గా మాట్లాడతారు. మిస్టర్ సాయిబాబాగారూ! భీమానాయుడుగారు ఆత్మహత్యా ప్రయత్నం చేసింతర్వాత అన్ కాన్షియస్ గా వుంటు న్నప్పుడు రాసివుంటాడా ఈ పేజీలో తను చని పోతున్నానని తన చావుకు ఎవరూ బాధ్యులుకారని."

"ముందే ఎందుకు రాసి వుండకూడదు!"

"కరెక్టు! ఈ డెయిరీ మీరు పరీక్షగా చూడలేదు. భీమానాయుడి అభిరుచుల దృష్ట్యా, ఏదయినా క్రియా రూపంలో జరిగిం తర్వాతే డైయిరీలో రాసేవాడు.... చూడండి. ప్రతి సెంటెన్స్ పాస్టెన్స్ లో వున్నై. ఫలానా వారిని కలిశాను. ఫలానావారితో మాట్లాడాను.

ఫలానా ఊరు కేంప్ వెళ్ళి వచ్చాను. ఏదీ ముందు రాసించి లేదు. దీన్నిబట్టి ఏదయినా ఒకపని పూర్తిగా జరిగిం తర్వాత, దానిగురించి చెప్పడంగాని, రాయడంగాని చేస్తాడన్నమాట ఈయన!" అన్నాడు కిరణ్.

సాయిబాబా మౌనంగా వుండిపోయాడు.

"సాయిబాబాగారూ! మీరు హోటల్‌కి సంబం ధించినంతవరకూ స్టాఫర్స్‌ని, మెనేజిమెంట్‌ని టేకిల్ చేయండి. నేను మిగతా విషయాలు చూసుకుంటాను. భీమానాయుడు చనిపోయేముందు రోజు తిరుపతినుండి వచ్చాడని మొక్కుబడి చెల్లించాడని తెలుస్తుంది, ఈ లెటరు ద్వారా."

"అయ్యయ్యో.... వెంకన్నబాబు దర్శనం చేసుకొచ్చి 'ఆత్మహత్య' చేసుకున్నాడా?" అన్నాడు సాయిబాబా బాధగా.

"నేను వస్తాను సాయిబాబాగారూ! మీరీ విషయంలో పూర్తి సమాచారం అందిస్తారు కదూ?" అన్నాడు ఇన్స్‌పెక్టర్ కిరణ్.

"అదేమిటండీ అలా మాట్లాడతారు. అభివృద్ధిలోకి రావలసినవారు. రేపు మీ అవసరం నాకుంటుంది. నా అవసరం మీకుంటుంది. మనం మనం ఒకరికొకరం చేయి చేయి కలిపి సాయపడకపోతే ఎలా?" అంటూ గలగలా నవ్వాడు.

ఇన్స్‌పెక్టర్ కిరణ్ హుందాగా నడిచాడు. సాయిబాబా కిరణ్ వెడుతున్నకేసి అలా చూస్తూ వుండి పోయాడు—

"ఆఫ్‌ట్రాల్ ఒక పోలీసు....కొండంత డిటెక్టివ్‌ని

చులకనగా మాస్తాడు! సాయం చేయాలట సాయం! కాళ్ళ దగ్గరికొచ్చాడు—కాళ్ళు బేరలాడ్డానికి. ఏచోస్తాడు! డైరీలో క్లియర్ గావుండ. నాకు అప్పలున్నై తీర్చుకోలేక ఛస్తున్నాను, బాబోయ్! అంటే నమ్మదేమిటి? పైగా తిరుపతి వెళ్ళి వచ్చినవాడు అబద్ధం ఎందుకు రాస్తాడు? వీడికి గోవిందు రెడ్డి గారిమీద అనుమానం. వీడు ఎలాగో గోవిందు రెడ్డిని 'లాకప్'లో వుంచుతాడు.

ఇది హత్యకాదు, 'ఆత్మహత్య'ని నిముషాలమీద తేల్చి, గోవిందుగార్ని అనవసరంగా లాకప్‌లో వుంచినందుకు పరువు నష్టందావా వేయించి, ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తే నేగాని నా పేరు సత్య సాయిబాబా కాదు!" శపథం చేశాడు.

"ఏవిటి సార్! మీలో మీరే మాట్లాడేసుకుంటు న్నారు?" జ్ఞానానందం శిష్యపరమాణువు అడిగాడు.

"మాట్లాడుకోవడం కాదురా! గుండె మంట. వీడు నాపాలిట మృత్యువులా దాపురించాడు. వీడు వచ్చిం తర్వాత నాకు ఒక కేసూ రాలేదు. ఆ సంగతి నీకు తెలుసుకదా. కారులో పెట్రోలుందా?" అన్నాడు సడన్‌గా గురువు తెచ్చుకొని.

"ఎందుకు సర్?" అన్నాడు శిష్యుడు.

"ఎందుకేటి—నన్ను తగలబెట్టుకోడానికి — సాలీ గ్రామం పోవాలోయ్. ఒక కేసు తగిలింది. గోవిందు రెడ్డిగారు నామీద నమ్మకంకొద్దీ వెయ్యిరూపాయలు అడ్వాన్స్ ఇచ్చాడు. ఇదిగో వంద పెట్రోలు ప్లస్ నా ఖర్చులుకి. తొమ్మిదివందలు అమ్మగారికి తగలబెట్టు— మనం వెడుతున్నాం!" అన్నాడు దర్జాగా!

"నేనూ రావాలా సార్!"

"నువ్వెందుకోయ్ పీనుగా! పో. చావు—" అంటూ హుషారుగా బయటికి నడిచి హెరాల్డులో కూర్చొని, కారు స్టార్టుచేశాడు. చాలా సేపు మొండికేసి సాయిబాబా అవస్థ చూడలేక కదిలింది హెరాల్డ్ సాలిగ్రామం కేసి.

సాయిబాబా మెదడు ఆలోచనల కేసి పరుగు తీస్తున్నాయ్!

## 5

"మిస్ లీలారావ్ యిల్లు ఇదేనా?" అన్నాడు సాయిబాబా అడ్రసు సరిజూసుకొని. లోపల్నుంచి తెల్ల లంగా, తెల్ల కోక తెల్ల జాకెట్ మల్లెపూలతో ఒకామె వచ్చింది. "ఎవరు కావాలండీ మీకు?" అనడిగింది.

"మిస్..లీలారావ్. రిసెప్షనిస్టు హోటల్ హెవెన్" అన్నాడు సాయిబాబా.

"నేనే — ఏం కావాలి మీకు?" అంది కుర్చీ చూపిస్తూ.

సాయిబాబా కూర్చున్నాడు. సిగరెట్ ముట్టించాడు. పొగ రింగులు రింగులుగా వదలాలని ప్రయత్నించి ఫెయిలయిపోయాడు.

"నేను బయటికి వెళ్ళాలి. నాకు వేరే ఎంగేజ్ మెంట్ వుంది!" అంది టైమ్‌చూసుకొని మిస్ లీలారావ్.

"యెక్కడికెడుతున్నారు?" అన్నాడు.

"ఏం మీరు వస్తారా! విషయం చెప్పండి. డోంట్ వేస్టుది టైమ్!" అంది సీరియస్‌గా మొహం పెట్టి.

సాయిబాబా షాక్ తిన్నాడు. తను పరిశోధకుడుగా పాతికేళ్ళ అనుభవాన్ని నింపుకున్నాడు. ఎన్నో కేసులు గెలిచినా, ఓడిపోయినా, చవిచూశాడు. లీలారావ్ లాంటి కేసు తగల్లేదు. మాటకు మాట సమాధానం చెప్పడం.

ఎటో చూస్తూ చెప్తుంది. పైగా టైమ్ వేస్టు అంటుంది.

"అమ్మాయ్! నేను ప్రఖ్యాత డిటెక్టివ్ సాయి బాబాని. నన్ను తెలుసా?" అన్నాడు పొగవదులుతూ.

"తెలీదండీ!"

ఖంగుతిన్నాడు.

"నువు పనిచేస్తున్న హోటల్లో ఫైవ్ జీరో ఫోర్‌లో భీమానాయుడు చనిపోయాడు. అది హత్యో, ఆత్మ హత్యో నీకు తెలుసా?" అన్నాడు సీరియస్‌గా.

"నేను డిటెక్టివ్‌ని కాదండీ!"

మళ్ళీ ఖంగుతిన్నాడు. సర్దుకొంటూ "ఐ మీన్ నీకు భీమారావు గురించి తెలుసా?" అన్నాడు.

మాటిమాటికి నువ్వు, నువ్వు అంటుంటే మిస్ లీలా రావ్‌కి వళ్ళు మండింది. పోనీ తండ్రిలాంటివాడు—పరధ్యానంగా మాట్లాడుతున్నాడు కదాని ఒకటి రెండుసార్లు ఊరుకుంది. ఇక సహించలేకపోయింది.

"ప్లీజ్....గివ్ రెస్పెక్టు అండ్ టేక్ రెస్పెక్టు!" అంది సీరియస్‌గా.

తడబడ్డాడు సాయిబాబా.

"ఇదేమిటి—నేను ప్రఖ్యాత డిటెక్టివ్‌నని చెప్పినా ఇంత చీప్‌గా మాట్లాడుతుందేవిటి?" బయట అనలేక లోపలే అనుకున్నాడు.

"మీకు కావల్సిన ఇన్‌ఫర్మేషను ఏమిటో అడగండి. అయిదు నిముషాల్లో ముగించేద్దాం. అవసరమనుకుంటే తర్వాత కలుద్దాం. ప్లీజ్ ... మరోలా అనుకోకండి. నాకు వేరే ఎంగేజ్‌మెంట్ వుంది—" అంది లీలారావ్ సభ్యతగా చెబుతూ.

తన జీవితకాలంలో ఒకర్ని ప్రశ్నలువేయడం—వారు

సమాధానం చెప్పలేక తలదించుకోవడంలాంటివి ఎన్నో జరిగేయి గాని—ప్రశ్నలడగండి అని ఎదిరించి అడగడం తను తలదించుకోవడం ఇదే ఫస్టు టైమ్.

"ఏమయినా నువ్వు చాలా తెలివయినదానివమ్మా!" అన్నాడు మెచ్చుకుంటూ సాయిబాబా.

"ఇది ప్రశ్న కాదనుకుంటాను!"

"బయటికెళ్ళి మీరు యెంతసేపట్లో వస్తారు?" సాయిబాబా టైమ్ చూసుకుంటూ అడిగాడు.

"ఇదేనా మీరడగవలసిన ప్రశ్న?" అంది.

తడబడ్డాడు.

"ఇదికాదు. చాలా వున్నై. అయితే నేను బిజీగా అడగవలసినవీ....నువ్వు....సారీ మీరు....గజిబిజీగా చెప్ప వలసినవీ కావు. పర్సనల్ గా—సాధ్యమైనంత టైమ్ తీసుకొని అడగాలి. మీ....మీరు చెప్పాలి!" అన్నాడు మొహాం మూడో అంకెలా పెట్టి.

"సరే మిమ్మల్ని కలవమంటూరా! నన్ను కలుస్తారా?" అడిగింది ధైర్యంగా.

"వయసయిపోయింది కదమ్మా....నువ్వే .... మీరే కలిస్తే బావుంటుంది!" అన్నాడు విజిటింగ్ కార్డు అందిస్తూ.

"థాంక్యూ—ఐ షల్ మీట్ యూ!" అంటూ బయటికి నడిచింది.

"మీ కభ్యంతరం లేకపోతే....మీరు యెక్కడికి వెడతారో చెప్తే డ్రాప్ చేస్తాను!" అన్నాడు సన్నగా నవ్వుతూ.

"నో థాంక్యూ మీతోబాటు మీ కారునీ శ్రమ

పెట్టడం నాకిష్టంలేదు!" అంటూ విసురుగా వెళ్ళి పోయింది.

## 6

"హేపీ బర్త్ డే టుయూ!" అంటూ అందరూ పాడుతున్నారు. ఇన్స్పెక్టర్ కిరణ్ ఇన్వైటర్స్ అందర్నీ పరిశీలనగా చూడసాగాడు. అందరూ ఆనందంగా పాట మీద దృష్టి నిలిపి బ్లెస్సింగ్స్ యిస్తున్నారు. కిరణ్ చూపు ఒకచోట ఆగింది—

ఎర్రటి పట్టుచీర, ఎర్రటి ముద్ద మందారంలాంటి జాకెట్, ఎర్రరాళ్ళ లాకెట్. మొత్తం యెరుపు. ఆకాశంలో సంధ్యలాగా ఒక అందమైన యువతి ఆమె.

కిరణ్ ఆమె దగ్గరకు వెళ్ళాడు.పరిశీలనగా చూసాడు.

"మే ఐ నో యువర్ స్వీట్ నేమ్ ప్లీజ్!" అనడిగాడు.

"ష్యూర్—మై నేమ్ ఈజ్ సంధ్య" అంది కిరణ్ ఆలోచనకి అతికినట్టు.

"ఫెంటాస్టిక్!" అన్నాడు ఆమె అందానికి తగ్గట్టు పేరున్నందుకు మరోసారి చూపులతోనే అభినందించి

"ఐయామ్ మిస్టర్ కిరణ్—యు మే నో మై ప్రొఫెషన్!" అంటూ తన శ్రీమతి జ్యోతి వంక చూశాడు. జ్యోతి నవ్వుతూ పలకరించింది.

"మిస్ లీలారావ్ ఇంకా రాలేదా?" అంది సంధ్య.

కిరణ్ ఆలోచనలోపడ్డాడు.

"ఆమె వస్తానని మీతో చెప్పేరా?"

"అవునండి—ఆమె మిమ్మల్ని కలుస్తానంది. మీ పాప లక్ష్మికి బర్త్ డే అని కూడా ఆమే చెప్పింది!" అంది సంధ్య ముద్దుగా.

సంధ్యని అందరూ వింతగా చూడసాగారు. సంధ్య క్రొత్త హీరోయిన్. ఇపుడిప్పుడే ప్రముఖ సంస్థలన్నిటిలోనూ నటిస్తోంది. 'జ్యోతి' అందరికీ స్వీట్సూ, డ్రింక్స్ ఆఫర్ చేయడంలోని నిమగ్నమైంది.

"సాక్ ఫర్ ది లేట్!" అంటూ మిస్ లీలారావ్ ఫ్లవర్ బుకే తీసుకొని వచ్చింది—కిరణ్ లీలారావ్ మొహంలోకి కాస్సేపు తీక్ష్ణంగా చూశాడు. లీలారావ్ చలించలేదు. చిరునవ్వుతో ఆ చూపుల్ని రిసీవ్ చేసుకుంది.

"విష్ యు మెనీ మెనీ హాపీ రిటెన్స్ ఆఫ్ ది డే!" అంటూ బుకే అందించి ఓ గోల్డు రింగు పాపచేతికి తొడిగింది.

సంధ్య కూడా ఓ గోల్డు చెయిన్ తీసి పాప మెళ్ళో వుంచబోయింది.

"నో మేడమ్—థాంక్యూ వెరీ మచ్!" అంటూ ఛెయిన్ తిరిగి ఇచ్చేశాడు. రింగు కూడా తీసి మిస్ లీలారావ్ చేతిలో వుంచాడు.

"మీనుండి బహుమతులను తీసుకొనే అదృష్టం ఈ జన్మకు నాకు ఉండదనుకుంటాను. బికాజ్ ఐయామ్ ఎ పోలీసాఫీసర్!" అన్నాడు సిన్సియర్ గా.

భారంగా నిట్టూర్చారు ఇద్దరూ.

"మీకు ఇవ్వడం లేదండీ—పాపకిస్తున్నాం దీన్ని. వద్దనే అధికారం మీకులేదు. ఇది మా ప్రేమకు చిహ్నం" అంది లీలారావ్. సంధ్య ఆ మాటల్ని సపోర్టు చేస్తున్నట్లు తలూపింది.

"సో సారీ..రండి. టెర్రస్ మీద మాట్లాడుకుందాం!" అంటూ టెర్రస్ మీదకి దారితీశాడు.

టెర్రస్ మీద అందమైన మల్లెపందిర వుంది. చల్లటి

గాలికి మత్తెక్కించే 'ఘుమ-ఘుమ' సువాసనలు వేద జల్లుతున్నై మల్లెలు.

లీలారావ్, ఇన్స్పెక్టర్ కిరణ్‌ని చూస్తోంది. డ్రస్సులో చూసిందానికి మఫ్టీలో చూసిందానికి ఎంతో తేడావుంది.

కిరణ్ చాలా అందగాడు. సమ్మోహితుల్ని చేసే అందగాడు. చూపులు చాలా షార్ప్‌గా వుంటాయి. ఆయన ప్రతి కదలికకీ ఏదో ఒక అర్ధం వుంటుంది. కిరణ్‌కి తగ్గ భార్యకాదు జ్యోతి—పాత చింతకాయ పచ్చడిలా వుంది. అందంగానైనా లేదు. అంతే మరి. అది సృష్టిలో వింత! అనుకొంటూ నిట్టూర్చింది.

"చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్ — దేన్ని గురించి?" అనడిగాడు కిరణ్ టీ ఆఫర్ చేస్తూ.

సంధ్య టీ 'సిప్' చేస్తూ "ఈ వాతావరణం లీలకి బాగా నచ్చివుంటుంది!" అంది.

"నో....నో....ఇంకేదో థింక్ చేస్తూ వుండొచ్చు. మా పాపకి బర్త్‌డే అని మీకెలా తెలుసు?" లీలారావ్‌ని అడిగాడు.

"మీ రాజాగారు చెప్పేరు—"

"ఎప్పుడు?"

"రెండు గంటల క్రితం మీ కోసం ఆఫీసుకు ఫోన్ చేశాను. సబ్ఇన్స్పెక్టర్ రాజా స్పీకింగ్ అన్నారు. వివరాలడిగాను. చెప్పేరు—" అంది క్లుప్తంగా.

"మరి ఫంక్షన్‌కు ఎర్లీగా రావొచ్చు కదా!"

"రావొచ్చు—రావాలనే బయలుదేరాను. డిటెక్టివ్ ఎదురయ్యారు. నాకొన్ని అనుమానాలున్నాయి— అడుగుతాను అమ్మాయీ! అన్నారు. అడుగు నాన్నా

అన్నాను. అంతే — కంగారుపడిపోయి ప్రోగ్రాం పోస్టుపోన్ చేసుకున్నారు. మరీ ఫిలిం జర్నలిస్టుల్లాగా తయారయ్యారు డిటెక్టివ్‌లు" అంటూ పగలబడి నవ్వింది. ఆమె నవ్వుతుంటే ఆమె ఎదమీద అందమైన విరుపులు కనిపించాయి. మల్లెపందిర కదులుతున్నట్లనిపించింది కిరణ్‌కి.

"అన్నట్లు సంధ్యగారి గురించి సంక్షిప్తంగా చెప్పాలి. వీరు భీమానాయుడుగారి పిక్చర్‌లో, ఫస్ట్ టైమ్ యాక్టు చేశారు. మంచి పేరొచ్చింది. సెకండ్ పిక్చర్‌లోను వీరే డబుల్ వెర్షన్స్ బోత్ తెలుగు అండ్ టమిల్‌లో యాక్టు చేశారు హీరోయిన్‌గా. బాగా పోయింది. హండ్రెడ్ డేస్ అయ్యింది కదూ!" సంధ్య కేసి చూస్తూ అడిగింది లీలారావ్.

సంధ్య అవునన్నట్లు తలూపింది.

"సంధ్య నాకు బెస్టు ఫ్రెండ్. బైదిబై — భీమానాయుడుగారంటే ఆమెకు అమితమైన ప్రేమ. ప్రేమా ఇన్ ది సెన్స్ భక్తి, గౌరవం. అసలు ఆత్మహత్య చేసుకున్నారంటే నమ్మటంలేదు. చెప్పు సంధ్యా!" అంటూ సంధ్యను కదిలించింది లీలారావ్.

"అవునండీ. నాకు ఆయనే లైఫ్ ఇచ్చారు. ఆయన నన్ను ఇంట్రడ్యూస్ చేసివుండకపోతే ఈ రోజు నేనీ సిటీలో వుండేదాన్ని కాను. ఆయన సడన్‌గా చనిపోవడం రియల్లీ ఇట్స్ లాస్ టు మీ!" అంది కళ్ళల్లో తిరుగుతున్న నీరు తుడుచుకుంటూ. ఈమాటలు చెబుతున్నప్పుడు సంధ్య మొహం ఎర్రగా కందగడ్డలా కంది పోయింది—

"సార్ మీకోసం ఫోను!" అంటూ బాయ్ పిలిచాడు

కిరణ్ ని—కిరణ్ ఆఫీసు రూమ్‌కు పరుగులాంటి నడకతో వెళ్ళాడు.

"యస్ స్పీకింగ్!" అంటూ రిసీవర్ ఎత్తాడు.

"సార్ సార్.... నేను రాజుని మాట్లాడుతున్నా. భీమానాయుడుగారు చనిపోయే రోజునే అయిదు లక్షల రూపాయలు ఇన్సూరెన్స్‌నుండి డ్రాప్ చేశారట సర్!"

"అవును తెలుసు!"

"తెలుసా సర్!" రాజు కాస్సేపు మాట్లాడలేక పోయాడు.

"ఆ రోజే తెలుసు. పంజాబ్ నేషనల్ బ్యాంకులో నుండి మరో లక్షరూపాయలు డ్రా చేసినట్లు తెలుసు. అంతకు రెండ్రోజులు ముందు తను తీయబోయే పిక్చరుకి అడ్వాన్సుగా సీడెడ్, నైజాం డిస్ట్రిబ్యూటర్ల దగ్గర్నుండి మరో మూడు లక్షలు తీసుకున్నాడని తెలుసు. అందుకే మనం ఇంత సీరియస్‌గా ఇన్వెస్టిగేట్ చేయవలసిన పరిస్థితి. భీమానాయుడు ఆత్మహత్య చేసుకోలేదు. ఎవరో హత్యచేశారు. హత్యచేసినవారు దొరికితే డబ్బు వారి దగ్గరే వుంటుంది—"

"ఈ విషయాలన్నీ మీకు ముందే తెలుసా సర్!" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఈ కేసు విషయంలో ఇంకా చాలా విషయాలు తెలుసు. యెవరికీ తెలియనివి మనం సేకరించడమే ఇన్వెస్టిగేషనంటే—నువ్వు వెంటనే బయలుదేరు! హోటల్ దగ్గరుండు. డిటెక్టివ్ సాయిబాబా వుంటాడు. ఈ పరిశోధన డిస్టర్బ్ కాకుండా ఆయన సహాయం కోరినట్లు నాటకం ఆడాను. ఆయన్ని ఫాలో అవ్వు! రూమ్ తాళాలు మాత్రం తీయనీయొద్దు. గోవిందరెడ్డిని మాత్రం

యెక్కడికీ కదల్నీయొద్దు.... లేబరేటరీ దగ్గర మన త్రీ జీరో సిక్స్ననీ, టు జీరో సెవన్నీ మరో ఇద్దరు కానిస్టేబుల్స్ననీ వుంచు! కేసు అండర్ ఇన్వెస్టిగేషన్ అని కలెక్టరేట్ కీ, డి.ఐ.జి.గారికీ ఇన్ ఫామ్ చేయి. పోస్టుమార్టమ్‌కి మరో కొన్ని గంటల్లో డెడ్ బాడీని ఎలవ్ చేస్తామని డి.ఎమ్.ఓకి ఫోన్ చెయ్యి. మిస్టర్ రాజూ మైడియర్! హర్రియప్!" అంటూ ఫోను పెట్టేశాడు.

టెర్రస్ మీద లీలారావ్, సంధ్య మౌనంగా కూర్చున్నారు ఏం మాట్లాడుకోకుండా. "సాకీ బోరు కొట్టించానా!" అంటూ స్వీట్ నోట్లో పెట్టుకున్నాడు.

"లీలారావ్ గారూ! ఆ రోజు మే ఫస్టు భీమారావు గారు మీ హోటల్లో దిగినప్పుడు చేతిలో బ్రీఫ్‌కేసు వుందా?"

"వుంది!" అంది లీలారావ్.

"బ్రౌన్ కలర్ అరిస్టోక్రాట్."

"యు గాట్ వెరిగుడ్ రిమెంబరెన్స్" కాంప్లిమెంట్స్ చెప్పేడు.

"ఇట్స్ డ్యూటీ!" అంది చిరునవ్వుతో.

"సంధ్యగారూ మీరు మాట్లాడండి!" కదిలేశాడు కిరణ్.

"మీరు చెప్పండి యేదయినా—" అంతవరకూ మౌనంగా వుండి. ఇబ్బందిగా అంది.

"కిరణ్ గారూ! లెట్స్ డు ఒన్ థింగ్ — సంధ్య ఇంటికి వెడదాం. అక్కడ మీకు కావలసిన ఇన్‌ఫర్మేషను అందిస్తుంది. డోంట్ వర్రీ. సంధ్య ఈజ్ మై బెస్టు ఫ్రండ్!" అంది లేచి నిలబడి—కిరణ్ ఫాలో అయ్యాడు.

సంధ్య చిరునవ్వుతో వెల్‌కమ్ చెప్పింది ఇష్టంలేక పోయినా—

# 7

"ఇది చాలా ఘోరం మిస్టర్ రాజూ! మనిషి ఆత్మ హత్య చేసుకొని ఇది రెండవరోజు.—లేబ్‌లో శవాన్ని వుంచి దాన్ని కనీసం పోస్టుమార్టమ్ కూడా చేయనీయకుండా, ఈ హోటల్‌లో రూమ్ తెరిపించకుండా, లక్షలకు విలువచేసే హోటల్ బిజినెస్ పాడుచేసి-మీరు, మీ ఇన్‌స్పెక్టర్ గారు హాయ్యర్ అథారిటీస్ పెర్మిషను లేకుండా మీ ఇష్టంవచ్చినట్లు మీరు ప్రవర్తించడం నేరం! ఇలాంటి సమయంలో—మాబోటి అనుభవజ్ఞులు కల్పించుకొని ఏదో పరిష్కారం చెయ్యకపోతే అక్కడ లేబ్ కుళ్ళు కంపు కొడద్ది. ఇక్కడ బిజినెస్ ఆగిపోయి, గోవిందురెడ్డి గుండాగిపోయి బలవంతంగా చస్తాడు— ఇది మరో హత్య అవుతుంది. ఈ కేసులో మీరు, నేను అందరం ఇరుక్కుంటాం. సో— జరగవలసిన కార్యక్రమాలు జరిపించండి!" అన్నాడు సాయిబాబా పెద్దరికం వొలకబోస్తూ.

"చాలా థాంక్సండీ!" అంటూ చేతులు పట్టుకున్నాడు గోవిందురెడ్డి అవ్వే కాళ్లు అనుకోమన్నట్లు చూస్తూ.

"ఇదిగో రెడ్డిగారూ! మీరు కంగారుపడకండి-భీమా నాయుడు చనిపోతూ....పోతూ ఓ పుణ్యం కట్టుకొని పోయారు-ఆయనకి అప్పులున్నాయని-అవి తీర్చలేక చస్తున్నానని-రాసి మరీ పోయాడు. ఇందులో పరిశోధనచేసి కనిపెట్టవలసింది ఏంలేదు. అతగాడు చనిపోయినపుడు పాకెట్‌లో లక్షలున్నాయా? ముష్టి పదివేలున్నాయి.

దీనికింత కంగారు, కన్‌ఫ్యూజన్, హడావుడి పడవలసిన అవసరంలేదు. ఇదుగో రెడ్డిగారు ఇన్ని....ఇన్ని కేసులు చూశాను ఇలాంటివి" అంటూ నెరిసిన వెంట్రుకల్ని పాయగా తీస్తూ చూపించాడు.

"రాజుగారూ! మీకు ఫోను!" అంటూ రిసెప్షనిస్టు ఫోను అందించాడు.

"అదిగో డి.ఐ.జిగారి దగ్గర్నుండయ్యుంటుంది. నేను చెప్పలేదుటయ్యా .... ఇలాంటి కేసులు పెండింగ్‌లో వుంచకూడదని-" అన్నాడు సాయిబాబా.

"నమస్తే సార్! నేను రాజుని .... ఎక్కడ్నుంచి సార్....ఓహో అలాగే సర్!...." అంటూ ఫోను పెట్టేశాడు రాజు.

సాయిబాబా, రాజు మొహంలోకి చూసి నవ్వుకున్నాడు లోలోపల.

"గోవిందురెడ్డిగారూ! మీ హోటల్ బార్బర్ యెవరు?"

యెందు కడుగుతున్నాడో అర్థంకాలేదు గోవిందు రెడ్డికి.

రిసెప్షనిస్టు చెప్పింది "నటరాజన్!" అని.

"ఆయనకి వయసెంతుంటుంది?"

"జస్టు ఇరవై మూడు....ఇరవై నాలుగుండొచ్చు!"

"ఏం చేస్తుంటాడు ఇక్కడ?"

"హెయిర్ డ్రెస్సింగ్!"

"ఏదైనా పార్టుటైమ్ జాబ్ చేస్తుంటాడా?"

"సినిమాల్లో హెయిర్ డ్రస్సింగ్ చేస్తుంటాడు!"

"యెవరికి?"

"తెలీదు!" అడిగిందానికి టకటకమంటూ సమాధానం

చెప్పింది రిసెప్షనిస్టు సరోజ.

"ఆయన్ని పిలిపించండి!" అన్నాడు. రిసెప్షనిస్టు సెలూన్‌కి డయల్ చేసింది. రెస్పాన్స్ రాలేదు. యెంక్వయిరీకి డయల్ చేసింది.

"హలో.... నేను రిసెప్షనిస్టు సరోజ మాట్లాడుతున్నా నటరాజన్ వచ్చాడా?"

"రాలేదు!" అట్నుంచి రిప్లై.

"ఉదయం వచ్చాడా?"

"రాలేదు!"

"నిన్న వచ్చాడా?"

"వచ్చాడు."

"యెంతవరకూ వున్నాడు?"

"ఏమో-నైటు చాలాసేపు వున్నాడు."

వెంటనే కిరణ్ తనకి ఇచ్చిన నెంబరుకి డయల్ చేసి హెయిర్ డ్రస్సర్ నటరాజన్ గురించి ఇన్‌ఫర్మేషన్ అందించాడు.

"ఏం బాబూ! ఏమంటారు కిరణ్‌గారు?" అర్థం కానట్లు అడిగాడు సాయిబాబా.

"ఇక్కడికే వస్తున్నారు!"

"ఇక్కడికే వస్తున్నారా!" అంటూ దిగాలు పడిపోయాడు గోవిందురెడ్డి - సాయిబాబా కళ్ళు గిర్రున తిరిగాయ్.

# 8

కిరణ్‌కి డ్రింక్ అందించింది మిస్ లీలారావ్.

"చీర్స్" అన్నారు ముగ్గురూ-

సంధ్య, మిస్ లీలారావ్, కిరణ్.

"ఛీర్స్ ఫర్ ది పీస్ ఆఫ్ భీమానాయుడూ!"

అన్నాడు కిరణ్.

సంధ్య నవ్వింది, సిప్ చేసింది. కిరణ్ గొంతు పొంగు తున్నట్లుంది. కొంచెం ఇబ్బందిపడ్డాడు.

"ఈజ్ దిస్ ఫస్టు టైమ్?" అనడిగింది సంధ్య.

"ఆయనకి ఇలాంటి అనుభవం యిదే ఫస్టు టైమ్ అను కుంటాను!" అంది లీలారావ్. ఫస్టు రౌండ్ పూర్తయింది. కిరణ్ కొంచెం పట్టు తప్పాడు.

సెకండ్ రౌండ్ కూడా పూర్తయింది. కిరణ్ మాటలు స్లిప్ అవుతున్నై. థర్డురౌండ్ పూర్తికావచ్చింది. కిరణ్ కి మైకంవచ్చి పడిపోయాడు.

సంధ్య, లీలారావ్ రూమ్‌లోకి వచ్చారు. రూమ్‌లో వున్న పరికంగా ఎ.సి. ఆఫ్ అయింది.

సంధ్యకి ఎ.సి. లేకపోతే చెమట్లు పోస్తుంది. అసలు తట్టుకోలేదు.

"కిరణ్ ఏం చేస్తున్నట్లు?" సంధ్య అడిగింది.

"మత్తుగా తాగాడు చిత్తుగా పడుకున్నాడు!" నవ్వింది లీలారావ్.

"లీలా! ఆయన్ని నిజంగా లోబరుచుకున్నా మంటావా?"

"ఓ.., ఈజీగా!"

"ఎలా చెప్పగలవు?"

"గురుడు అగ్గిలాంటి మనిషి. పచ్చి మంచినీళ్ళు తప్ప ద్రాక్షరసం ముట్టడు. రాయల్ సెల్యూట్ కొట్టేశాడు- ఆడదాని ఓరచూపులో-జగాన ఓడిపోని వీరుడెవ్వడు" అంటూ పాడింది లీలారావ్.

"లీలా! నువ్వు చాలా సాయం చేశావు?"

"నేనేం చేశాను!"

"కిరణ్‌ని బుట్టలో వేసుకున్నావ్. మనమంటే సింపతీ వుండేలా చేశావ్. గోవిందురెడ్డిమీద అనుమానం బలపడింది కదూ!"

"అవును. చంపింది గోవిందురెడ్డేకదా!" అంది లీలారావ్.

"ష్....చంపింది — సంధ్య—" అంటూ నవ్వింది కైపుగా.

ఎ.సి. సడన్‌గా ఆన్ అయ్యింది. చల్లటిగాలి వస్తోంది. ప్రాణం కుదుటపడింది.

"సంధ్యా! భీమానాయుడుమీద నీకెందుకంత పగ!"

"లీలా.... నాయుడ్ని నమ్మాను. రెండు పిక్చర్లో యాక్టు చేశాను. పైసా రెమ్యూనరేషను ఇవ్వలేదు. నన్ను అతను ఇష్టమొచ్చినపుడు మహాబలిపురం తీసుకెళ్ళేవాడు. తన సరదాలు తీర్చుకొనేవాడు. అవసరమయినపుడు నన్ను డిస్ట్రిబ్యూటర్స్ దగ్గరికి పంపించేవాడు. వెళ్ళపోతే చావబాదేవాడు. ఈ మధ్య క్రొత్తరకం వ్యాపారం మొదలుపెట్టాడు. నగ్నంగా డిఫరెంట్ యాంగిల్స్‌లో ఫోటోలు తీయడం — అవి ఫారిన్ డీలర్స్‌కి సేల్ చేయడం!"

"నీ నగ్న చిత్రాలు వాళ్ళకెందుకు!"

"పిచ్చి లీలా! నేకెడ్ నెగిటివ్స్ ఇపుడు వేలకువేలు. మంచివైతే లక్షలు కుమ్మరిస్తారు ఫారినర్స్. ఒక్కరోజు పైసా ఇచ్చిన పాపాన పోలేదు....గత ఆరు మాసాలుగా నా మొహం చూడలేదు. నన్ను రిజిష్టర్ మేరేజ్ చేసుకుంటానన్నారు. ఆ ప్రయత్నం మరిచిపోయారు. కడుపు మండింది. నేను జీవితంలో యెప్పుడూ యెవరిదగ్గరా మోసపోలేదు. నాకు రావల్సింది నేను ఎలా పొందాలో

బాగా తెలుసు. అందుకే ఆ రోజు—"

జరిగినదంతా చెప్పేసింది సంధ్య.

కిరణ్ ఎదురుగా నిలుచున్నాడు. సంధ్య తృళ్ళిపడి లేచింది.

"సంధ్యగారూ మనం వెడదాం పదండి!" అన్నాడు నవ్వుతూ.

"యెక్కడికి?"

"హోటల్ హెవెన్ కి."

"ఎందుకు?"

"చెప్తాగా. ముందు 'నటరాజన్'ని యెక్కడ దాచి పెట్టారో చెప్పండి. మీతో బాటు ఆయన్ను కూడా తీసుకురండి!"

సంధ్యకు కంపనం బయలుదేరింది.

"లీలా వాటీజ్ దిస్!"

"డిసీజ్ మిస్టరీ—సంధ్యా! నటరాజన్ ని పిలువ్—తప్పదు. భీమానాయుడ్ని హత్య చేశానని నువ్వే చెప్పావుగా!" అంది లీలారావ్.

"యూ.... యూ.... డెవిల్" అంటూ లీలారావ్ గొంతు నులిమేయబోయింది.

"షటప్—డు ఏజ్ ఐ సే!" అంది లీలారావ్ సీరియస్ గా.

సంధ్య దగ్గరలోవున్న స్విచ్ ని నొక్కింది—రెడ్ బల్బ వెలిగింది.

రామచిలక కిచకిచమంటూ శబ్దం చేస్తోంది. ఎవరూ రాలేదు.

"యెవరూ రారు మిస్ సంధ్యా! మీ వాళ్ళంతా

జీపుల్లో వున్నారు. క్విక్ నటరాజన్‌ని పిలువ్!" అని అరిచాడు.

"సార్! నటరాజన్ శవం స్టోర్ రూంలో వుంది!" అన్నాడు హెడ్ కానిస్టేబుల్ నీలకంఠం పరుగెత్తుకుంటూ వచ్చి.

"నేను భీమానాయుడ్ని చంపలేదు. నాకూ భీమా నాయుడికీ ఏ సంబంధంలేదు—" అంటూ అరిచింది.

క్రిందికి ఈడ్చుకెళ్ళింది లీలారావ్. కిరణ్ ఫాలో అయ్యాడు, రివాల్వర్ సిద్ధంగా వుంచుకొని—జీపులో సంధ్య, లీలారావ్, కిరణ్ కూర్చున్నారు. జీపు హోటల్ హెవెన్ కేసి బయలుదేరింది.

వెనుక మరో వేన్‌నిండా పోలీసులు ఫాలో అయ్యారు—నటరాజన్ శవంతో—

నీలకంఠం, రామలింగం తదితర సీనియర్స్ అంతా సంధ్యాదేవి ఇల్లు సోదాచేయడంలో నిమగ్నమయ్యారు.

# 9

"నో .... నో .... నాకేం తెలీదు డి.ఐ.జి.గారూ!" అంటూ అరిచింది సంధ్య.

కిరణ్ వచ్చేసరికి హోటల్ హెవెన్‌కు హయ్యర్ అథారిటీస్ అందరూ వచ్చారు. డి. ఐ. జి. భాస్కర్రావుగారు. డి.ఎమ్.ఒ. వరదరాజన్ గారు. ఆర్.డి.ఓ పుష్పదల్ గారు, భీమానాయుడు భార్యా పిల్లలు, భీమా నాయుడు పార్టనర్స్, ఫైనాన్సియర్స్, పంజాబ్ నేషనల్ బాంక్ ఏజెంట్, ఇన్సూరెన్స్ హయ్యర్ అథారిటీస్ సీడెడ్ నైజాం డిస్ట్రిబ్యూటర్స్ అందరూ అక్కడే ముకాం చేశారు.

రాజు చాకచక్యంగా పనిచేసి ఇంతమందిని సమావేశ

పరిచినందుకు ఒక్క క్షణం కృతజ్ఞతగా చూశాడు కిరణ్.

సాయిబాబా మొహంలో నెత్తురుచుక్క లేదు. అలాగే వున్నాడు గోవిందురెడ్డి కూడా. హోటల్ స్టాఫ్ అంతా వింతగా చూస్తున్నారు.

హెయిర్ డ్రెస్సర్ నటరాజన్ శవాన్ని, భీమా నాయుడు శవాన్ని ప్రక్క ప్రక్కగా పెట్టారు.

"సార్! ఈ కేసు పరిశీలనపట్ల చిరంజీవి కిరణ్ తొందరపాటు చూపించాడేమోనని నా అనుమానం. ఇంతవరకూ ఈ హోటల్ ప్రొప్రయిటర్ నా బెస్టు ఫ్రెండు గోవిందురెడ్డి మీద అనుమానం చూపించాడు. సడన్ గా ఆ అనుమానం, మద్రాసుకు రావలసిన ఉప్పెన దీవి సీమకు కొట్టుకు పోయినట్లుగా సంధ్యాదేవికేసి మళ్ళింది.

ఇందులో పెద్దగా ఆలోచించవలసిందేం లేదు. భీమా నాయుడు క్లియర్ గా రాశారు. ఆస్థి నాలుగు లక్షలు. అప్పులు పదహారు లక్షలని. యెక్కడయినా మనకి వెయ్యిరూపాయలు అప్పుంటేనే నిద్రపట్టదు. ఆ మహాను భావుడికి పదహారు లక్షల రూపాయలు అప్పులున్నా యంటే మాటలా! అందువలన ఆయనకి నిద్రపట్టక నిద్ర మాత్ర లేసుకొని ఆత్మహత్య చేసుకున్నారు.

ఇప్పుడయినా మించిపోయిందేమీ లేదు. ఈ కేసు విచారణ జరపవలసిన సరైన సమయం ఇదే. పెద్దవాళ్ళున్నారు. ఆయన భార్యగారున్నారు. ఆయన పిల్లలున్నారు. ఆ శవాన్ని పోస్టుమార్టమ్ జరిపించి, మిగతా కార్యక్రమాలు పూర్తిచేస్తే చనిపోయిన ఆయన ఆత్మకు శాంతి!" అంటూ ఉపన్యాసం ముగించాడు సాయిబాబా.

అందరి దృష్టి కిరణ్ మీద నే వుంది.

కిరణ్ కి మంచి పేరుంది. తను హేండిల్ చేసిన ఏ కేసు ఫెయిలవ్వలేదు. డి. జి. ఐ. సీరియస్ గా చూశాడు కిరణ్ కేసి.

"థాంక్యూ వెరీ మచ్ మిస్టర్ సాయిబాబాగారూ! మీరు ప్రఖ్యాత డిటెక్టివ్ లు. మీ అనుభవంతో ఇచ్చిన ఉపన్యాసానికి జోహారు. మరి హోటల్ హెవెన్ సెలూన్ హెయిర్ డ్రస్సర్ నటరాజన్ శవం మాటేమిటి! నటరాజన్ శవంకీ, సినీ నటి సంధ్య స్టోర్ రూమ్ కీ ఏమిటి సంబంధం? దీనికి మీ సంజాయిషీ" అని నిలదీశాడు కిరణ్.

సాయిబాబా నోరు పెగల్లేదు.

ఇంతలో హెడ్ కానిస్టేబుల్ నీలకంఠం, రామలింగం తదితరులు జీపులో వచ్చారు. కొన్ని డెయిరీలు, ఒక బ్రౌను బ్రీఫ్ కేసు తీసుకువచ్చి అందరిముందు వుంచారు.

మిస్ నీలారావ్ కళ్ళు మెరిశాయి. ఆ రోజు తను చూసిన బ్రీఫ్ కేసు అదే. ఆ విషయమే గట్టిగా చెప్పింది.

"డియర్ జంటిల్ మెన్! మే ఫస్టు నైట్ న—ఈ హోటల్ హెవెన్ రూమ్ నెంబర్ ఫైవ్ జీరో ఫోర్ లో భీమానాయుడు రూమ్ తీసుకొన్నాడు. ఈ డెయిరీలో రాసినట్లు—ఆ రోజు తిరుపతి వెళ్ళలేదు. సప్తగిరి ఎక్స్ప్రెస్ లో తిరిగిరాలేదు. పంజాబ్ నేషనల్ బ్యాంక్ లో లక్ష రూపాయలు డ్రా చేసినట్లుగా ఏజెంట్ మిస్టర్ ముత్తురామన్ గారు సాక్ష్యం. యామై ఒ.కే. మిస్టర్ ముత్తూజీ!" అని గంభీరంగా అడిగాడు కిరణ్. హోటలంతా పిన్ డ్రావ్ సైలెంట్ గా వుంది.

"ఓ.కే! అన్నాడు ముత్తురామన్.

"నెక్స్ట్ ఇన్సూరెన్స్‌లో తనకు రావలసిన ఫైవ్ లాక్స్‌కి గత రెండు మూడు నెలలుగా లావాదేవీలు జరగడం, డాక్యుమెంట్స్, రిసీప్ట్స్ సరిగ్గా లేకపోవడం వలన ఇంతవరకూ పోస్టుపోన్ చేయడం జరిగింది. అదే రోజున ఫైవ్ లాక్స్ కాష్ డ్రా చేశారు. దీనికి సాక్ష్యం అదిగో ఇన్సూరెన్స్ హయ్యర్ అథారిటీస్ మిస్టర్ బలరామన్, మిస్టర్ సుకుమారన్ గార్లు. ఏమైనా కరెక్ట్?" అంటూ ప్రశ్నించాడు కిరణ్.

"పెర్ఫెక్ట్లీ కరెక్ట్ సర్!" అన్నారు ఇద్దరూ.

"అంతకుముందు, రెండ్రోజుల క్రితం సాయంత్రం సీడెడ్ నైజాం ఏరియా బిజినెస్ కోసం త్రీ లాక్స్ ఇచ్చివెళ్ళారు. డా॥ నాయుడుగారు, శ్రీ రాఘవరావుగారు, ఏమండీ ఇచ్చారా లేదా?"

"ఇచ్చాం సార్! ఇచ్చినట్లు మా దగ్గర రశీదులు, అగ్రిమెంట్స్ వున్నాయి!" అన్నాడు నాయుడు తమ డబ్బు పోతుందన్న భయంతో....

"గత ఆరు మాసాలుగా మిస్ సంధ్యాదేవిగారికి, ప్రొడ్యూసరు భీమానాయుడుగారికి కనెక్షన్స్ లేవు— కేవలం డబ్బు సంపాదన ముఖ్యమనుకున్నారు ఇద్దరూ. సంధ్య వేషాలువేసి సంపాదించింది. భీమానాయుడుగారు మరోవిధంగా అమ్మాయిల నగ్నచిత్రాల్ని తీసి— నెగిటివ్స్ సేల్ చేసి డబ్బు సంపాదించడం మొదలుపెట్టారు.

హెయిర్ డ్రెస్సర్ నటరాజన్‌కీ సంధ్యకీ పరిచయముంది. ఒక తమిళ చిత్రానికి ఈయన్ని పర్సనల్ హెయిర్ డ్రెస్సర్‌గా వుంచుకుంది. ఈ హోటల్‌కే భీమానాయుడు వస్తాడని, హోటల్‌కి రాగానే 'నటరాజన్' ద్వారా మాలిష్ చేయించుకుంటాడని సంధ్యకు తెలుసు. తన

ప్లాన్ ప్రకారం - సంధ్యకు మెసేజ్ అందించాడు నట రాజన్. సంధ్య ఆరోజు మారు వేషంలో ముస్లిం అమ్మాయి లాగా వచ్చింది. దానికి మిస్ లీలారావ్ సాక్ష్యం!

సంధ్య అందంగా ఎలా నటించగలదో. అందంగా అలాగే రాయగలదు. భీమానాయుడు రైటింగ్ పోలికలు సంధ్య రైటింగ్ లోనూ వున్నై. సంధ్యతో లీలారావ్ కి పరిచయముండటంవలనే, ఆమెమీదికి అనుమానంరావాలని ఆమె గురించి కొన్ని పేజీలు కేటాయించింది. ఏమీ తోచనపుడు ఇంపార్టెంట్ కాని విషయాల్ని రాసుకున్న డైరీ ఇది. వాస్తవానికి భీమానాయుడు ఒరిజినల్ డైరీ ఆయన ఇంట్లో భార్య దగ్గరుంటుంది. ఏమ్మా! డైరీ తీసుకొచ్చారా?" అని పుష్పనుద్దేశించి అడిగాడు.

"ఇదిగో సర్" అంటూ రాజు అందించాడు.

"చాలాకాలం తర్వాత కలుసుకున్నారు గనుక ఇద్దరూ ఎంజాయ్ చేశారు. ఆ సమయంలోనే స్లీపింగ్ పిల్స్ ఇచ్చింది. సంధ్య తెలివయింది. నటరాజన్ని పిలిపించింది. ఎంచక్కా గుండు గీయించింది—తిరుపతి వెళ్ళి వచ్చాడని డైరీలో రాసింది—"

"మరి రూమ్ తీసుకునేముందు గోవిందురెడ్డిగారు చూడలేదా?" సాయిబాబా అబకుచేశాడు.
జట

"ఏమండీ గోవిందురెడ్డిగారూ! ఆయన గుండుతో రావడం—చూశారా!"

"ఆయన రావడం చూశాన్సార్. ఆయనకి గుండు వుందో—లేదో గుర్తు లేదు!" అన్నాడు రెడ్డి.

"బ్రౌన్ బ్రీఫ్ కేసును తెరవండి!" అన్నాడు కిరణ్.

బలవంతంగా తెరిచారు. అందులో 'నైన్ లాక్స్' కేష్ వుంది.

"ఫింగర్ ప్రింట్స్ చూడండి!" అన్నాడు. క్షణంలో తేలిపోయింది ఆ క్యాష్‌మీద వున్న ఫింగర్ ప్రింట్స్ సంధ్యవేనని.

"సో దిస్ క్యాష్ వజ్ స్టోలెన్ బై సంధ్య! అనుమానం రాకుండా గుండు గీయించింది. డాక్టరుగారూ! నిజంగా తిరుపతినుండి గుండు గీయించుకొని భీమా నాయుడు వస్తే ఈ సరికి మీ లెక్క ప్రకారం ఎన్ని సెంటిమీటర్ల జుత్తు ఎదుగుతుంది?"

"స్వల్పంగా వెంట్రుకలు తగుల్తాయి—" అన్నాడు డాక్టరు.

"పరీక్ష చేయండి! నేను శవాన్ని చూడగానే పరీక్షించాను. నున్నగా వుంది. అంటే తిరుపతిలో గుండు గీయించుకున్న మరుక్షణం చంపబడ్డాడన్నా అర్థం—నో చంపేసి ఇలా గుండు గీయించారు తెలివిగా. అదే నా అనుమానాన్ని పెంచింది!" ఆగాడు కిరీట్.

"యూ ఆర్ పెర్ఫెక్ట్‌లీ కరెక్ట్!" అంటూ కళ్ళతో అభినందించాడు డాక్టరు.

"సంధ్య—చాలా తెలివిగా ప్రవర్తించింది. మిస్ లీలారావ్‌ని మంచిచేసుకొని, నన్ను వశపరుచుకుందామని ప్రయత్నించింది. పార్టీ ఎరేంజ్ చేయించింది. రాయల్ సెల్యూట్ నాకు పట్టించాలని చూసింది. లీలారావ్ సహకారంతో ద్రాక్షరసం త్రాగాను. మైకం వచ్చి పడిపోయినట్లు నటించాను. ఆటోమేటిక్ కెమెరా టేప్‌రికార్డర్ అమర్చాను—సమయానికి రాజు సహకారంతో ఏ. సి. ఆఫ్ అయింది. సంధ్య మత్తులో గమ్మత్తుగా ప్రవర్తించింది. తన నోటితోనే నిజం చెప్పేసింది—" అంటూ టేప్ వినిపించాడు.

"ముత్తానికి ఘటికుడవయ్యా! ఇన్స్పెక్టర్ కిరణ్! ఈ కేసు పరిశోధనతో నీ కీర్తి మరింత పెరిగింది. కంగ్రాచ్యులేషన్స్. అవునూ చిన్న—డౌట్ మరి అనవసరంగా గోవిందురెడ్డిని, నన్ను-ఎందుకు జడిపించావయ్యా బాబూ?" అన్నాడు సాయిబాబా ఛలోక్తిగా.

"కావాలనే జడిపించాను. ఆ మాత్రం ఈ కేసుపట్ల భయం లేకపోతే ఈసరికి ఈ సంధ్య ఇతడ్ని గుప్పెటిలో వుంచుకునేది. అందుకే గోవిందురెడ్డికి ప్రాణంమీద అంత ఆశ పుట్టేలా చేశాను!

"ఏం సంధ్యాదేవిగారూ! ఇంకేవన్నా వాదించాలనుకుంటున్నారా?" అనడిగాడు కిరణ్.

సంధ్య తల వంచుకుంది. మాట్లాడలేకపోయింది. లీలారావ్‌ని అసహ్యంగా చూసి "యూ... యూ.... బ్రూట్!" అంది.

మిస్ లీలారావ్ తీయగా నవ్వింది.

"కంగ్రాట్స్‌లేషన్స్ మిష్టర్ కిరణ్! నువ్వు మన పోలీస్ డిపార్ట్‌మెంట్‌కే గర్వకారణమయ్యావు" అంటూ కరచాలనం చేశాడు డి.ఐ.జి. భాస్కర్రావు.

"వెల్ డన్ మై బాయ్! డాక్టర్లు కనిపెట్టలేని సైకలాజికల్ పాయింట్ నువ్వు కేప్చర్ చేసి పరిశోధన సాధించావు!" అంటూ షేక్‌హాండిచ్చాడు డి.యమ్.ఓ.

"ఇక ఈ శవాల్ని 'పోస్టుమార్టమ్'కి పంపిద్దామా!" అన్నాడు నవ్వుతూ డి.యమ్.ఓ.

"ఓ య్యాస్ సార్! తన గుట్టు బయటపెట్టకుండా నటరాజన్‌ని చంపిందికూడా సంధ్య!" అన్నాడు కిరణ్.

సంధ్య మరోసారి తల దించుకుంది.

గోవిందురెడ్డి కిరణ్ చేతులు పట్టుకున్నాడు. "ఇన్స

పెక్టర్ గారూ! నా హోటలు పరువు దక్కించారు. కొన్ని లక్షలు అప్పుచేసి కట్టిన ఈ హోటల్ ఈ రోజుతో మూత పడుతుందనుకున్నాను!" అంటూ కృతజ్ఞతా చిహ్నంగా చూశాడు.

కిరణ్, లీలారావ్ దగ్గరికి వచ్చాడు.

మిస్ లీలారావ్ తల దించుకుంది.

"థాంక్స్ వెరీమచ్ లీలారావ్! ఐ షల్ కీప్ యు ఇన్ మై హార్ట్ ఫరెవర్!" అంటూ షేక్ హేండిచ్చాడు. ఆ స్పర్శకు పులకించిపోయింది లీలారావ్. కళ్ళల్లో నీళ్ళు చిమ్మి చెంపలను తాకుతూ జారిపోయాయి.

పుష్ప, పిల్లల్తో దీనంగా నుంచుంది.

"ఈ డబ్బు మీకు జేరుతుంది! ఇందులో మూడులక్షలు వ్యాపారరీత్యా ఇచ్చిన అడ్వాన్సు.... నాయుడుగారూ! మీరు తీసుకోండి!" అంటూ పెద్దల సమక్షంలో మూడు లక్షల క్యాష్ ఇప్పించాడు, రశీదులు తీసుకొని.

"వుంటానమ్మ! మీకే సహాయం కావాలన్నా నన్ను పిలవండి!" అన్నాడు కిరణ్.

"అలాగే!" అంది బొటబొట కన్నీరు విడుస్తూ.

"ఇందులో రెడ్డిగారి కివ్వవలసింది!"

"వద్దు బాబూ! వారి కుటుంబానికే వుంచండి" అన్నాడు రెడ్డి.

"వద్దండీ మీకు రావలసింది మీరు తీసుకోండి!" అంటూ అతని డబ్బు అతనికిచ్చింది పుష్ప.

"రాజూ! మై ఫ్రెండ్ థాంక్స్!" అంటూ కౌగలించుకున్నాడు—ఇద్దరూ కాస్సేపు ఆ ప్యాయతా లోకంలో సంభ్రమించుకుపోయారు.

—:యిపోయింది:—

# జేబు దొంగ?

## ఎమ్.వి.వి. సత్యనారాయణ

జగదాంబ సెంటర్ రద్దీగా వుంది. ఆఫీసుకు వెళ్ళేజనం! మార్కెటింగ్ చేయడానికి ఇళ్ళలోంచి బయట స్త్రీలు! బడులకు వెళ్ళే పిల్లలు! కర్మాగారాలకు పరుగుతీసే కార్మిక జనం! పోటీలకు పరుగెత్తే కారుల పందెంలాగా కార్లు!

జేబు దొంగ రాజు గుంపులో చొరబడ్డాడు.

సిటీ బస్సు వచ్చి స్టాపులో ఆగింది. సీతమ్మధార పోయే బస్సు ఖాళీగా వుంది. సీట్లకు సరిపడా జనం ఎక్కగానే బస్సు కదిలింది. రాజు నిట్టూర్చాడు.

గుమ్మాలకు వ్రేలాడుతోన్న ప్రయాణీకులతో పద మూడో నెంబర్ సిటీబస్సు వచ్చింది. అలవాటుకొద్దీ బస్సు స్టాప్ వదలి ఐలండ్ వద్ద ఆగింది.

ప్రయాణీకులు పరుగులు తీశారు.

రాజు పరుగెత్తి బస్సు గుమ్మం దొరకబుచ్చుకున్నాడు.

ప్రయాణీకులు నలిగిపోతున్నారు. యుద్ధవీరుల్లాగా

ఒకరినొకరు తోసుకుంటున్నారు.

బస్ కండక్టరూ పోలీస్ కానిస్టేబులూ తనుకి పట్టనట్టు చూస్తున్నారు.

పూల రథంలాగా కదిలింది బస్సు.

రాజు బస్సులో తన స్థానంలో నిలదొక్కుకున్నాడు. ప్రయాణీకులను వాళ్ళ జేబులో సొమ్ములను కళ్ళతో అంచనా వేయసాగాడు. చేతికి ఎవరిదో జేబు తగిలింది. బరువైన పర్సు! వేళ్ళతో జేబును వెతికాడు.

అతడు బస్సు ప్రయాణంలో బాలెన్సు కాచుకోవడంలో మునిగివున్నాడు.

రాజు చటుక్కున పర్సు లాగాడు. అతికష్టంమీద వణికే నరాలను అదిమిపట్టాడు. తన పాంటు జేబులోకి పర్సును తోశాడు.

బస్సు ఎక్కడి తొక్కిడిగా వుంది.

"పర్సు! పర్సు! బాబోయ్, నా పర్సు!...." అతడు గుండె లవిసేలాగా కేకలు పెడుతున్నాడు.

రాజుకి గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి.

సిటీ బస్సు మీద పిడుగు పడితే బాగుండుననిపించుతూంది.

కాని బస్సు స్టాపుకీ స్టాపుకీ మధ్యలో ఆగింది.

"వీడే అయుంటాడు. నా పర్సు కొట్టేసింది!" పర్సు పోగొట్టుకున్న వ్యక్తి రాజు చేయి పట్టుకున్నాడు.

రాజుకి గొంతు తడారిపోయింది.

"నేను....కాదు...." చేయి గింజుకున్నాడు రాజు.

కండక్టర్ ప్రయాణీకులను క్రిందకు దింపాడు.

అతడు రాజు జేబులు తడమబోయాడు.

రాజు వారించబోయాడు. మరెవరో రాజు షర్ట

పట్టుకున్నారు. మరొకడు అతడి జేబులు వెతికాడు.

పర్స్ తీశాడు.

రాజుకి కళ్ళముందు మెరుపులు మెరిశాయి.

పర్స్ పోగొట్టుకున్న వ్యక్తి తేలుకుట్టినవాడల్లే అరుస్తున్నాడు.

"అది నా పర్స్ కాదు బాబోయ్.... నా పర్స్ బాబోయ్.... ఆరొందల రూపాయలు! నా జీతం బాబోయ్!...."

ఈసారి రాజు తెల్లబోయాడు. తాను అతడి జేబులోంచే పర్స్ కొట్టేశాడు.

ఎవరో పర్స్ తెరిచారు.

పర్స్‌లో రెండు రూపాయలనోటూ నలిగిపోయిన కాగితంముక్కా వున్నాయి. పర్స్‌లో మైకాషీటు దాని వెనుక ఫోటో—

"అరె, అతడు నిర్దోషి! ఆ ఫోటో అతడిదే!"

రాజు నిభాయించుకున్నాడు. తన ఫోటో వున్న పర్స్ అది! ఆ పర్స్ ఎక్కడిది? తన జేబులోకి ఎలా వచ్చింది?

పర్స్ పోగొట్టుకున్నవాడు గోల తీపోతున్నాడు.

"పోలీస్ కంప్లయింట్ యివ్వండి!"

"అరరె, పాపం! అసలు దొంగను వదలిపెట్టాం!"

"అవును పాపం! అమాయకుడిని బాధ పెట్టే వాళ్ళం!"

రాజు జుత్తు సవరించుకుని పర్స్‌తో గుంపులోంచి బయటపడ్డాడు.

తనకి పర్స్ దొరకనందుకు భాధపడాలో, తన్నులూ కటకటాలు తప్పించుకున్నందుకు సంతోషపడాలో....

"అరె, రాజూ ఏం జరిగింది?" సైమన్, ఫకీరు అతడిని సమీపించారు. రాజు, సైమన్, ఫకీరు—ముగ్గురూ తోడు దొంగలు. రాజు జరిగింది చెప్పాడు వాళ్ళకు ఆశ్చర్యంగా.

తన జేబులో ఆరువందల రూపాయిల పర్స్‌ను ఎవరు తీసుకున్నారు?

తీసుకున్నవాళ్ళే తన జేబులో ఈ రెండురూపాయలూ తన ఫోటో వున్న పర్స్‌ను ఉంచారు!

వాళ్ళకి తన ఫోటో ఎలా వచ్చింది?

ఫకీరు చేతిలో పర్సులోని నలిగిన కాగితం ముక్క వుంచాడు రాజు.

ఫకీరు అతడివంక ఎగాదిగా చూచి, కాగితం తెరిచాడు.

"సాయంత్రం నాలుగు గంటలకు ప్లాజా హోటలు రూం నెంబర్ పన్నెండులో కలుసుకుందాం!" అని వుంది కాగితంలో.

"ఎవ్రరా రాసింది?" అడిగాడు ఫకీరు.

"ప్చ్...." అన్నాడు రాజు తనకి తెలియదన్నట్టు.

సైమన్ చీటీ చదువుతున్నాడు.

"నీ జేబులో ఈ చీటీ పెట్టినవాళ్ళే ఆరొందలున్న పర్స్ కొట్టేశారు!"

"ఒరే సైమన్! వాళ్ళకి నా ఫోటో ఎలా వచ్చింది?" అడిగాడు రాజు.

సైమన్, ఫకీర్ పకపకా నవ్వారు.

రాజు వాళ్ళవంక కోపంగా చూశాడు.

"మనం ఒకసారి ఎగ్జిబిషన్‌లో ఫోటోలు తీయించుకున్నాం!" అన్నాడు ఫకీర్.

"అయితే?"

"నీ ఫోటోని వాళ్ళెవరో సంపాదించి వుంటారు?"

"అదే ఎందుకంటాను?"

"ఏమో....ప్లాజాకి వెళ్ళు! తెలుస్తుంది కదా!"

## 2

శంకర్ అటూ యిటూ చూశాడు. జగదాంబ సెంటర్ లో టాక్సీ స్టాండువైపు వెళ్తోన్న రాజు, సైమన్ కనిపించారు. వాళ్ళను దృష్టిలోంచి తప్పుకోనకుండా జాగ్రత్తపడ్డాడు శంకర్.

పబ్లిక్ టెలిఫోన్ బూత్ లో ప్రవేశించాడు. అద్దాల గోడల బూత్!

టెలిఫోన్ చేస్తోన్నట్టు నటిస్తూ టాక్సీ స్టాండువైపు చూశాడు.

రాజూ, సైమన్ టాక్సీలో కూర్చున్నారు. టాక్సీ బయలుదేరింది.

శంకర్ టెలిఫోన్ చేశాడు.

అవతలవైపు వాళ్ళకి టాక్సీ బయలుదేరినట్టు సందేశం పంపించాడు.

శంకర్ యింకా బూత్ లో వుండగానే టాక్సీ బారెక్స్ రోడ్ లోకి మళ్ళింది. టాక్సీ బారెక్స్ దాటింది. పూర్ణ మార్కెట్ వద్ద మలుపు తిరిగింది.

"ప్లాజాలో మనకి రహస్యం తెలుస్తుందంటావా?" అడిగాడు రాజు.

సైమన్ అతడి తొడగిల్లి డ్రయివింగ్ సీటువైపు వేలు చూపించాడు.

"ఏం? వాళ్ళ వ్యక్తి అంటావా?" అడిగాడు రాజు పెదిమలు కదుపుతూ.

"కావచ్చు!" గుసగుసలాడాడు సైమన్.

టాక్సీ చిన్న కుదుపుతో ఆగింది.

బీట్ పోలీస్ ట్రాఫిక్‌ను అదుపులో పెడుతున్నాడు. ఎవరో వ్యక్తి టాక్సీని సమీపించాడు.

"డ్రయివింగ్ లైసెన్స్!" అన్నాడు అతడు డ్రయివర్‌నుద్దేశించి.

డ్రయివర్ తన డ్రయివింగ్ లైసెన్స్ చూపించాడు.

తణిఖీ చేస్తోన్న వ్యక్తి వెనక సీట్లలోకి చూశాడు.

"మీలో రాజు ఎవరు?" అని అడిగాడు.

రాజు సైమన్ తెల్లబోయారు.

"ఎందుకు?" అడిగాడు సైమన్.

"నువ్వు రాజువా?" అడిగాడు తణిఖీచేస్తోన్న వ్యక్తి.

"కాదు!"

అతడు తన చూపును రాజువైపు మరల్చాడు.

"నువ్వు రా. పోలీసుల రికార్డులో సంతకం పెట్టాలి!"

"ఎందుకు సార్?" రాజు గొంతు తడారిపోయింది.

"సిటీ బస్సులో దొంగతనం గురించి!"

"నేను చేయలేదని ఋజువయింది కదండీ!"

"కావచ్చు. కమాన్! చర్చ అనవసరం!"

రాజు తల త్రిప్పి సైమన్‌ని చూశాడు.

సైమన్‌కి విచిత్రంగా వుంది. వెళ్ళమన్నట్టు రాజుకి సైగచేశాడు. రాజు మెల్లగా టాక్సీ దిగాడు.

ట్రాఫిక్ కదిలింది. రాజుతో అతడు రోడ్డుమీద నడుస్తున్నాడు.

సైమన్ వులిక్కిపడ్డాడు. సీటులో తన ప్రక్కగా చిన్న కాగితం ముక్క! దాన్ని అందుకుని చదువుకున్నాడు.

"అనవసరంగా కలగ చేసుకోనక! ప్రాణాపాయం!"

సైమన్ సుదురు చిట్లించాడు.

"నన్ను ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు?" అడిగాడు రాజు.

"ప్లాజాకి!"

ఇద్దరూ కారును సమీపించారు. నీలిరంగు అంబాసిడర్ కారు.

రాజు కారు ఎక్కి కూర్చున్నాడు. అతడి ప్రక్కగా ఆగంతకుడు కూర్చున్న తర్వాత కారు కదిలింది.

విశాలమైన మైదానం దాటి ప్లాజా హోటల్ ముందు ఆగింది.

సైమన్ పోర్టికోలో పచార్లు చేస్తూ కనిపించాడు.

"రా! వెనకనుండి మెట్లదారి వుంది!" అతడు రాజును హోటలు వెనుక భాగానికి తీసుకు వెళ్ళాడు.

ఎవరూ ఉపయోగించని మెట్లు కావడంతో ఇద్దరూ సులువుగా మెట్లు ఎక్కారు. రెండో అంతస్థులో వుంది పన్నెండో నెంబర్ గది.

ఆగంతకుడు గది తలుపు తట్టాడు.

తలుపు తెరుచుకుంది.

రాజు తలుపు వెనుక ప్రత్యక్షమైన ఆకారాన్ని చూడగానే కళ్ళు త్రిప్పుకోలేకపోయాడు.

తలుపు అవతల నిలబడిన యువతికి ముప్ఫయి సంవత్సరాలుంటాయి. అయినా శరీర బింకంలో ఇరవై ఏళ్ళ అమ్మాయిలాగా వుంది. ఎర్రటి శరీరం, శరీరానికి అతుక్కుపోయిన మాక్సీ, పెదిమలకు ఎర్రటి లిప్ స్టిక్, విశాలమైన నేత్రాలూ, నేత్రాలమధ్య ఉమ్మడి ఆస్తిలాగా సంపెంగ లాంటి ముక్కూ, మాక్సీలోంచి దాగని యవ్వనమూ....

రాజు సభ్యత కాదనుకున్నాడు.

ఆమె మనోహరంగా నవ్వింది.

"లోపలికి తీసుకురా జోషీ!" అందామె అధికార పూర్వకంగా.

రాజుకి తనని వెంటపెట్టుకువచ్చిన రాజు 'జోషీ' అన్న సంగతి అర్థమయింది. ఇద్దరూ గదిలోకి అడుగు పెట్టారు.

డబుల్ రూం అది! గదిలో డబుల్ కాట్ వుంది. వాటికి ఎదురుగా ఇవతల గోడ దగ్గర టేబులూ, దాని మీద టెలిఫోన్, టేబులుకి వున్న గోడకి విశాలమైన కిటికీ, టేబులుమీద టెలిఫోనూ, గదిలో ఒకప్రక్కగా సింకూ....ప్రక్కగా... కిటికీలోంచి బయటకు చూశాడు రాజు.

కిటికీకి అవతలగా భవనం వుంది. అది సన్ ఎన్ సాండ్ హోటల్ అని తనకి తెలుసు. ఈ గది కిటికీకి సమాంతరంగా అవతలి హోటల్ గది కిటికీ వుంది.

రెండు భవనాల మధ్య సన్నటి రోడ్డు. పాతిక అడుగుల రోడ్డు.

రోడ్డుకి అటు సన్ ఎన్ సాండ్! ఇటు ప్లాజా!

రాజు తల విదిలించాడు.

ప్రక్కగా వున్న బాత్ రూంలో నీళ్ళ చప్పుడవు తోంది.

"బాస్ లేరా మాడమ్?" అడిగాడు జోషి.

ఆమె బాత్ రూంవైపు కళ్ళు తిప్పింది. బాత్ రూం తలుపు తెరచుకుని ఆజానుబాహువు బయటికి వచ్చాడు.

ఆమెని చూచిన కళ్ళతో అతడిని చూచేటప్పటికి

రాజుకి తల గిర్రున తిరిగింది.

ఆరడుగుల పైచిలుకు ఎత్తులో ఇంచుమించుగా అతడు తుమ్మ మొద్దులాగా వున్నాడు. బుర్రమీసాలూ, సన్నగా గీసిన గడ్డం, కుడి కన్నులో తెల్లటి పువ్వూ, గారపళ్ళూ చిరాకు పెరిగిన జుత్తు....

తుమ్మ మొద్దు వొంటిన రంగుల టర్కీష్ టవలు వుంది.

"రాజాసాబ్‌ను లాక్కువచ్చావుట్రా జోషీ!" అతడి గొంతు కర్కశంగా వుంది.

"అవును బాస్! కింద సైమన్ వున్నాడు!" అన్నాడు జోషి.

"వాడిని ఎందుకు రానిచ్చావు?" వదులుగా వున్న పాంటులోకి మారాడు బాస్.

"వాడు వస్తే మాత్రం మనకేం?" కల్పించుకుంది ఆమె.

"నీకు తెలీదు షకీలా! సైమన్ మనలను డబుల్ క్రాస్ చేయాలని చూశాడు."

రాజుకి వాళ్ళ సంభాషణ మతి పోగొడుతోంది.

సైమన్ వాళ్ళను మోసం చేయడమా?

సైమన్‌కీ వీళ్ళకూ సంబంధం ఏమిటి?

అసలు తనను వీళ్ళు ఎందుకు తీసుకువచ్చినట్టు?

తననే తీసుకురావాలని వీళ్ళకు ఎలా తోచింది?

"నువ్వు వెళ్ళరా జోషీ! సైమన్ పని చూడు!" అన్నాడు బాస్.

జోషీ వెళ్ళిపోయాడు.

షకీల కుర్చీలు లాగింది. రాజును కూర్చోమని సైగ చేసింది.

రాజు కూర్చున్న తర్వాత బాస్ టేబులుకి జారగిలపడి

కుర్చీలో కూర్చున్నాడు. అతడి వెనకనుండి టెలిఫోన్ మీదుగా కిటికీలోంచి గాలివస్తోంది.

గదిలో వాతావరణం ఆహ్లాదకరంగా వుంది.

రాజు మాత్రం ఇబ్బందిగా కదిలాడు.

"మీ పూర్వీకులు బాగా డబ్బున్న జమిందారులు! గుర్తుందా?" అడిగాడు బాస్.

రాజు ఆ ప్రశ్న అడిగింది తనను అనుకోలేదు.

అయినా అప్రయత్నంగా, "మా పూర్వీకులా?" అన్నాడు.

"అవును. మధురవాడకి పది మైళ్ళకి అవతలగా ఒకప్పటి జాగీరు ఈనాడు నాశనమైపోయింది. అక్కడుంటే ప్రజలు వారి దోపిడీగాళ్ళకి దడిచి ఎటుపడితే అటు దారి చూసుకున్నారు. కానీ ఇప్పటికీ అక్కడ మీ పూర్వీకుల ఇంద్రమహల్ వుంది. జాగీరులో వున్న ఆ సిపాసులను ఇంద్రమహల్‌లో దాచినట్టు చెప్పుకున్నారు."

"ఇదంతా నిజమా?"

బాస్ చురుకుగా చూశాడు. "నీతో పనికట్టుకుని అబద్ధాలు చెప్పవలసిన పనిలేదు."

"ఇది చెప్పడానికేనా నా జేబులో చీటీ పెట్టారు!"

బాస్ తలూపాడు.

షకీల పకపక నవ్వి, బరువైన వస్తువును రాజు వొడిలో పడేలాగా విసిరింది.

"ఆరొందల రూపాయిలున్న పర్స్!" నవ్వింది షకీలా, ముత్యాలు వొంపుతోన్నట్టు.

"నువ్వు ఏడు సంవత్సరాల వయసులో వుండగా నీ తలిదండ్రులు జాగీరును వొదిలి పారిపోయారు. వాళ్ళు

భయపడ్డట్టే ఆ రాత్రి ఇంద్రమహల్ లూటీ అయింది. దారిలో మీ తలిదండ్రులు వాళ్ళకి ఆహుతయ్యారు. నువ్వు ఎలా బతికి బయటపడ్డావో తెలియదు."

"ఇంతకీ మీరు...."

"ఆనాటి దోపిడీ ముఠాకీ మాకూ సంబంధంలేదు."

"అయితే ఈ విషయాలు ఎలా తెలిశాయి?"

"మా రొటీన్ వర్క్‌లో ఈ విషయాలు బయటపడ్డాయి. నాలుగు రోజులుగా ఇంద్రమహల్‌ను త్రవ్వి తిరగవేశాం. ఏమీ ఫలితం దక్కలేదు."

"నన్ను యిప్పుడు పిలిపించి ఈ సంగతులు చెప్పడంలో...."

"పాయింటికి వస్తున్నాను!" కారణం లేకుండానే బాస్ నవ్వాడు. "నువ్వు ఏడు సంవత్సరాల వయసు వచ్చేవరకూ ఇంద్రమహల్లోనే వున్నావు. ఆ రాత్రి మీ వాళ్ళు ఇంద్రమహల్‌ని ఖాళీచేసేటప్పుడు వాళ్ళతో నువ్వు వున్నావు. మా అంచనా ప్రకారం ఆనాటి మనుషులలో సజీవంగా వున్నది నువ్వు ఒక్కడివే!"

"అయితే మాత్రం నాకు ఆనాటి జ్ఞాపకాలు...."

"లేవని బుకాయించక! నువ్వు ఆ పరిసరాలకు ఇంత వరకూ వెళ్ళలేదు. నువ్వు మరచిపోయి వుండడం నిజం కావచ్చు. కాని, తిరిగి నువ్వు ఆ పరిసరాలను చూడటం తటస్థించే....ఆనాటి జ్ఞాపకాలు నిన్ను తప్పక తరుముతాయి."

"ఇంద్రమహల్‌లో గుప్తంగా వున్న ఆస్తి విలువ పదిహేను కోట్లకి పైగా అని అంచనా!" షకీలా కలగచేసుకుంది.

"ఇంద్రమహల్ నా వారసులదని తెలిసి నవ్వాలో

ఏడ్వాలో నాకు తెలిసిరావడంలేదు!" నిర్లిప్తంగా అన్నాడు రాజు.

"ఏం?" షకీలా అతడి కుర్చీమీద చెయ్యివేసింది.

"నిధినిక్షేపాల రహస్యం చెప్పమని నన్ను తినేస్తారేమో!"

"అవును. నువ్వు ఆ పరిసరాలు పరిశీలించు. నిధిని కనిపెట్టు. మనం పంచుకుందాం!"

"సైమన్ మీకెలా తెలుసు?"

"నీ ఫ్రెండ్....అంతే తెలుసు మాకు!"

రాజు మాట్లాడలేదు.

"నువ్వు ఆ స్త్రీని త్వరగా చేజిక్కించుకోవాలి. ప్రభుత్వం ఇంతకాలంగా ఇంద్రమహల్‌ను పట్టించుకోలేదు. ఇకమీద ప్రభుత్వం దృష్టిలో ఇంద్రమహల్ పడవచ్చును. జిల్లా కలెక్టర్ అక్కడ త్రవ్వకాలు జరుగుతోన్నట్టు అనుమానిస్తున్నాడు. మనం ఎంత త్వరగా నిధినిక్షేపాలతో బయటపడితే అంత మంచిది!"

"నేను చెప్పకపోతేనో!"

"మేం చెప్పింపుతాం!" షకీలా నవ్వింది.

ఇప్పుడు ఆమె నవ్వు మనోహరంగాలేదు.

గదిలోని టెలిఫోన్ గణగణలాడింది.

# 3

జోషి మెట్లు దిగాడు. మెయిన్ హాలులో నిలబడ్డాడు. అతడి కళ్ళు పోర్టికోలో వెతికాయి. సైమన్ లేదు. జోషి పోర్టికోలోకి వచ్చాడు.

సైమన్ టాక్సీలో కూర్చున్నాడు. అతడి చూపు రెండో అంతస్థుమీద వుంది.

జోషి మెయిన్ హాలులోకి తిరిగివెళ్ళాడు.

కౌంటర్‌లో అడిగి టెలిఫోన్ తీసుకున్నాడు. రిసీవరెత్తి రింగ్ చేశాడు.

ఆపరేటర్ పలికింది.

"రూం నెంబర్ పన్నెండు!" అన్నాడు జోషి.

అవతల బాస్ పలికాడు.

"రాజు గదిని వెతుకు! పెట్టెలలో పాతకాగితాలుంటే తీసుకురా!" ఆదేశించాడు బాస్.

"సైమన్‌తో వెళ్ళనా?"

"ఆఁ!" అవతల కిక్కుమంది.

జోషి ఫోన్ పెట్టేశాడు. చకచక ఆవరణలోకి నడిచాడు.

సైమన్‌ని సమీపించాడు.

"నా పేరు జోషి, బాస్ పంపించారు!" అన్నాడు.

సైమన్ నుదురు చిట్లించాడు. "అరె! ఇందాక రాజును తీసుకువెళ్ళింది నువ్వే కదూ!"

"అవును."

"నిజంగానే పోలీస్ వ్యవహారంలో చిక్కుకున్నాడనుకున్నాను!"

"పద!" డోర్ తెరిచాడు జోషి. "రాజు యింటికి వెళ్దాం!" అన్నాడు.

"ఎందుకు? వాడి రూంలో ఎలాంటి పత్రాలూ లేవు."

"అప్పుడే నువు వెతికావన్నమాట!"

టాక్సీ కదిలింది.

"అవ్వను పత్రాలు దొరికివుంటే రాజుతో సగం-సగం ఎప్పుడో పంచుకునేవాడిని!"

రాజు యింటిముందు టాక్సీ ఆగింది.

ఇద్దరూ టాక్సీ దిగారు. సైమన్ టాక్సీ అద

చెల్లించాడు. టాక్సీని వెళ్ళనిచ్చి యిద్దరూ రాజు గదిలో చొరబడ్డారు. గదిని వెతికారు. పాత యినుపపెట్టెలు బోర్లించారు. వంట యిల్లు చిందరవందర చేశారు. బట్టల పెట్టె తిరగతోడారు. మూలమూలల్లో వాళ్ళు శోధించారు.

జోషి గదిలోకి పిచ్చిగా చూశాడు.

అతడి చూపు గోడమీద వున్న ఫోటోలమీదపడింది.

మరుక్షణంలోనే ఫోటోలు పగిలాయి. ఒక ఫోటోలో ఆరేళ్ళ వయసులో వున్న పిల్లవాడున్నాడు.

"వీడిలో రాజు పోలికలున్నాయి!" అన్నాడు జోషి.

"అవును. రాజు చిన్నప్పటి ఫోటో యిది!" సైమన్ కళ్ళు పెద్దవయ్యాయి. ఫోటోకి మెడలో తయెత్తువుంది.

అటువంటి తాయెత్తును తాను ఎన్నడూ రాజువద్ద చూడలేదు. కాని.... చటుక్కున గుర్తొచ్చింది. తాను ఆ తాయెత్తును చూశాడు. ఎప్పుడు? ఇప్పుడే.. ఎక్కడ.... పాత ఇనుప పెట్టెలోని వస్తువులు తిరగ వేస్తోన్నప్పుడు అవును....అక్కడే....దాని రింగులో రంగువెలసిన తాడు వున్నట్టుంది. సైమన్ తిరగవేసిన ఇనుపపెట్టె వద్దకు పరుగెత్తాడు.

చేత్తను అటూ యిటూ కలియపెట్టాడు.

అదిగో తాయెత్తు! నల్లగా మాడిపోయిన దీర్ఘ చదురపు బిళ్ళ!

చటుక్కున అందుకోబోయాడు సైమన్!

అతడి వీపుమీద పిడిగుద్దు పడింది. సైమన్ తుళ్ళిగుట్టకి అవతలపడ్డాడు.

జోషి వంగాడు. తాయెత్తువైపు చేయిచాపాడు. సైమన్ ఫెల్టు లంకించుకున్నాడు. శక్తికొద్దీ మందుకు

గుంజాడు. జోషి బోర్లపడ్డాడు. పదేటప్పుడు తెరిచి వుంచిన పాతపెట్టెలో ముఖంపడింది. ఆ వెంటనే పెట్టె మూత టప్‌న మూసుకుంది.

జోషి కెవ్వున అరిచాడు. అతడి తలమీద సుత్తులతో కొట్టినట్టు అయింది. సైమన్ లేచాడు. జోషిని డొక్కలో తన్నాడు.

జోషికి స్పృహ తప్పింది.

సైమన్ తాయెత్తును అందుకున్నాడు.

గుమ్మంలో అలికిడయింది.

పకీరు లోపలికి వచ్చాడు. శత్రురాజులు ధ్వంసం చేసిన రాజ్యంలాగా వుంది ఆ గది!

"ఇదేమిట్రా సైమన్?" అడిగాడు పకీరు.

సైమన్ యథాలాపంగా తాయెత్తును గుప్పెట్లో దాచాడు. పైకి లేచాడు బట్టలు దులుపుకున్నాడు. తాయెత్తును జేబులో జారవిడిచాడు.

"ఏదెవడో రాజు గదిలో చొరబడ్డాడు. వెతుక్కుంటున్నాడు. నేను అడ్డంపడ్డాను" అన్నాడు సైమన్.

"రాజు గదిలో ఏం వుంది?"

"వాడి మొహం! అసలు నాకే వాడింటికి మూతులు నాకేవాడు వెళ్ళాడట!" సైమన్ బలవంతంగా నవ్వాడు.

పకీరు అనుమానంగా చూడసాగాడు.

## 4

మెటడోర్ వ్యాన్ రోడ్డును మింగేస్తూ పరుగులు తీస్తోంది. మధురవాడ క్రమంగా వెనకబడుతోంది.

బాస్ సీటుమీద వెనక్కి వాలాడు.

వ్యాన్‌ని డ్రయివ్ చేస్తోన్న జోషి దృష్టి తిప్పకుండా తలపంకించాడు.

వెనక సీట్లో కూర్చున్న షకీలా బాస్‌ను చూసి నవ్వింది.

జగ్గూ ఆమెకు ఎదుటి సీట్లో కూర్చున్నాడు. తీరికగా సెక్స్ పత్రికలు చదువుకుంటున్నాడు.

వ్యాన్‌లో నవ్వు వినిపించి తలెత్తి చూసి తిరిగి చదువులో మునిగిపోయాడు. రాజు సీట్లో నిద్రపోతున్నాడు.

వ్యాన్ హైరోడ్డు వదిలిపెట్టింది. మట్టిరోడ్డులోకి తిరిగింది.

ఎటు చూచినా చెట్లు ఒత్తుగా పెరిగివున్నాయి. వాటిలో ఎక్కువ భాగం తాటిచెట్లు! నేలంతా బరాణీ తీగ చిట్టడవిలాగా అల్లుకుపోయింది. రానురాను రోడ్డు మట్టిపెళ్ళలు లేగివుండె. వ్యాన్ గతుకులలో ఎగిరెగిరి పడుతోంది.

ప్రయాణం కష్టంగా వున్నప్పటికీ జోషీ నేర్పుగా నడుపుతున్నాడు. వ్యాన్ చెట్ల గుబురుల్లోంచి చొచ్చుకుపోయింది. ఎటు చూచినా పొదలు. వ్యాన్‌కి అవి అడ్డం రాలేదు.

వ్యాన్ కుదుపులకు రాజు లేచాడు.

కిటికీలోంచి బయటకు చూశాడు.

ఎదుట విశాలమైన భవంతి! గోడలు పగిలి కూలిపోయి వున్నాయి. వాటి అసలు రంగు ఏమిటోగాని గోడలు వర్షం తడికి పాకుడుకట్టి నల్లగా వున్నాయి. పై అంతస్తు కిటికీలు విరిగిపోయి వున్నాయి. విరిగిన గోడల మధ్య రకరకాల మొక్కలు పెరిగివున్నాయి.

రాజు తల విదిలించాడు. తాను ఈ భవంతిలో పుట్టాడా? ఇంద్రమహల్ అంటే ఈ భవంతేనా? తనకి

అసలు ఇటువంటి భవంతి వున్నట్టు కలలో కూడా వూహించివుండడు.

ఈ భవంతిలో నిధి వుందా?

బయట ఆవరణ తవ్వి పోగులు పెట్టినట్టుంది.

జోషి వ్యాన్‌లోంచి మట్టిమీదకు దూకాడు.

బాస్ దిగాడు. జగ్గూ, రాజూ, షకీలా వ్యాన్‌లోంచి బయటపడ్డారు.

సింహద్వారం పగిలి తలుపులు పొరలు వూడిపోయి వున్నాయి. ఎటుచూచినా సాలెగూళ్ళూ, బూజూ, నేలంతా చెత్తా చెదారంగా పడివుంది.

"ఇంద్రమహల్ ఏ క్షణాన కూలుతుందో!" బాస్ తలుపులమీద చెయ్యివేసి తోశాడు. అవి కదలడానికి బలమంతా వుపయోగించవలసివచ్చింది. తలుపులు కీచు మంటూ తెరుచుకున్నాయి. అయిదుగురూ భవనంలోకి నడిచారు. గబ్బిలాలు రెక్కలు విప్పి బయటికి ఎగిరాయి.

పెద్ద హాలు, ఒకవైపు మెట్లు మెట్లక్రింద గదుల వరసలూ, మెట్లమీద గదులూ అన్నీ వాతావరణం తాకిడికి గురయివున్నాయి. కొన్ని గదుల తలుపులు లేవు.

బాస్ హాలుచుట్టూ పరికించాడు. చెవులు ఓరగాపెట్టి విన్నాడు. మేడమీద ఎవరో నడుస్తోన్న చప్పుడు వినిపిస్తోంది.

"అడుగుల చప్పుడు వినిపిస్తోందా?" అడిగాడు బాస్.

షకీల భయంతో బిగుసుకుపోయింది.

బాస్ మెట్లు ఎక్కసాగాడు.

అడుగుల చప్పుడు ఆగిపోయింది. అయిదుగురూ భవంతి మొత్తం వెతికారు.

"సందేహం లేదు! ఎవరో తిరిగారు!" అన్నాడు

జోషి. అతడి కళ్ళు కిటికీ బయట వున్న చెట్టుమీద పడివుంది. కిటికీలోంచి చెట్టుమీదకు దిగవచ్చును.

చెట్టుకొమ్మలకు చొక్కాకి సంబంధించిన గుడ్డముక్క తగులుకునివుంది.

రాజు ఆ ముక్కను గుర్తించాడు. బిగుసుకుపోయాడు.

అది సైమన్ తొడుక్కునే చొక్కా!

అంతస్తు దిగి అందరూ బయటికి పరుగెత్తారు.

సరిగ్గా అప్పుడే ఎక్కడినుండో కారు బయలుదేరిన చప్పుడు వినిపించింది.

"వ్యాన్ ఎక్కండి!" అరిచాడు బాస్.

జోషీ చక్రాలవద్ద వొరిగాడు. టైర్లలో గాలిలేదు.

## 5

రాజుకి అకస్మాత్తుగా మెలకువ వచ్చింది.

గదిలో కొవ్వొత్తి వెలుగుతోంది. వెలుగులో ఆ గది భయంకరంగా వుంది. ఇంద్రమహల్‌లో ఒక గది! కింద అంతస్తులో.

ఉదయంనుండీ తాము అయిదుగురూ భవంతి మొత్తం తవ్వి పోగులు పెట్టారు. ఎక్కడా ఎర్రటి ఏగాణీ కూడా దొరకలేదు.

బాస్ తనని పూర్వ జీవితాన్ని గుర్తుకు తెచ్చుకోమని వేధించాడు. తనకి గుర్తురానిదే ఏం లాభం! కాని బాస్ నమ్మడంలేదు.

తలుపుల బయట ఎవరో నడుస్తోన్న చప్పుడయింది.

రాజు చటుక్కున లేచాడు.

"రాజూ! తలుపు తియ్యి!" బాస్ పిలిచాడు.

రాజు తలుపు తెరిచాడు. బాస్, అతడి వెనక వకీలా గదిలోకి వచ్చారు. నేలమీద పరచిన చాపమీద కూర్చు

న్నారు.

"సైమన్ ఎక్కడెక్కడుంటాడు?" అడిగాడు బాస్.

రాజు షకీల మీదనుండి బలవంతంగా దృష్టి మరల్చు కున్నాడు. చీకట్లో మెరుపులాగా పాడుపడిన యింట్లో ఆమె చందమామలాగా మెరుస్తోంది.

"సైమన్? ఎందుకు?" అడిగాడు రాజు.

"వాడిచేతికి నీ తాయెత్తు దొరికింది! ఆ తాయెత్తులో నిధి రహస్యం వుండివుండవచ్చు!"

"తాయెత్తా?"

"అవును. నీ పాత పెట్టెలలో పనికిమాలిన వస్తువు లాగా యింతకాలం పారవేసి వుంచావు!"

రాజు ఆలోచనలో పడ్డాడు.

సైమన్ కి తాయెత్తు దొరికే ఈ భవంతికి వచ్చాడా? నిధి రహస్యం నిజంగా తాయెత్తులో వుందా? సైమన్ ఈ భవంతిని వెతికినట్టు వీళ్ళు గుర్తించారా? సైమన్ కి తాయెత్తు దొరికినా ఇంద్రమహల్ యిక్కడ వున్నట్టు అతడికి ఎలా తెలిసింది?

"ఏమిటి ఆలోచిస్తున్నావు? నిధిని నువ్వూ సైమన్ గాడూ కలసి పంచుకోవాలని యెత్తు వేస్తోన్నట్టుంది! నీ ప్రయత్నం సాగదు! నిన్నూ వాడినీ ముక్కలుగా నరికి పారేస్తాం!" కటువుగా అరిచాడు బాస్.

రాజు భయంగా చూశాడు.

షకీల అతడిని గోముగా చూస్తోంది.

"జగ్గా వెళ్ళి వచ్చాడు వైజాగ్. అంతా గాలించి వచ్చాడు. సైమన్ యెక్కడెక్కడ దాక్కుండే అవ కాశాలున్నాయో స్పష్టంగా చెప్పు! అనవసరంగా హింస పడక!" అంది షకీలా.

ఆమె కళ్ళు కుటిలంగా మెరుస్తున్నాయి.

రాజు చెప్పాడు.

"నాన్సెన్స్! ఆ ప్రదేశాలన్నీ గాలించి వచ్చాడు జగ్గూ" అరిచింది షకీలా.

అకస్మాత్తుగా భవంతిలో కెవ్వుమన్న కేక!

వెన్ను జలదరించేలాగా వులిక్కిపడ్డారు ముగ్గురూ. బయటకు పరుగెత్తారు. మెయిన్ హాలులో జగ్గూ పడి వున్నాడు.

ముగ్గురూ అతడిని చుట్టుముట్టారు.

జగ్గూ తలపట్టుకుని మూలుగుతున్నాడు.

బాస్ అతడి మీదకు వంగి, "జగ్గూ!....జగ్గూ...." అన్నాడు.

జగ్గూ మెల్లగా కళ్ళు తెరిచాడు.

"సైమన్‌గాడు నన్ను సైతాన్‌లాగా వెంటాడాడు. తలమీద బలంగా కొట్టి భవంతిలోకి తోశాడు. మెయిన్ హాలులో పడ్డాను" మూలుగుతున్నాడు జగ్గూ.

బాస్ కళ్ళల్లో నిప్పులు కురిశాయి.

"వాడిని....వాడిని...." పళ్ళు పటపటలాడించాడు.

షకీల వ్యంగ్యంగా నవ్వింది. "నేను చెప్పలేదు నీకు, ఈ రాజుగాడూ, ఆ సైమన్‌గాడూ కలసి నిధి పంచుకుంటారు. తాయెత్తులో నిధి రహస్యం వుంది. సైమన్ గాడు...."

"ఆగు! వాడికి యింకా నిధి అంది వుండదు!"

"నేను అందింది అన్నానా? ఈ రాజుగాడికి ఈ పరిసరాల తాలూకా మాప్ చూపిస్తాడు. నిధి ఎక్కడుందో సులువుగా తెలుస్తుంది."

"కరెక్టు! రాజును కలవడానికే వాడు ఈ అర

రాత్రి వేళ యిటు వచ్చాడు. జగ్గూను కొట్టాడు! వెతుకుదాం!"

"బాస్! ఈ చీకట్లోనా?"

"హ్యాన్ లైట్లు ఆన్ చెయ్యి. ప్రయత్నం చేద్దాం!" బాస్ బయటకు కదిలాడు.

జోషి మెట్లు దిగి వచ్చాడు.

రాజు విస్త్రాణగా ఫీలయ్యాడు. మెట్లమీద కూర్చుండిపోయాడు. జోషీ; పకీలా బయటకి వెళ్ళారు.

జగ్గూకి స్పృహ తప్పింది.

మెయిన్ హాలులో కొవ్వొత్తి వెలుగు నిస్సహాయంగా చీకటితో పోరాడుతోంది.

రాజుకి చీకట్లోంచి చిటికెలు వినిపించాయి.

మెట్ల కింద గదిలో యెవరో నిలబడివున్నారు.

"రాజూ!" అతడు గుసగుసలాడాడు.

రాజు నిర్ఘాంతపోయాడు.

అతడు సైమన్! అతడి ప్రక్కగా మరో అకారం కనిపిస్తోంది.

"వీడు పకీర్!" అన్నాడు సైమన్.

# 6

"వాళ్ళ తలుపులకు గొళ్లెం పెట్టావా?" అడిగాడు రాజు, గుసగుసగా.

"పెట్టానురా కాని ఏ గదిలోంచీ అలికిడిలేదు!" అన్నాడు పకీరు. ఇద్దరూ చీకట్లో బయటికి ఇచ్చారు.

"సాయంకాలంనుండి సైమన్ గాడు మాయమయాడు! విశాఖపట్నం వెళ్ళాడా?" అడిగాడు రాజు.

"విశాఖపట్నం యెందుకు వెళ్తాడు?"

"ఏమో వాడి ఆలోచనలు మనకి తెలియవ్!"

"నిజంరా రాజూ! సైమన్ గాడు దేవాంతకుడు. నీకో రహస్యం చెప్పనా!" ఇద్దరూ నడవలోకి వచ్చారు.

"చెప్పరా!"

"సైమన్ గాడి పూర్వీకులు కూడా ఇంద్రమహల్ లో పనిచేసేవారట!"

"నిజమా?"

"అవును. అప్పటికే వాడికి బాగా వూహ తెలుసునట! దారిదోపిడిదారులు వచ్చినప్పుడు మీ తలిదండ్రులు పారిపోవడం వాడికి తెలుసు!"

"ఫకీరూ! నీకు ఈ విషయాలు యింతకిముందే తెలుసా!"

"తెలిస్తే నీకు చెప్పనా?"

"యెప్పుడు చెప్పాడు?"

"ఈ సాయంకాలం! నిధి యెక్కడుందో కూడా వాడికి తెలిసిందిట!"

"నిధిని యెత్తుకుపోయి పారిపోయాడేమో!"

"పగటిపూట త్రవ్వడం అసాధ్యం! వాడే చెప్పాడు. పైగా మన సహాయం లేనిదే వాడు ఏం చేయలేడు!"

ఫకీరు గదులవంక చూస్తో ముందుకు నడిచాడు. నడవ మలుపులో విశాలమైన గదిముందు ఇద్దరూ ఆగారు. గది తలుపులు దగ్గరగా వేసి వున్నట్టు మసకగా కనిపిస్తున్నాయి.

ఫకీరు తలుపు లోపలకు నెట్టాడు. తలుపులు కీచుమంటూ తెరుచుకుంటున్నాయి. రాజు గదిలోకి నడిచాడు.

గదిలో కొవ్వొత్తి వెలుగుతోంది.

తలుపులకు ఎదురుగా వున్న గోడలో చిన్న ద్వారం తెరుచుకుని వుంది. మనిషి పట్టగలిగేటంత సన్నటి

ద్వారం!

పకీరు టార్చి వెలిగించాడు.

ఇద్దరూ చిన్న ద్వారం దాటారు.

చిన్నద్వారం వెనుక విశాలమైన హాలు! హాలులో నేలమీద త్రవ్వి కప్పపోసినమట్టి .... మట్టికుప్పమీద ఎవరో బోర్లగిల పడివున్నారు.

రాజూ, పకీరు మొహాలు చూసుకున్నారు.

మెల్లగా మట్టికుప్పను సమీపించారు.

బోర్లగిలపడిన వాడి మొహం ఒక ప్రక్కకు తిరిగి వుంది.

టార్చిలైటు వెలుగు మొహంమీద పడింది. అతడు సైమన్.

కళ్ళు పత్తికాయల్లాగా తెరుచుకుని వున్నాయి.

రాజు గోతిలోకి చూశాడు. గొయ్యి ఖాళీగావుంది.

భవనంలో ప్రేలుడు వినిపించింది.

గోడలు కంపిస్తున్నాయి. అకస్మాత్తుగా మట్టిపెళ్ళలు యెగిరిపడుతున్న శబ్దం వినిపించింది

"రాజూ! కమాన్! క్విక్! భవనంలో బాంబు పెట్టినట్టున్నారు!" అరిచాడు పకీరు.

"అంతే... అంతే....నిధి మొత్తం వాళ్ళ వశం అయిందన్నమాట!"

అతడి మాట ముగియకుండానే నడవాలో గోడలు విరిగి పడ్డాయి. బ్రహ్మాండమైన విస్ఫోటం!

## 7

తూర్పున కాంతిరేఖలు విచ్చుకుంటున్నాయి. వ్యాన్ డైరీఫారం దాటుతోంది.

"ఇంకా అయిదుమైళ్ళు! ప్లాజాలో పడతాం!" అంది

షకీలా.

బాస్ పకపక నవ్వాడు. షకీలా ఒడిలోకి ఒరిగాడు.

జోషీ మౌనంగా డ్రయివ్ చేస్తున్నాడు. నగర పరిసరాలు రాత్రి బద్ధకం నుండి మెల్లగా ఒళ్ళు విరుచుకుంటున్నాయి.

బాక్ సీట్లోంచి షకీలా బాస్‌ల సంభాషణను మౌనంగా వింటున్నాడు.

"ఇంద్రమహల్ ఈపాటికి మట్టికుప్ప అయివుంటుంది" అంటోంది షకీలా. ఆమె కళ్ళు సీటుకింద పడ్డాయి.

సీటుకింద గోనె సంచులలో బంగారు కాసులూ, జమిందారీల జవ్వాకీ, వెండి నాణాలూ.

"కోట్ల విలువ ఆస్తి, ఈ వ్యాన్‌లో వస్తోన్నట్టు యెవరికి తెలుస్తుంది?" మత్తుగా అంది షకీలా.

ఆమె భుజం పట్టుకుని ముందుకు వొంచాడు బాస్. ఆమె గుండెల్లో మొహాం గుద్దాడు.

"షకీ! ఆనాడు నువు ఢిల్లీలో నాకూడా రావడానికి ఇష్టపడలేదు. నా స్వాధీనంలోకి ఇంత ఆస్తి వస్తుందని వూహించి వుండవ్!"

"నిజం! నువు ఇంత తెలివైనవాడని నేను యెలా అనుకోగలను?"

వ్యాన్ కొండప్రక్క మలుపు తిరగబోతోంది.

జోషి వులిక్కిపడి బ్రేకులు నొక్కాడు.

దారికి అడ్డంగా టాక్సీ ఆగివుంది.

టాక్సీ బోనెట్‌ను ఆనుకుని జగ్గూ నిలబడివున్నాడు. అతడు కుటిలంగా వ్యాన్‌వంక చూశాడు.

"డబ్బు చూచేటప్పటికి మీకు మతులు పోయాయి!"

అరిచాడు జగ్గూ.

"అరె! నువ్వు ఎలా తప్పించుకున్నావ్‌రా బద్మాష్!" అన్నాడు బాస్.

జగ్గూ పకపక నవ్వాడు.

"సైమన్ గాడు గది వెనకపోలుగా త్రవ్వుతున్నాడు. బాస్! నువు వాడిని టెలిస్కోపిక్ గన్‌తో గుమ్మంలో నిలబడి కాల్చావు. అప్పుడే నువు నా పేరు యెత్తావు. నన్ను చంపమని శోషి గాడిని పురమాయించడం నా గదిలోకి వినిపించింది. అంతే—నేను బయటకు పారి పోయాను. బయట పొదలలో నాకు ఈ టాక్సీ కనిపించింది. బహుశా సైమన్ గాడు దీన్ని తెచ్చివుంటాడు. నేను దీంట్లో పారిపోయి వచ్చాను!"

"వచ్చి యిక్కడ కాచుకున్నావేం?"

"నగర పొలిమేరలు! మీరు గొడవ పెట్టుకుంటే అల్లరవుతుంది. అల్లరికి మీరు సిద్ధపడివుండరు. నాకు వాటా దక్కుతుంది!"

"రాజుగాడితో పాటు నువ్వూ ఆ ఇంద్రమహల్ శిధిలాలలో ఇరుక్కుపోతావనుకున్నానురా బద్మాష్...." బాస్ మాట ముగియకుండానే టెలిస్కోపిక్ రైఫిల్ కిటికీలోంచి బయటకు వచ్చింది.

"షకీలా!" అరవబోయాడు శోషి.

జగ్గు చటుక్కున బోనెట్ యెత్తి టెలిస్కోపిక్ గన్ తీశాడు. అప్పటికే ఆలస్యమయిపోయింది.

షకీలా చేతిలోని రైఫిల్ పేలింది.

జగ్గూ కూలిపోయాడు. రక్తం వరదలాగా రోడ్డు మీదకు కారుతోంది. అతడి భుజంవద్ద కండ యెగిరి పోయింది.

"జోషీ!" అరిచాడు బాస్.

జగ్గూ బాధగా తలెత్తి చూశాడు.

జోషి వేన్ని స్టార్టు చేశాడు. వేన్ కొండని ఒరుసుకుంటూ ముందుకు వొస్తోంది.

జగ్గూ ప్రమాదాన్ని పసిగట్టాడు. అదృష్టం! తూటా తన భుజంలో గుచ్చుకున్నది. కాని తాను ఇప్పుడు వ్యాన్ క్రింద పచ్చడి అవుతాడు!

చటుక్కున టాక్సీకింద దొర్లాడు. అతడి టెలిస్కోపిక్ గన్ని తాకీతాకకుండా వ్యాన్ ముందు కురికింది.

"వాడు చావలేదు! షకీలా! నువ్వు చండాలంగా ప్రవర్తించావ్!" బాస్ నిప్పులు కక్కుతున్నాడు. "చూడు! తుపాకీ శబ్దానికి జనం యిటు వస్తున్నారు!"

వ్యాన్ వేగం పుంజుకుంది. నేషనల్ హైవే దాటి డాబా గార్డెన్స్లో చొరబడింది.

"ఈ డబ్బు హోటలుకి ఎందుకు? రాజు గదిలో దాచుదాం!" అన్నాడు బాస్.

జోషి తలూపి కారును అస్సాం గార్డెన్స్ వైపు తిప్పాడు.

# 8

"డిటెక్టివ్ శరీఫ్ ఈజ్ స్పీకింగ్!" అన్నాడు శరీఫ్.

"నేను కుమార్ని. వెంకోజీపాలెం మలుపులో తుపాకీ పేలినట్టు రిపోర్టు వచ్చింది! నీకు ఇంటరెస్టు వుందా?"

"ప్రస్తుతం ఖాళీగా వున్నాను....వస్తాను!"

"ఆల్ రైట్! నేను అక్కడ వుంటాను!" అవతల ఫోన్ క్లిక్మన్నది.

డిటెక్టివ్ శరీఫ్ రిసీవర్ క్రెడిల్ చేశాడు. చకచక బయటకు నడిచాడు. గారేజీలోంచి డాట్సన్ కారు

తీశాడు.

శిరీష్ వెంకోజీపాలెం మలుపులో కారు ఆపాడు. అప్పటికే అక్కడ పోలీసు జీపులు రెండూ, ఒక అంబులెన్స్ వ్యానూ వున్నాయి. డిటెక్టివ్ ఇన్స్పెక్టర్ కుమార్ తన సిబ్బందికి సూచనలివ్వసాగాడు.

శిరీష్ కారు దిగి పోలీసులవద్దకు నడిచాడు.

రోడ్డుమీద రక్తం మడుగు కట్టివుంది.

కుమార్ తలతిప్పి శిరీష్‌ను చూచి పలకరింపుగా నవ్వాడు.

"ఉదయం అయిదుగంటల ప్రాంతంలో ఇక్కడ తుపాకీ కాల్పు వినిపించిందట. ఇద్దరు ముగ్గురు రైతులు ప్రక్కపొలాల్లోంచి ఇక్కడకు వచ్చేసరికి ఒక పెద్ద కారూ, దానివెనుక కొద్దిసేపట్లో టాక్సీ వెళ్ళిపోతూ కనిపించాయట!" అన్నాడు కుమార్.

శిరీష్ ఆలోచనలో పడ్డాడు.

"తుపాకీని ఎవరు కాల్చారు?" అడిగాడు శిరీష్.

"ఏమో, యెవరు చూడలేదు?"

"టాక్సీ, పెద్దకారు—బహుశా వ్యాన్ వంటి వాహనం ఒకదానితో ఒకటి పోటీలుపడి పరుగెత్తాయా?"

"ఇక్కడ రోడ్డు టర్న్ కావడంవలన ఏం జరిగిందీ యెవరూ చెప్పలేకపోతున్నారు!"

"ఐ.సీ....రోడ్డుమీద రక్తం వుంది కాని శవంలేదు."

శిరీష్ మాటలు ముగియకముందే వ్రేలిముద్రలనిపుణుడు కుమార్‌ను సమీపించాడు.

"రక్తంతో తడిసిన వ్రేళ్ళముద్రలు రోడ్డుమీద దొరికాయి సార్! రోడ్డుమీద వ్రేలిముద్రలు వదలిపెట్టిన వ్యక్తి తీవ్రంగా గాయపడివుండాలి. తరువాత లేచివెళ్ళి

పోయివుండవచ్చు!" అన్నాడు వ్రేలిముద్రల నిపుణుడు.

"రక్తం స్పెసిమన్ తీసుకున్నారా?"

"పాథాలజీ సర్జన్ గారు తీసుకున్నారు."

"పెద్దకారూ చిన్నకారూ ఒకదాన్నొకటి తరుముకుంటూ నగరంవైపు వెళ్ళాయి కదూ!" అడిగాడు శరీఫ్.

కుమార్ తలూపాడు.

"ఆ వాహనాలను నడిపేవాళ్ళను యెవరయినా చూశారేమో?"

"దర్యాప్తు చేద్దాం!"

"తీవ్రంగా గాయపడిన వ్యక్తి టాక్సీలోని వ్యక్తా? వ్యాన్‌లోని వ్యక్తా?"

"వ్యాన్‌ని టాక్సీ తరుముకొంది. టాక్సీయే ఆలస్యంగా బయలుదేరింది. అంటే గాయపడిన వ్యక్తే బలం కూడదీసుకుని తిరిగి వ్యాన్‌ని ఫాలో అయాడనుకోవాలి."

## 9

బాస్ వాచీ చూసుకున్నాడు.

ఉదయం పదిగంటలు!

జోషి బయటికి జగ్గుకోసం వెళ్ళాడు. ఆటోలో వస్తానని ఆరుగంటలకు డాబా గార్డెన్స్‌లో దిగిన షకీలా యింతవరకూ రాలేదు.

షకీలా ఏమయింది? ఆమె జోషిని కలసిందా? జగ్గూ తీవ్రంగా గాయపడి కూడా టాక్సీలో తమని కొంతదూరం వరకు వెంటాడాడు. వాడికి తర్వాత ఏం జరిగింది? తాను యింతసేపూ రాజా గదివద్ద కాపలావుండి వచ్చాడు.

షకీల జగ్గుకోసం వెళ్ళివుంటుంది.

బల్లమీద టెలిఫోన్ గణగణలాడింది. బాస్ రిసీవర్ యెత్తాడు.

"ఎస్ .... చెప్పు!" అన్నాడు బాస్.

"నేను బాస్! జోషిని! జగ్గుగాడు కనిపించాడు."

"యెక్కడ?"

"జైల్ రోడ్డుమీద. సరిగ్గా వాల్తేరు సిమెట్రీ దగ్గర పెట్రోలు అయిపోయినట్టుంది. అక్కడే ఆగిపోయింది కారు!"

"జగ్గూకి ఎలావుంది?"

"తెలియదు బాస్ టాక్సీ చుట్టూ పోలీసులు!"

"జోషీ! ..." బాస్ చూపు నిలిబడిపోయింది. కిటికీ లోంచి అవతలి భవనం కిటికీ స్పష్టంగా కనిపిస్తోంది. ఆ కిటికీవద్ద ఎవరో బైనాక్యులర్స్‌తో నిలబడివున్నారు.

బైనాక్యులర్స్ తన కిటికీవైపే గురిపెట్టి వున్నారు.

ప్రస్తుతం తన వునికి జోషికి షకీలాకి తప్ప యెవరికి తెలియదు! రాజా, సైమన్ ఇంద్రమహల్‌లో చచ్చి పోయివుంటారు! జగ్గూ.... వాడు పోలీసుల చేతులలో పడితే..అవును పడ్డాడు. తన రహస్యం చెప్పివుంటాడా?

"బాస్ మాట్లాడరేం?"

"చెబుతాను. మనగది కిటికీకి అవతలివైపున భవనం లోంచి ఎవరో మననే చూస్తోన్నట్టు...." బాస్ ఆగి పోయాడు. బైనాక్యులర్స్ కిటికీలోంచి తప్పుకున్నాయి.

కిటికీలోంచి నల్లటి వలయం కనిపిస్తోంది.

అదేమిటి?....

బారెల్ ....తుపాకీ గొట్టం....

బాస్ చటుక్కున గోడప్రక్కకి తప్పుకోబోయాడు.

గుండెలలో అగ్గిరవ్వ దూరినట్టయింది. కూకటివ్రేళ్ళతో కూలిపోయే చెట్టులాగా బాస్ నేలమీదకు ఒరిగి పోయాడు. రిసీవర్‌కి వున్న వైర్ పొడవుగా సాగింది.

క్షణంపాటు శరీరం తిరగబడింది.

రిసీవర్ అతడి శరీరం క్రిందపడి తునాతునకలయింది.

## 10

రాజు పరుగెత్తుతున్నాడు. అర్ధరాత్రినుండి ఫకీరు తానూ కలసి నడుస్తున్నారు. ఇంద్రమహల్ లోంచి తాము బయట పడటం ఒక్క క్షణం ఆలస్యమైవున్నా చాలును, తామిద్దరూ సమాధి అయేవాళ్ళు! భవనం పెద్ద మట్టి కుప్పలాగా అయింది.

దుర్మార్గులు! టాక్సీని కూడా పట్టుకుపోయారు.

నాటుదారిన అడ్డంపడి యెలాగయితేనేం తామిద్దరూ పది మైళ్ళ దూరం నడిచారు. రాళ్ళు గుచ్చుకుని కాళ్ళు రక్తాలు కారుతున్నాయి. ముళ్ళపొదల్లో దూరి బట్టలు చీలికలయాయి. నడకలోనే తెల్లవారింది.

ఫకీరు మౌనంగా నడుస్తున్నాడు.

ఎండ తీవ్రంగా వుంది.

ఉదయం తొమ్మిదయింది.

ఇద్దరూ నాటుదారి వదలిపెట్టారు.

సిమెంటు రోడ్డుమీద మరో గంట గడిస్తేకాని మధురవాడ గ్రామం తగలలేదు.

విశాఖపట్నంనుండి వస్తోన్న ఇరవైఅయిదో నెంబర్ సిటీబస్సు మలుపుతిరిగి షెల్టర్ వద్ద ఆగింది.

"సిటీబస్సు ఎక్కుదాం. నా దగ్గర డబ్బులున్నాయి" అన్నారు ఫకీరు.

వాళ్ళిద్దరిముందూ పోలీస్ జీపు ఆగింది.

జీపులోంచి నలుగురు పోలీసులు దిగి వాళ్ళను చుట్టు ముట్టారు.

వాళ్ళలో క్రైంబ్రాంచ్ యిన్స్పెక్టర్ కుమార్ను

గుర్తుపట్టాడు పకీరు.

కుమార్ కూడా యిద్దరినీ గుర్తుపట్టాడు. "మీరిద్దరూ జేబుదొంగలు కదా!" కర్కశంగా అరిచాడు కుమార్.

రాజూ, పకీరూ తలలూపారు.

"మీ యిద్దరితో తిరిగే సైమన్ ఇంద్రమహల్‌లో చనిపోయాడు, అవునా?" అడిగాడు కుమార్.

రాజూ, పకీరూ మొహాలు చూసుకున్నారు.

"జగ్గు దొరికాడు. వాడే చెప్పాడు రాజూ ఇంద్ర మహల్‌లో వున్నట్టు."

"బాస్ దొరికాడా సార్?" అడిగాడు రాజు.

"బాస్ యెవరు?"

"జగ్గు చెప్పలేదా?"

"జగ్గు నీగురించి ఒక ముక్క చెప్పి చచ్చిపోయాడు!"

రాజు నిట్టూర్చి చెప్పడం మొదలుపెట్టాడు.

## 11

హోటల్ ప్లాజా ఆవరణలో పోలీస్ జీపులు ఆగాయి. కుమార్, పోలీస్ సిబ్బందీ, డిటెక్టివ్ శరీఫ్ హోటలులో ప్రవేశించారు. రెండో అంతస్తులో పన్నెండో నెంబర్ రూంముందు ఆగారు.

రూం తలుపులు బార్లా తెరిచివున్నాయి.

గదిలో నేలమీద ఒక ఆకారం బోర్లగిల పడివుంది. నేలమీద రక్తం మడుగుకట్టింది. అతడి బట్టలు రక్తంతో తడిసివున్నాయి. వీపువద్ద పెద్ద రంధ్రం కనిపిస్తోంది.

శరీఫ్ గదిలో పరిశీలనగా చూశాడు.

గోడదగ్గరేదో వస్తువు ఎర్రగా మిలమిలలాడుతోంది.

శరీఫ్ నేలమీదకు ఒంగాడు.

రక్తంతో తడిసిన తూటా.

వ్రేలిముద్రల నిపుణుడూ, ఫోటోగ్రాఫరూ తమ విధి నిర్వహణాలో మునిగిపోయారు.

పోలీసుల అట్టహాసానికి హోటల్ మేనేజర్ గడగడ లాడిపోయాడు.

"ఈ గది ఎవరి పేర బుక్ అయింది?" అడిగాడు కుమార్, గదిలోంచి బయటకు వచ్చి.

"కుందన్‌లాల్, ఢిల్లీ నుండి విహారయాత్రకి వచ్చాడు."

"యిది డబుల్ రూం కదూ!"

"అవున్సార్!"

"అతడి కూడా ఎవరు వచ్చారు?"

"అతడి కూడా ముగ్గురు నలుగురు వచ్చారు. నాకు వాళ్ళెవరో సరిగ్గా గుర్తులేదు."

"ఏం?"

"రోజూ వెయ్యిమంది వస్తారు వెళ్తారు ఎవరు ఎవరి తాలూకాయో పట్టించుకునే తీరికా వ్యవధీ నాకు వుండవ్!"

"గదిలో స్త్రీలుపయోగించే కాస్మెటిక్స్ వున్నాయి. కుందన్‌లాల్ వెంట స్త్రీలు వచ్చారా?"

"అతడి భార్య షకీలా!"

"ఆమె ఒక్కతే వచ్చిందా?"

"అవును స్త్రీ అయితే ఆమె ఒక్కతే!"

"ఈ ఉదయంనుండీ ఆమె బయట కనిపించిందా?"

"లేదు సార్! మూడు రోజులనుండి ఈ గదికి నేను ఎలాంటి బిల్లులూ జమచేయలేదు."

"ఏం?"

"మూడు రోజులక్రితం కుందన్‌లాల్ తన కుటుం బంతో బయటికి వెళ్ళినట్టు రూం సర్వీస్ బాయ్

చెప్పాడు!"

"అంటే గదిని తన స్వాధీనంలో నే వుంచుకుని!"

"అవును సార్!"

"అతడు వాహనంలో వచ్చాడా?"

"తెలియదు సార్!"

"షకీలాగానీ, కుందన లాల్ అనుచరులుగానీ తిరిగి హోటల్ కి వస్తే మాకు తెలియచేయండి!"

"తప్పకుండా సార్!"

ఫోటోగ్రాఫరూ, వేలిముద్రల నిపుణుడూ గది లోపలకు వచ్చారు.

పాథాలజీ సర్జన్ చేతులకివున్న గ్లవ్స్ తొలగించుకుని కుమార్ ని సమీపించాడు.

"తుపాకి తూటాతో ప్రాణం పోయింది. క్షణాల వ్యవధిలో ప్రాణంపోయింది."

"ప్రాణంపోయి యెంతసేపయి వుంటుంది?"

"గంటలోపు. శవం యింకా గదిలోని ఉష్ణోగ్రతకి సమానమైన ఉష్ణోగ్రతలో వుంది."

"డాక్టర్ గారూ! ప్రాణం యెలాపోయి వుంటుందని మీ వూహా!"

"హంతుడు టెలిఫోన్ చేస్తూండగా తూటా తగిలింది. శరీరంలోంచి తూటా వెనకభాగానికి దూసుకువచ్చి గదిలో గోడదగ్గర పడింది."

"అంటే హంతుడు కిటికీకి తిన్నగా అంటే మొహం పెట్టి నిలబడి వుండాలి!"

"అవును. టెలిఫోన్ వున్న స్థితినిబట్టి అలాగే అను కోవాలి."

శిరీష్ మెల్లగా దగ్గాడు.

కుమార్ చెప్పమన్నట్టు చూశాడు.

"హంతకుడు రిసీవర్‌ను క్రెడిల్ చేయలేదు. అంటే లైన్ యింకా డిస్‌కనెక్టు కాలేదన్నమాట!"

"డిస్‌కనెక్షన్ కాకపోతే మనకేం?"

"కుమార్! చనిపోయిన వ్యక్తి కుందన్‌లాల్. అతడు తన పరివారంతో ఇంద్రమహల్‌ను శోధించాడు. రాజు మాటలనుబట్టి ఆ స్త్రీని చేజిక్కించుకున్నాడు. హోటల్ గదిలోకి వచ్చాడు. సరిగ్గా నాలుగు గంటల తర్వాత తన హోటల్ గదిలో చచ్చిపడివున్నాడు. చనిపోవడంకూడా టెలిఫోన్‌లో మాట్లాడుతూ చనిపోయాడు. గదిలో ఆ స్త్రీ వున్నట్టులేదు. హోటల్ ఫర్నిచర్ తప్పించి అతడి సొంత లగేజిలేదు. అంటే మూడురోజుల క్రితం అతడి గదిని ఖాళీచేస్తోన్నట్టు చేసి గదిని తన స్వాధీనంలో ఉంచుకున్నాడన్న మాట...."

"అవును. అయితే....అతడి ముఠాలోనే యెవరో ఈ హత్య చేశారంటావా?"

"అవును. రాజు చెప్పినమాట నిజమైవుంటే కుందన్‌లాల్‌కి షకీలా భార్యగా నటిస్తోంది. వాళ్ళది చట్ట సమ్మతమైన పెళ్ళికాదు. పైగా యిద్దరికీ వయస్సుల మధ్య తేడా చాలా వుంది!"

కుమార్ అయోమయంగా చూశాడు.

"పాయింటుకి వస్తున్నాను. తూటా కిటికీలోంచి దూసుకువచ్చింది. ఎలా వచ్చి వుంటుంది. కిటికీలోంచి అవతలప్రక్క ఉన్నది సన్ ఎన్ సాండ్ హోటల్. ఈ గది కిటికీకి సమాంతరంగా ఉన్న గదిలోంచి తూటా దూసుకువచ్చింది. అంటే హత్య చేసినవాళ్ళు ఈ కిటికీకి యెదురుగా ఉన్న సన్ ఎన్ సాండ్ గదిని అద్దెకు తీసు

కని ఉంచుకున్నారన్న మాట!"

"వెరీగుడ్ లాజిక్!"

"ఈ గదిలోకి వచ్చిన టెలిఫోన్ కాల్ సన్ ఎన్ సాండ్ గదిలోంచి వచ్చిఉండాలి!"

కుమార్ కళ్ళు పెద్దవిచేసి చూశాడు.

"నాకు పరిస్థితి అర్థమవుతోంది. కుందన్‌లాల్‌ని హత్య చేయాలని వేసుకున్న పథకం యిప్పుడు స్పష్టమయింది. ఆ గదిలో యిద్దరు వుంటారు. ఒకడు ఫోన్ చేసి కుందన్‌లాల్‌ని టెలిఫోన్ దగ్గరకు రప్పిస్తాడు. టెలిఫోన్‌లో మాట్లాడే వ్యక్తి కిటికీకి తిన్నగా నిలబడవలసి వస్తుంది! హత్యచేసే తుపాకీకి గురి కుదురుతుంది. అతను మాట్లాడేటప్పుడు ఆ గదిలోవున్న తుపాకీ ప్రేలుతుంది."

శిరీష్ శవాన్ని దాటుకుంటూ కిటికీలోంచి అవతలకు చూశాడు!

"ఈ రెండు కిటికీల మధ్య పాతిక అడుగుల రోడ్డు ఉంది. అటు పది అడుగులూ ఇటు పదడుగులూ మొత్తం నలభైఅయిదూ—యాభై అడుగుల దూరంలో తుపాకీ టార్గెట్ వున్నాయి. తూటా తన లక్ష్యాన్ని ఛేధించింది."

"అవతల హోటల్ గదికి వెళ్దాం!"

## 12

బల్లమీద టెలిఫోన్ గణగణలాడింది.

షకీలా రిసీవర్ ఎత్తింది.

"షకీలా నేను జోషిని మాట్లాడుతున్నాను."

"మధురవాడ పోస్టాఫీసు నుండి!"

"సక్సెసయిందా?"

"అయిందనుకుంటాను. దూరంనుండి బైనాక్యులర్స్‌తో చూశాను. పోలీసులు శిథిలాలు త్రవ్వుతున్నారు. సైమన్

శవం బయటపడింది. ఇంకా రాజుగాడి శవం దొరకాలి!"

"అదే దొరుకుతుంది వచ్చెయ్యి."

"అలాగే... జగ్గూ మనగురించి ఏమీ చెప్పకుండానే చచ్చిపోయాడు. అదృష్టం! బాస్ శవం దగ్గర కూడా మన ఆచూకీ తెలియలేదు."

"వెరీగుడ్! నాకు ఒంటరితనంగా వుంది రా! వచ్చెయ్యి!"

"ఆల్ రైట్!" అవతల క్లిక్ మన్నది.

# 13

"సైమన్ శవంలోంచి బయటపడిన తూటా, కుందన్ లాల్ శవంలోంచి బయటపడిన తూటా ఒకే తుపాకీ లోంచి ప్రేల్చినవి. .28 బోర్ రాస్ ఏక్సివెరీటెక్ రైఫిల్ లోంచి వచ్చిన తూటాలవి! కుందన్ లాల్ హత్య సందర్భంలో ఆ తుపాకీకి టెలిస్కోప్ ఏర్పాటు అమర్చి వుండాలి. అందుకే లక్ష్యబేధనలో తూటా దానికున్న వేగం సెకండుకి 4,500 అడుగుల చొప్పున ప్రయాణిం చింది" అన్నాడు బాలిస్టిక్ ఎక్స్‌పర్ట్.

శరీఫ్ క్షణం ఆలోచించి "జగ్గూని గాయపరచింది కూడా అదే తుపాకీలోంచి బయటపడ్డ తూటా అయి వుంటుందా?" అన్నాడు.

ఎక్స్‌పర్ట్ తన కాగితాల్లో తలదూర్చాడు.

"జగ్గూ వ్యవహారంలో మనకి తూటా దొరకలేదు. అయితే అతడి భుజానికయిన గాయం తుపాకీ తూటా వల్లనే యేర్పడివుండాలి. గాయంవద్ద కండరాలు నలిగిన ఒత్తిడిని ఫోరెన్సిక్ లాబ్ లో గమనించ గలిగాను. ఒత్తిడిశక్తి 2,8000 ఫుట్ పౌండ్లు. అంత శక్తితో తూటాను వెలువరించే శక్తి .28 బోర్ రాస్ ఏక్సి

లెరెబెడ్ రైఫిల్ కే వుంది."

"మై గుడ్‌నెస్! క్రూరజంతువులను వేటాడే పాత కాలం నాటి తుపాకీ!" అన్నాడు కుమార్.

సార్జెంట్ లోపలకు వచ్చాడు.

కుమార్ ఏమిటన్నట్టు చూశాడు.

"టాక్సీ దొరికింది సార్! సన్ ఎన్ సాండ్ హోటల్ వెనుకవున్న తుమ్మపొదల మధ్య ఆగివుంది. మెటాడోర్ వ్యాన్‌లోనూ, టాక్సీలోనూ వ్రేలిముద్రలు సేకరించాం!"

"వెరీగుడ్!" శరీఫ్ బల్లమీద వంగాడు.

కుమార్‌కి సూచనలివ్వసాగాడు.

"ఆల్‌రైట్! నువ్వు చెప్పినట్టుగా అన్ని దినపత్రికలలో వేయిస్తాను!" అన్నాడు కుమార్.

# 14

"షకీలా భవనం మెట్లు యెక్కింది. ఒక గదిలో ప్రవేశించింది. కిటికీవద్దకు నడిచింది. కిటికీలోంచి బయటకు చూచింది. జనరల్ ఆస్పత్రి భవనంలో ఆ భాగం కనిపిస్తోంది. గాజు కిటికీకి ప్రక్కగా రాజు పడుకుని ఉన్నాడు. అతడి శరీరమంతా కట్టుకట్టివుంది.

బైనాక్యులర్స్‌తో అతడిని పరిశీలనగా చూసింది. చకచక ఎయిర్‌బాగ్‌లోంచి టెలిస్కోపిక్ రైఫిల్ తీసి బారల్ ఫిట్ చేసింది. గురిచూస్తూ ట్రిగ్గర్ లాగబోయింది.

ఆమె చేతిలోవున్న రైఫిల్ యెగిరిపడింది. చేతికి నిప్పుకణిక అంటించినట్టయింది రక్తం కారుతోంది.

షకీలా తెల్లబోయింది.

రైఫిల్ కింద పిట్టగోడమీద పడింది.

షకీలా కిందకు చూచింది.

క్రైంబ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ కుమార్ పిట్టగోడ

మీద నిలబడ్డాడు. అతడి చేతిలో రివాల్వర్ ఆమె తలకు గురిపెట్టివుంది.

షకీలా వెనక్కి పరుగెత్తి తలుపులు తీసింది.

పోలీసులు యెదురువచ్చారు.

డిటెక్టివ్ శిరీష్ ఆమెకు సమీపించాడు.

"షకీలా! నీ వ్రేలిముద్రలు నిన్ను పట్టించాయి. సన్ ఎన్ సాండ్ గదిలో, వ్యాన్‌లో, ప్లాజాలో పన్నెండో గదిలో నీ వ్రేలిముద్రలే! నీతో బాటువున్న వ్రేలిముద్రల్లో నీకు సహకరించిన వ్యక్తి వ్రేలిముద్రలు సన్ ఎన్ సాండ్ గదిలో టెలిఫోన్ మీద దొరికాయి. ఆఫ్‌కోర్స్! జగ్గూ, కుందన్‌లాల్, సైమన్‌లను కాల్చింది ఈ రైఫిల్‌తోనే అనే విషయం పరిశోధనలో తెలుస్తుంది. రాజు మాకు దొరికినట్టు నీకు తెలిసివుండదనే తెలుసుకుని దినపత్రికలలో అతడు జనరల్ ఆస్పత్రిలో వున్నట్టు ప్రకటన ఇచ్చాం!" అన్నాడు శిరీష్.

కుమార్ పైకి వచ్చాడు. అతడి చేతిలో రైఫిల్ వుంది.

"ఇంద్రమహల్‌లో ఆస్తిని చేజిక్కించుకోవడమే కాకుండా ఆస్తికి మిగిలిన వారిసుడిని కూడా మట్టుపెట్టాలని ప్రయత్నించావు. కుందన్‌లాల్‌ని చంపి ఆ స్తితో పారిపోయివుంటే నిన్ను పట్టుకోవడం కాస్త కష్టమయ్యేది" అన్నాడు కుమార్.

"అంతేకాదు! షకీలా గురించీ ఆమె ప్రియుడిగురించీ ఖచితమైన సమాచారం యివ్వగలిగేది రాజు ఒక్కడే! అందుకు కూడా అతడిని మట్టుపెట్టాలని చూసింది షకీలా!" అన్నాడు శిరీష్.

షకీలా తల వొంచుకుంది.

—:ఐ పో యిం ది:—

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును. •

సీరియల్

# రక్తంత్రాగే పిశాచం

వసుంధర




(గత సంచిక తరువాయి)

తనకు రానున్న అమానుష శక్తులపై ఎన్నో ఆశలు పెట్టుకొంది వకుళ.

ఆగడమే మంచిదనుకొన్నాడు కోదండం. అందుకే-

"ఎన్నాళ్ళు?" అనడిగాడు.

"నెల్లాళ్ళు...." అంది వకుళ.

"అప్పుడు...."

"అంత కాలం నాతో స్నేహంగా వుండగలిగితే నా మొదటి ప్రయోగం నీమీద నే!" అంది వకుళ.

"ప్రయోగమా - అంటే?" అనడిగాడు కోదండం ఆశ్చర్యంగా.

"అందమైన ఆడపిల్ల ఇష్టపడ్డ స్నేహితుడిపై చేసే ప్రయోగం ఏమిటో తెలుసుకోలేవూ?"

ఊహించగానే ఏదో ఆనందం కలిగింది కోదండానికి. ఊహాలో పరవశిస్తూ అతడు రోజులు గడుపుతున్నాడు.

వకుళ రోజులు లెక్కపెట్టుకొంటోంది.

జపం చేయాల్సిన ఆఖరు అమావాస్య సరిగ్గా ఇంక నాలుగురోజులుంది.

ఇంతవరకూ అన్నీ సవ్యంగా అయిపోయాయి. ఇది కూడా సవ్యంగా అయిపోతే.... అప్పుడు ....

# 6

ప్రొఫెసర్ మహాదేవుడు కుర్చీలో కూర్చొని చేతి గడియారం వంకనే చూస్తూ — "మిస్టర్ లింగం! సొల్యూషన్ రంగు మారిందా?" అనడిగాడు.

"ఇంకా లేదండి-" అరిచాడు లింగం.

"ఈపాటికి రంగు మారాలే...." అని మనసులో గొణుక్కొని-"స్టాప్ వాచి వుపయోగించు. సరిగ్గా ఎంత సేపటికి రంగు మారిందో సెకన్లతోసహా చెప్పాలి-" అంటూ అరిచాడు మహాదేవుడు.

"ఆ ఏర్పాట్లన్నీ ముందే చేశాను సార్!" అన్నాడు లింగం.

మహాదేవుడు లింగం మాటలు వినలేదు. ప్రయోగం గురించి గంభీరంగా ఆలోచిస్తున్నాడు. ఆయన ఆలోచనల్లో వుండగానే కాలింగ్ బెల్ మ్రోగింది.

ఇంటి పనివాడు వెళ్ళి తలుపు తీశాడు.

"ప్రొఫెసర్ గారున్నారా?"

"వున్నారు. మీరెవరు?"

"నా పేరు భీమారావు. జర్నలిస్టును. ఆయన్ను కలుసుకోగోరుతున్నాను-" అన్నాడతను.

పనివాడు భీమారావును వేరే గదిలో కూర్చోబెట్టి మహాదేవుడికి చెప్పాడు. తనలో తనే ఏదో గొణుక్కుంటూ మహాదేవుడు ఆ గదిలోకి వెళ్ళాడు.

భీమారావు లేచి నిలబడి-"నమస్కారం సార్!" అన్నాడు.

"కూర్చో!" అన్నాడు మహాదేవుడు. ఇద్దరూ కూర్చున్నారు.

"మీరు వుద్యోగానికి రాజీనామా ఇచ్చారని తెలిసింది. కారణం తెలుసుకోవచ్చా?" అనడిగాడు భీమారావు.

"చాలా సింపుల్. నేను చేయాలనుకున్న పరిశోధనలకు వాళ్ళొప్పుకోలేదు. అవి కొనసాగించడం నా జీవన ధ్యేయం. అందుకే ఉద్యోగం వదిలిపెట్టి ఇంట్లో పరిశోధనలు మొదలెట్టాను. డబ్బుకు నా కెప్పుడూ ఇబ్బంది లేదు."

"ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకండి సార్! ఇప్పుడు ఇండియాలో సైంటిఫిక్ అడ్మినిస్ట్రేషన్ చాలా ఘోరంగా ఉంటోంది. టాప్ లెవెల్లో వున్నవాళ్ళు మిగతా వాళ్ళను పైకిరాకుండా అణచివేయడానికి ప్రయ

త్నిస్తున్నారని అంతా చెప్పుకుంటున్నదే! మీ రాజీనామా అలాంటికే సేసని నా నమ్మకం. మీ ఉదాహరణలో ఓ వ్యాసం రాశానంటే మినిస్ట్రీ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ అదిరిపోవాలి" అన్నాడు భీమారావు.

"అబ్బే అదేంలేదు. నాకు పై అధికార్లతో గొడవలు లేవు. మా రిలేషన్స్ చక్కగా వున్నాయి. అయితే ప్రతి సంస్థకూ కొన్ని పరిమితులుంటాయి. ఆ పరిమితులకు లోబడి పని చేయాలి మేము. నేనెన్నుకున్న పరిశోధన ఆ సంస్థ పరిమితిలోలేదు. ఇందులో యెవరినీ అపార్థం చేసుకోకూడదు. అనవసరపు రాజకీయాలు నాకు గిట్టవు. కాబట్టి నన్ను నిరుత్సాహపరుస్తున్నాననే చెప్పాలి!" అన్నాడు మహాదేవుడు.

"వ్వోవ్వోవ్వో-నాటెటాల్ సార్! మీరు చెప్పింది వినగానే నా ఉత్సాహం పెరిగింది. ఉద్యోగం కూడా వదిలి కొనసాగిస్తున్న ఆ పరిశోధన ఏమిటో తెలుసుకోవాలని నేనాత్రపడుతున్నాను" అన్నాడు భీమారావు.

"ఒక్కమాటలో చెప్పాలంటే చచ్చిన వాళ్లను బ్రతికించడానికి ప్రయత్నిస్తున్నాను" అన్నాడు మహాదేవుడు తాపీగా.

"చచ్చినవాళ్ళను బ్రతికించడమా? అది సాధ్యమా?" ఆశ్చర్యంగా అడిగాడు భీమారావు.

"సాధ్యం కావచ్చునని నా తొలిప్రయోగాలు సూచించాయి. అందుకే పరిశోధనలు కొనసాగిస్తున్నాను. నా అసిస్టెంట్ లింగం అహోరాత్రాలూ శ్రమపడుతున్నాడు నా పరిశోధనలకోసం!" అన్నాడు మహాదేవుడు.

"సార్-చిన్న సందేహం-మీరు చచ్చిన మనుష్యుల్ని బ్రతికించుకుంటూపోతే ఈ ప్రపంచం ఏమైపోతుంది?

మరో సైంటిస్టెవడో-ఇక మనుషులు పుట్టకుండా చేయాలి అంతేనా?" అన్నాడు భీమారావు.

ఇలాంటి ప్రశ్న భీమారావు ముందే వేస్తాడని ఊహించినట్లుగా నవ్వాడు మహాదేవుడు. కానీ ఆయన వెంటనే మాట్లాడలేదు. ఒక్క నిమిషం ఆగి "ఈ మాత్రం ఆలోచన నాకు తట్టలేదనుకోకు. కానీ నా పరిశోధన నువ్వనుకుంటున్న వైపు కాదు. నేను చనిపోయిన వారికి ప్రాణం పోస్తానని అనడంలేదు. అండర్ స్టాండ్!" అన్నాడు.

ఇప్పుడు భీమారావుకి నిజంగా ఏమీ అర్థంకాలేదు. చచ్చినవాళ్లని బ్రతికిస్తానంటాడు. పోయిన వాళ్ళకి ప్రాణం పోయలేదంటాడు. రెండూ యెలా సాధ్యం?

తన సందేహాన్ని భీమారావు సూటిగానే అడిగేశాడు.

మహాదేవుడు మళ్ళీ నవ్వాడు "నేననుకున్న ప్రశ్నే వేశావు. మీ జర్నలిస్టులకు కాకమ్మ కథలల్లడమే కానీ మేధావులతో మాట్లాడ్డం చేతకాదు. నీకిప్పుడు కొన్ని ఉదాహరణలిస్తాను. అర్థంచేసుకుందుకు ప్రయత్నించు."

ప్రొఫెసర్ మహాదేవుడిచ్చిన మూడు ఉదాహరణలూ ఇవి.

పెట్రోల్ లేక కారు ఆగిపోతుంది. దగ్గర్లోనే పెట్రోల్ బంక్ వుంటే కారును కాస్త తోసి మళ్ళీ కొంత దూరం నడపవచ్చును. ఆ తోయడంలో టాంక్ అడుగున వున్న పెట్రోల్ యెలాగో ఇంజన్ని ప్రవేశించి కారు మళ్ళీ స్టార్టవుతుంది.

సిలిండర్లో గ్యాస్ అయిపోతుంది. స్టవ్ వెలగదు. కాసేపు ఓపికగా సిలిండర్ను కదుపుతూ కూర్చుంటే మళ్ళీ స్టవ్ వెలిగించవచ్చు.

రేడియోలో బ్యాటరీ అయిపోతుంది. బ్యాటరీని కాసేపు అటుమార్చి ఇటుమార్చి కుదిపి, కదిపి మళ్ళీ రేడియోలో వేస్తే కొంతసేపు రేడియో పనిచేస్తుంది.

"మూడు ఉదాహరణలూ నిత్యజీవితంలో అందరికీ యెదురయ్యేవే! మూడూ కూడా శక్తికి సంబంధించినవే! ఒకటి కారును నడిపించేశక్తి, రెండవది స్టవ్‌ను వెలిగించే శక్తి, మూడవది రేడియోను పలికించే శక్తి! మనిషి కూడా ఈ మూడు శక్తుల కలయిక. చలనం, తేజం, శబ్దం! ఈ మూడు శక్తులూ హఠాత్తుగా ఆగిపోతే వాటిని పునరుద్ధరించడం నా ఉద్దేశం" అని ఆగాడు మహాదేవుడు.

"అంటే అది మనిషికి ప్రాణం పోయడమే అవుతుంది కదా!" అన్నాడు భీమారావు.

"అందుకే నువ్వు జర్నలిస్టుగా వుండిపోయావు. నేను సైంటిస్టునయ్యాను" అని నవ్వాడు మహాదేవుడు. "నేను చెప్పిన మూడు ఉదాహరణల్లో కూడా శాశ్వత పరిష్కారం లేదు. ప్రాణంపోయడం ప్రసక్తిలేదు. ఆగిపోయిన కారు టాంక్‌లో పెట్రోల్ పోస్తేనే అది ప్రాణం పోయడం అవుతుంది. సిలిండర్‌ని మళ్ళీ గ్యాస్‌తో నింపితేనే అది గ్యాస్ స్టవ్‌కు శాశ్వత పరిష్కారం. రేడియోను బెడదలేకుండా వినాలంటే అయిపోయిన బ్యాటరీలు తీసేసి కొత్త బ్యాటరీలు వేయాలి. కానీ నేను చూస్తున్నది శాశ్వతపరిష్కారం కాదు. తాత్కాలిక పరిష్కారం. అంటే ఒకసారి చచ్చిపోయి నా కారణంగా బ్రతికిన మనిషి మళ్ళీ నూరేళ్ళు జీవించడు. అతడి అదృష్టాన్నిబట్టి గంటలో, రోజులో, నెలలో జీవిస్తాడు...."

"ఇందువల్ల మీరు సాధించదల్చుకున్నదేమిటి?"

"సామాన్యమానవులకున్న ప్రయోజనాలేమిటంటే—చెప్పాలనుకుని మర్చిపోయినవేమైనా ఉంటే మనిషి వాటిని చెప్పుకుందుకు అవకాశం లభిస్తుంది. నాకు సంబంధించినంతవరకూ ఒక అపూర్వప్రయోజనాన్నాశిస్తున్నాను" అని ఆగాడు మహాదేవుడు. భీమారావు తన వంక ఆత్రుతగా చూడడం చూసి తృప్తిగా నిట్టూర్చాడాయన. "అదేమిటంటే-మరణానంతరం ఏమయిందో తెలుసుకునే అవకాశం కూడా వుంది!"

భీమారావు శరీరంపై రోమాలు నిక్కబొడుచుకున్నాయి "ఎలా?" అన్నాడు అప్రయత్నంగా.

"ఒక ఎక్స్ చచ్చిపోయాడనుకో. అప్పుడు టైము పదయిందనుకో. నేను ఎక్స్‌ని పదకొండింటికి బ్రతికించాననుకో. పది నుంచి పదకొండు దాకా ఎక్స్ యెలాంటి అనుభూతులు చెందాడు? అతడి అనుభవాలేమిటి? ఇలాంటివి తెలుసుకోగలిగితే ఈ సృష్టికి సంబంధించిన అసలు రహస్యం దొరికినట్లే గదా!" అన్నాడు మహాదేవుడు.

"అవుననుకోండి. కానీ చచ్చిబ్రతికిన మనుషుల కథలు కొన్ని నాకూ తెలుసు. అవి ఒకదానికీ ఒకదానికీ పొసగవు" అన్నాడు భీమారావు.

"మన కేసు అలాంటిది కాదు. వందలకొద్దీ జనాన్ని పరిశోధిస్తాం. అంతమందిపై జరిపిన పరిశోధనలలో కొన్ని పోలికలు బయటపడక తప్పదు" అన్నాడు మహాదేవుడు కచ్చితంగా.

"మీ పరిశోధనలే గనుక ఫలిస్తే సృష్టిలో సంచలనం రేగుతుంది" అన్నాడు భీమారావు.

"నీ జర్నలిస్టు బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు. సంచ

లనం రేపడం నా ప్రధానోద్దేశ్యం కాదు. సృష్టిని తెలుసుకోవాలన్నది నా కోరిక."

"ఎంతకాలంలో మీ పరిశోధన ఒకదారికి వస్తుందంటారు?" అడిగాడు భీమారావు.

"ఈ రోజుకు అమావాస్య సరిగ్గా నాలుగు రోజులుంది. ఆపై అమావాస్యకు ఇంజక్షన్ తయారుచేయాలన్నది నా కోరిక" అన్నాడు మహాదేవుడు.

"అమావాస్య మంచి తిథి కాదు" అన్నాడు భీమారావు.

"అందుకే నేను దాన్ని ప్రత్యేకంగా ఎన్నుకున్నాను. సైంటిఫిక్‌గా కూడా అమావాస్యకూ, మనిషి చావుకూ కొన్ని కనెక్షన్సున్నాయి- ఈ విషయం నా పరిశోధనల వల్ల తేలింది" అన్నాడు మహాదేవుడు.

భీమారావు లేచి నిలబడి "మీకు చాలా శ్రమ ఇచ్చాను" అని సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"నాకు శ్రమలేదు. నువ్వు మరికాసేపు కూర్చోగలిగితే సంతోషిస్తాను"అన్నాడు మహాదేవుడు. "నా అసిస్టెంట్ ప్రయోగం మధ్యలో ఉన్నాడు. ఫలితంకోసం ఆత్రుతగా ఎదురు చూస్తున్నాను. టైమ్ కిల్లింగ్‌కు నువ్వు బాగానే దొరికావు. నా కింకా అతడి నుంచి పిలుపు రాలేదు."

"నేను వెళ్ళకతప్పదు సార్!" అంటూ భీమారావు లేచి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

మహాదేవుడు లోపలకు వెళ్ళి "లింగం ఇంకా రంగు మారలేదా?" అనడిగాడు.

"లేదుసార్!" అన్నాడు లింగం.

(ఇంకా వుంది)

